హైదరాబాదు ఆంధ్రసాహిత్య పరిషత్తు.
ప్రచురణము ౧.

# ఆదర్శ ప్రభువు

అను

## VII అసఫ్జా,

## పంచవింశతి వర్ష రాజ్యచరిత్రము

(క్రీ. శ. 1911 – 36)

కురుగంటి సీతారామయ్య, యం. ఏ.

౧౯౪౧ ]

[ రు. ౨-౦-౦

# వి ష య సూ చి క

## అధ్యాయము ౪



## అధ్యాయము ౫



## అధ్యాయము ౬

1919—1926



## అధ్యాయము ౭

1926—1937



## అధ్యాయము ౮



## అధ్యాయము ౯

### సింహావలోకనము

## ౧. జననము, విద్యాభ్యాసము

లెఫ్టినెంటు జనరల్ నవాబ్ మీర్ ఉస్మానల్లీ ఖాఁ బహద్దూర్ ప్రభువువారు 1886 సం॥ ఏప్రియల్ 6 తేదీన శ్రీజన్మమొందిరి. వీరి తండ్రిగారు ఘనత వహించిన మహబూబల్లీపాషాగారు మహర్షితుల్యులు. వీరి సత్యసంధత, ధర్మపరత, వేయినోళ్ల పొగడ దగినవి. కీ॥ శే॥ మాతండ్రిగారు వారి సౌశీల్యాది గుణములను నా చిన్నతనమున చెప్పుచుండెడివారు. నోరు తెరచుకొని మిక్కిలి యాతురతతో వినుచుండెడివాడను. వీరికి హిందూ ముసల్మాను భేదము లేదనియు, ముసల్మానుల మసీదులు మొదలగువాని కెట్లు సహాయపడిరో యట్లే హిందూ దేవాలయములకుకూడ తోడ్పడుచుండువారనియు, హిందూ ముసల్మాను పండితకవులను సమానముగా నాదరించువారనియు, నిగర్వచూడామణులనియు, ప్రజలయెడ మిక్కిలి వినయదాక్షిణ్యములు కలిగి యుండువారనియు, రాజశబ్దము వీరియం దనర్థమై యుండెననియు, వీరియందు రాష్ట్రప్రజలు జాతిమతభేదములు లేకుండ బద్ధానురాగులై యుండిరనియు,

బ్రిటిషువారిచే నత్యంత గౌరవము బడసినవారనియు, నా చిన్నతనమున వినుచుండెడివాడను. వీరినిగూర్చి రెండుగాథల నిట చెప్పుట యప్రస్తుతము గాదు.

మొదటిది వారు సర్వమంత్రసమర్థులని చెప్పు దురు. త్రాచుపాము కరచినవారి శ్రోత్రముల శ్రీవారి నామము బడిన లేచి కూర్చుండువారని వినికిడి. రెండ వది శ్రీవారు, బ్రాహ్మణుడును, వేదార్థకల్పతరువు నగు, బ్ర॥ శ్రీ॥ శే॥ బులుసు పాపయ్య శాస్త్రిగారికి గౌరవమిడి, సభలో వారి యుపన్యాసములు విని వారికి 1116 రూపాయిలు దుశ్శాలువలు నిచ్చి బహూక రించిరట. ఈ రెండు గాథలును వారి యందలి మహా త్తరగుణములకు నిదర్శనములు. మొదటిది యార్త త్రాణ పరాయణత్వము. రెండవది జాతి మత సామ రస్యము. ఈ రెండు గుణముల నాయన యద్వి తీయుడు.

వారు తమ కుమారులగు మ॥ ఘ॥ వ॥ ప్రస్తుత ప్రభువువారికి రాజమర్యాదల కనుగుణమగు విద్య గరపజేసిరి. గొప్ప ప్రాచ్య పండితుల రావించి శ్రీ వారికి అరబ్బీ, ఫారసీ, ఉర్దూ భాషల పాండిత్య మల

వడున ట్లొనర్చిరి. రాజుకాగలవారగుటచే శ్రీవారిని గుఱ్ఱపుస్వారి మొదలగు సైనిక వ్యాయామములలో సుశిక్షితుని జేయించిరి. వీనిలో సర్వసేనాధిపతిగారగు శ్రీ నవాబ్ అఫ్సరుల్ ముల్కు బహద్దూరుగారు వీరికి శిక్షకులు. [1] కాలమునను సరించి సామ్రాజ్యభాష నేర్వ వలసి యుండెను. అందుచే 1899 సంవత్సరమున శ్రీవారు 13 సంవత్సరముల వయసునందుండగా ఇగర్టన్ (Egerton) దొరవారిని వీరికాంగ్లశిక్షకులుగా నియమించి యాంగ్ల విద్యాభ్యాసము చేయించిరి. తరువాత కొంతకాలము బర్నెటుదొరగారు శ్రీవారికి శిక్షకులుగా నుండిరి. వారు తరువాత నిజాంకాలేజి ప్రిన్సిపాలుగా ఫింఛను తీసుకొనిరి. శ్రీవారు వీరికి మిక్కిలి వినయము చూపుచుండెడివారు. అప్పుడప్పుడు శ్రీవా

1 గుఱ్ఱపుస్వారియందేగాక కత్తిసామునందును, ఢేరామేకులు పెకలించుట యందును శ్రీవారి కనమానప్రావీణ్యము కలదు, గుఱ్ఱముపై స్వారిచేయుచు వ్రేలాడ గట్టియున్న యొక గొఱ్ఱెను రెండు తునియలుగాచేయు శక్తియు, నొక్కొక్కమారు రెండేసి ఢేరామేకులను పెరుకు సామర్థ్యమును, వీరుచూపి యత్యాశ్చర్యము గొల్పిరి.

*Illustrated Weekly of India*
18—9—38

రిచ్చు నుపన్యాసముల వలన శ్రీవారికెట్టి నిశితమైన యాంగ్ల పాండిత్యమున్నదో స్పష్టపడగలదు. ఈ ఇగర్టన్ (Egerton) దొరవారింతకు పూర్వ మనేక రాజకుమారులను తరిబీదుచేసిరి. ఇట్టివారిక్రింద మ॥ఘ॥వ॥ శ్రీవారు విశాలమగు జ్ఞానము నార్జించిరి. ఈ సర్వతోముఖమైన విజ్ఞానమే తరువాతి సంవత్సరములలో శ్రీవారి నాదర్శ రాజ సార్వభౌముని చేసినది. ఇదిగాక శ్రీవారు చిన్న తనముననే రాష్ట్రముయొక్క సర్వభాగములను సంచార మొనర్చి పరిస్థితులను స్వయముగా కనుగొను నవకాశము కల్పింపబడినది. మరియు శ్రీవారి తండ్రిగారు శ్రీవారిని 1903 సంవత్సరమున ఢిల్లీలో జరిగిన దర్బారునకు గొనిపోయిరి. అప్పుడు శ్రీవారు నిజాంరాష్ట్రము యొక్కయు, తత్పరిపాలకుల యొక్కయు, గొప్ప తనమును కనుగొనుటయేగాక సోదర సంస్థానాధీశులతో నెట్లు మెలగవలయునో తెలిసికొనిరి. ఈ యనుభవ మంతయు తరువాత రాజ్యముచేయుటలో సాయపడి రాష్ట్రమిప్పుడున్న యుచ్చస్థితికి వచ్చుటకు కారణ మాయెను. -భావికాలమున రాజు కావలసిన వారికెట్టి విజ్ఞాన మవసరమో యట్టివిజ్ఞానము శ్రీవారి కలవడెను. రాష్ట్రభాగ్యమున కింకేమి కావలెను!

## ౨. రాజ్యాధిపత్యము

శ్రీవారు 1911 సంవత్సరమున ఆగష్టు 29 తేదీన పట్టాభిషిక్తులైరి. శ్రీవారు రాజ్యమునకు వచ్చునప్పటికి రాజ్యముయొక్క పరిస్థితు లెట్లున్నవో కొంచెముగ ముచ్చటింతును. శ్రీవారి తండ్రిగారగు మ॥ ఘ॥ వ॥ మహబూబల్లీపాషాగారు ఋషితుల్యులని మున్నే విన్నవించియుంటిని. వారియొక్క దయార్ద్రిత్వము, సౌమనస్యము, సౌజన్యమును పురస్కరించి రాజ్యాంగమున ననేకములగు లోటులుండుట తటస్థించెను. తప్పులొనర్చినవారిని శిక్షించుటకు వారు వెనుకంజవేసి కఠినచర్యలను తీసుకొనకపోవుటచే నవియన్నియు నట్లే నిలచిపోయెను. జిల్లాలోనియు, తాలూకాలోనియు కచ్చేరీలలో దాదాపు ప్రతి యుద్యోగియు లంచములు తీసుకొనుచుండెను. ఈలోపము ప్రభుత్వమున నున్నతోద్యోగులలోకూడ నుండెను. పోలీసు శాఖనుగూర్చి వేరుగా చెప్పనవసరములేదు. చిన్నచిన్న యుద్యోగులుకూడ లక్షాధికారులవలె కాలము గడుపుచుండిరి. తహసీల్దారులు తమ తహసీల్లు తమజాగీర్లేనని కాలము గడుపుచుండిరి. శిస్తు

వసూళ్లు బకాయాలు మిక్కుటముగ మిగిలియుండెను. రివిన్యూ పోలీసుద్యోగస్థులు ప్రజలను మిక్కిలి పీడించుచుండిరి. శాఖలన్నిటియందును కృత్యములన్నియు సరిగా నిర్వర్తింప బడకుండెను. సంవత్సరములైనను విషయములు తేలకుండెను. పనియుండివచ్చువా రెడతెగకుండ కచ్చేరీలచుట్టును తిరుగవలసి వచ్చుచుండెను. ఉద్యోగస్థులు తమవిధులను న్యాయముగా నిర్వర్తించుట యరుదుగా నుండెను. జాగీర్దార్లందరు నాడంబరములను పెంచుకొనుచు, వృథాధనవ్యయము చేయుచుండిరి. వారి జాగీర్లన్నియు ఋణదాతల హస్తగతములై యుండెను. భోగలాలస యెక్కువగుటచే వారట్లు చేయక తప్పినది కాదు. ఈ లోపము లన్నియు గుమిగూడి రాష్ట్రమునంతను పీడించుటతోపాటు రాజ్యముయొక్క బొక్కసము నిండుగా లేకుండెను. [1] (శ్రీమహాబూబల్లీ

1 "They resorted to intrigue and machinations, not only to save themselves, but also to further their ambitions, and these conditions prevailed right up to the end of the Regime of H. E. H. The late Nizam."

— '*My Life*' *P. 191.*

"And the behaviour of these men might be likened

పాషాగారు వారి కాలములోనే యిట్టి లోపములను కొంచెముగ గమనించి సమర్థుడగు సర్ జార్జి కాసర్ వాకర్ గారిని మంత్రిగా నియమించిరి. ఈయన యార్థిక పరిస్థితులను చక్కబెట్టుటకు పూనుకొనెను. ఈ నైజాము గారి కాలముననే యొక భావ్యభివృద్ధికరమగు విషయము జరిగెను. 1905 సంవత్సర మక్టోబరు నెలలో శ్రీ నైజాంగారిండియాగవర్నమెంటును కోరగా, శ్రీ హైదరి యను నుద్యోగిని వారియ్యగా, వారిని హైద్రాబాదున నియమించిరి. అప్పట్లో యువకుడగు నీయుద్యోగిచే నిజాంరాష్ట్ర మెంత యభివృద్ధికి రాగలదో యెవ్వరును చెప్పగలవారు లేరైరి. ఈకాలమున స్వల్పముగా కనపడు విషయములు భావికాలమున నెట్లుపకరించి రాష్ట్రము యొక్క సర్వతోముఖాభివృద్ధికి కారణమయ్యెనో ముందు తెలుసుకొనగలము. రాజు దానకర్ణుడైన బొక్కసమున మిక్కుటముగా రొక్కమెట్లుండును? చిన్నతనమున రాజ్యమునకు వచ్చినను మ॥ ఘ॥ వ॥ శ్రీ ప్రభువారి

to camels without leads, who, stretching out their necks, snapped in all directions."

—*Ibid 259.*

లోపములన్నియు కనిపెట్టిరి. ప్రతిభావంతుల కసాధ్యములుండునా! అన్నిటికంటెముందు రాజ్యాంగమునందలి లోపములను సవరించుటయు, నార్థికవిషయమున జాగరూకత వహించుటయు విధియయ్యెను. శ్రీవారు పట్టాభిషిక్తులైన కాలమున పలికినపలుకు లిప్పటికిని చెవులలో ప్రతిధ్వనించుచున్నవి:

"నేనిప్పుడే నారాజ్యభవనమున కాలు పెట్టబోవుచున్నాను. ఇట్టిసమయమున ప్రస్తుతము నేను చెప్పగలిగిన దేమన:—ఎట్లు కీ॥ శే॥ మాతండ్రిగారిండియా గవర్నమెంటునెడల సుహృద్భావముతోను, రాజ్యములోని ప్రజలయెడల రంజకుడగు రాజువలె నుండెనో, యట్లే సర్వదా యుండుట నా పవిత్రాశయము. ఈవిషయమున నాయాశయము లెంత యార్ద్రములో, యట్టి యార్ద్రతతోడనే మీరువిశ్వాసమును చూపుదురని మిక్కిలి నమ్ముచున్నాను." పట్టాభిషేక సందర్భమున రెసిడెంటుగారిచ్చిన యుపన్యాసమునకు ప్రత్యుత్తరమిచ్చుచు నీవిషయమునే యీక్రిందిమాటల నానతిచ్చిరి:

"నాయావచ్ఛక్తిని వినియోగించి కీ॥ శే॥ మా తండ్రిగారు సంచరించినదారినే సంచరించుచు నాప్రజల కును, రాష్ట్రమునకును మేలే తప్పకచేతునని హృదయ పూర్వకముగా వాగ్దాన మొసంగుచున్నాను. మరియు బ్రిటిషుప్రభుత్వమునెడల నెల్లప్పుడును మైత్రితోనుండె దను." శ్రీవారు పై రెండు సమయములయందును సెల విచ్చిన వాక్యముల నెట్లు సార్థకపరచిరో, యెట్లుచెప్పిన వానికంటె వేయిమడుంగులెక్కువ కార్యరూపమునచూ పిరో ముందు తెలుసుకొనగలము. రాజ్యాంగమట్టి విషమా వస్థయందుండుటకు కారణముల నారయుదము. 1857 సంవత్సరపు సిపాయికలకలమున హైద్రాబాదు రాజ్యము బ్రిటిషుప్రభుత్వమునకు సాయముచేయక పోయిన, నీరెండుసంస్థ లిట్లుండెడివి కావు. సాయము చేయుటచేతనే రెండును చిరస్థాయులై సన్మైత్రితో మెలగుట తటస్థించినది. ఈపనియంతయు మొదటి సర్ సాలార్జంగు బహద్దూరుగారి దూరదర్శిత్వము. అప్పుడు బ్రిటిషుపరిపాలకులకు జరిగిన యుత్తర ప్రత్యు త్తరములను చూచిన నందలి విశేషములు మనకు తెలియగలవు. నవాబు అఫ్జలుద్దౌలా బహద్దూరు గార ప్పుడు రాజ్యము చేయుచుండిరి. విప్లవకారుల చేష్ట

లకు మేరలేకుండెను. అట్టిస్థితిలో నైజాముగారు కూడ విప్లవములో చేరిన బ్రిటిషువారిస్థితి యేమయ్యెడిది ? అప్పుడు బొంబాయిగవర్నరుగారు సందేహాస్పదులై హైద్రాబాదుననున్న బ్రిటిష్ రెసిడెంటుగారికి "నైజాముగారు మనలోనుండి చీలిపోయినయెడల సర్వము భగ్నమగును" అని తంతివార్త నంపిరి. అట్టి పరిస్థితులలో సర్ సాలార్జంగు బహద్దూరుగారి రాజనీతి సఫలమొందెను. బ్రిటిష్ప్రభుత్వము నిలచెను. అప్పటినుండి రెండుసంస్థలకు మైత్రి బలపడెను. సఖ్యమేర్పడినను నంతఃపరిస్థితులలో బ్రిటిష్ప్రభుత్వ మెట్టిజోక్యము కలుగజేసికొనలేదు. సిపాయి కలకలముతరువాత రాష్ట్రము నందలి చిన్నసంస్థానముల నన్నిటిని లోబరచుకొని యొకవిధమైన నియమముక్రిందకు తెచ్చుటకు సర్ సాలార్జంగు బహద్దూరుగారు మిక్కిలి శ్రమపడిరి. కాని పూర్తిగా ఫలింపకమునుపే వారుగతించిరి. తరువాత నంత ప్రతిభాశాలురు మంత్రులుగా నుండకపోవుటచే వారు చక్కబెట్టిన పరిస్థితులు పైకి చూచుట కట్లే యున్నట్లు కనపడినను, నెన్నియో లోపములందుల బ్రవేశించెను. అట్టి స్థితిగతులను చక్క

బెట్టుటకై, ప్రతిభాశాలియు, రాజనీతిజ్ఞుడును, కఠినము గాను న్యాయముతోను పాలించి, పరిమితిగా వ్యయ మొనర్చునట్టియు, తన ప్రవర్తనముచే నితరులకు మార్గదర్శి యగునట్టియు, వ్యక్తి రాజు కావలసియుం డెను. అట్టి పరిస్థితులలో శ్రీవారు రాజ్యమునకు వచ్చుట తటస్థించెను. అది రాష్ట్రముయొక్క మహా భాగ్యము !

ఇక్కడ యొక ముఖ్యవిషయము గలదు. శ్రీవారి తండ్రిగారి కాలమున బ్రిటిషువారి కియ్యవలసిన కప్పము బాకీపడెను. శ్రీవారి తండ్రిగారు దానకర్ణులగుటచే నట్లు తటస్థించెను. అది కర్జన్ ప్రభువుగారు వైస్రాయిగా నున్నకాలము. ఆయన నైజామువారి నా సొమ్మునకై బలవంతపెట్టగా రెండు ప్రభుత్వములకు నొక యొడం బడిక జరిగెను. అందు బీరారురాజ్యము బ్రిటిషువారికి శాశ్వత కౌలున కిచ్చునట్లును, వారు నైజామువారి కేటేట 25 లక్షల రూపాయి లిచ్చునట్లును, నిశ్చయిం పబడెను. శ్రీవారి తండ్రిగారు ద్రవ్య మీయలేక పోయినందున నీ సంధి కియ్యకొనవలసి వచ్చెను. రాజ్య భాగ మిచ్చుట కిష్టములేదు. అయినను చేయతగినపని లేకుండెను. ఈ సంధి మన శ్రీవారి మనసును మిక్కిలి

కలంచెను. శ్రీవారు రాజ్యమునకు వచ్చినప్పు డీ విషయముకూడ నితరములతోఁబాటు వారి మనసు నాకర్షించెను. ఇది యెట్టులయిన రద్దు చేయవలెనను నూహ మెండాయెను. ఆ యూహాను శ్రీవారెట్లు కార్యరూపమున బెట్టిరో తెలుసుకొనగలము.

---

## ౧. ప్రథమరాజ్య వత్సరములు, స్వయం ప్రభుత్వము

శ్రీవారి రాజ్యకాలమును నాల్గు భాగములుగా భాగింపవచ్చును.

1. ప్రథమ సంవత్సరములు— 1911–1914
2. స్వయం ప్రభుత్వము — 1914–1919
3. మంత్రిసంఘ ప్రథమవత్సరములు— 1919–1925
4. పరిశిష్టము— 1925–1938

ప్రథమ సంవత్సరములలో కొంతభాగము శ్రీవారు పరిస్థితులను తెలుసుకొనుటకు వినియోగించిరి. న్యాయపరిపాలనము శ్రీవారి ముఖ్యాశయమగుటచే, ప్రభుత్వశాఖ లన్నిటిలోను, విషయములన్నియు న్యాయదృష్టిచే జరుగుచున్నవా యను సంశయము వారి నాకర్షించెను. వచ్చుకాగితములు స్వయముగా పరిశీలింప ప్రారంభించిరి. కచ్చేరీలకు స్వయముగా వెడలుట, యుద్యోగస్థులందరు సరిగా పనిచేయుచున్నారో లేదో యని స్వయముగా దర్యాప్తుచేయుట మొదలిడిరి. ప్రతి యుద్యోగియు తనవద్దకు శ్రీవారెప్పుడువచ్చి పరీక్షిం

తురోయని భయపడుచుండెను. ఈ విధముగా వీరి శ్రమ యెక్కువయ్యెను. శుభసూచకమన్నట్లు శ్రీవారు రాజ్యమునకు వచ్చిన సంవత్సరమే పంటలు పూర్వమెన్నో సంవత్సరములకంటె నెక్కువగా పండెను. ఆసంవత్సర మాదాయ మెక్కువయ్యెను. కచ్చేరీ లన్నియు తమవిధ్యుక్త ధర్మములను నిర్వహింప నేర్చుకొనుటకు ప్రారంభించినవి. కాని లంచములను గొనుటయను పిశాచము రాష్ట్రమంతయు నావరించుకొని యుండెను. ప్రజలుద్యోగస్తులచే పీడింపబడుచుండిరి. ఇట్టి పరిస్థితులు శ్రీవారి చెవిని బడగా నాయన తోకత్రొక్కిన త్రాచువలె యాగ్రహావిష్టుడయ్యెను. కాని యీ దురభ్యాసమును పోగొట్టుట యొక్కదినమున జరుగనేరదు. ఉద్యోగస్థులను దీనిని గూర్చి దర్యాప్తుచేయ మొదలిడిరి. ప్రతిభాశాలి ప్రారంభించిన తెలియని విషయము లుండునా? శ్రీవారి కేయుద్యోగస్థు లెట్టివారో తెలియుచుండెను. పొలములోని కలుపును పెరికి పారవైచినట్లు, పనికిరానట్టియు, దుష్ప్రవర్తన గలిగినట్టియు, నుద్యోగస్థులను క్రమక్రమముగా నుద్యోగమునుండి తొలగింప మొదలిడిరి. 1911 సంవత్సరమున జరిగిన యొక విశేషాంశము నిచ్చట జెప్పవలసియున్నది. వైస్రాయి హార్డింగు ప్రభువుగారి

యాజమాన్యమున నీ సంవత్సరమున ఢిల్లీలో నొక గొప్ప దర్బారు జరిగెను. దానికి చక్రవర్తిగారు స్వయముగ విచ్చేసియుండిరి. శ్రీవారప్పుడు ఢిల్లీ వెళ్ళవలసి వచ్చినది. అప్పుడు శ్రీవారికైన గౌరవము, శ్రీవారి తండ్రిగారి కాలమున వారికైన గౌరవమును తలపించెను. హిందూదేశమునందలి స్వతంత్రరాజ్యములలో నిజాము రాజ్యము మొదటి కక్ష్యలోనిదనియు, నందుచే నందరు స్వతంత్ర రాజ్యాధిపతులకు నిజాంప్రభువుగారు నాయకులనియు, నప్పటిచర్యలవలన శ్రీవారికి దృఢమయ్యెను. ఎప్పుడు మనసున నీవిషయము నాటెనో యట్టిగౌరవము కాపాడుకొని కీర్తి గడింపవలెనను కుతూహల మినుమడించెను.

మరియు శ్రీవారి తండ్రిగారి కాలమునుండి నిజాం రాజ్యము, బ్రిటిషు ప్రభుత్వమునకు చేసిన తోడ్పాటునకును సహాయమునకును కృతజ్ఞతాపూర్వకముగా నింగ్లాండు రాజుగారు నిజాం ప్రభువులకు "మాయాప్తమిత్రము" నను బిరుదమును ప్రసాదించిరి. ఈ బిరుదము శ్రీవారి నింగ్లాండు రాజుగారికి సమానకక్ష్యయందు నిల్పుచున్నది. ఇట్టి బిరుద మీ దేశమునందలి

స్వదేశ సంస్థానాధీశులలో నెవరికిని లేదు. ఈ రెండంశ ములు శ్రీవారికి నిశ్చయముగ గర్వహేతువులై, యిట్టి బిరుదములు వచ్చుటకు కారణభూత మగు రాజ్యము నెడల ప్రేమ నభివృద్ధిచేసి న్యాయముతోను దూరదృష్టితోను పరిపాలింపవలెనను నాశయమును పెంపొందించెను.

1912 సంవత్సరమున, 1901 సంవత్సరమునుండి ప్రధానామాత్య పదవి నలంకరించియున్న మహారాజా సర్ కిషన్ప్రసాద్ బహద్దూరువారు విశ్రాంతి కోరిరి. శ్రీవా రమాత్యులిచ్చిన రాజీనామాను మిక్కిలి విచా రముతో నంగీకరించుచు, తన సమవయస్కుడైనట్టియు, పుత్ర నిర్విశేషముగా తమ తండ్రిగారిచేత పెంచబడి నట్టియు, నా బాల్యమిత్రుడై నట్టియు మూడవ సాలార్ జంగుబహద్దూరువారిని ప్రధానామాత్యులుగా నియమిం చిరి. ఈ విషయ మందరకును సంతోషకరమయ్యెను. అమాత్యులును తన కర్తవ్యము నుత్సాహముతోను, ప్రేమతోను నిర్వర్తింపప్రారంభించెను. ఈయన మిక్కిలి యుదారస్వభావము కలవాడు. నిగర్వ చూడామణి. రాజభక్తిపూరితుడు. ప్రతిభాశాలి. ఈ గుణగణముల

న్నియు కార్యరూపము దాల్చునట్లొనర్చుటకు యత్నించెను. రాజును మంత్రియు సామరస్యముతోనే పని చేయుచున్నట్లు కనపడుచుండిరి. రెండు సంవత్సరము లీయన కృషి చేసెనో లేదో (అనగా 1914సం॥ తుదిభాగమున) స్వంతకార్యములచే నీయన రాజీనామా నియ్యవలసివచ్చెను. ఈయన ప్రతిభాశాలియైనను రాష్ట్రమున శాశ్వతముగా నుండతగిన యేకార్యమును చేయకుండగనే, యుద్యోగమునుండి విరమించుకొనవలసివచ్చినందుకు, రాష్ట్రమంతయు మిక్కిలి చింతించెను. వీరింకను మంచి యారోగ్యవంతులై యున్నారు. కళోపాసకులలో ముఖ్యులు. ప్రపంచమంతయు సంచరించిరి. వీరిప్రదర్శనశాల మిక్కిలి యపూర్వవస్తుభరితమై చూపరకాశ్చర్యము గొలుపును. ఈయన పుస్తకభాండాగారము మిక్కిలి విలువగలది. దానములు సర్వతోముఖములై యొప్పారుచున్నవి. వీరి ప్రతిభ యింకను రాష్ట్రమునకు తోడ్పడగలదని నమ్ముచున్నాను.

శ్రీవారు ప్రారంభించిన దుష్టోద్యోగశిక్షణము నిర్విఘ్నముగా కొనసాగుచుండెను. ఈదుండగులు మిక్కిలిగా న్యాయ, పోలీసు, శాఖలకు చెందియుండిరి.

శ్రీవారు తనపనిలో సహాయము చేయుట కిదివరలో కోశశాఖలో కొంతశ్రమపడి మంచిపేరు సంపాదించిన శ్రీయుత అక్బరు హైదరీగారి నప్పుడు తచ్ఛాఖా కార్యదర్శిగా నియమించిరి. ఇదియే శ్రీవారికిని శ్రీ హైదరీ గారికిని సమాగమప్రారంభము. ఈసమాగమము మీదనే తర్వాత రాష్ట్రముపొందిన యుచ్చస్థితి యాధారపడియున్నది. రాజుయొక్క ప్రతిభ సరియైన యుద్యోగస్థులను వెదకుకొనుటలోనే కలదు. ఈ కాలమున (1911–14) శ్రీ హైదరీగారు శ్రీవారికి కుడిభుజమై యన్ని శాఖలందుగల దుర్వ్యత్తుల నణచుటకు మిక్కిలి సాయపడిరి. ఈవిధముగా శ్రీ హైదరీగారి సాయమున శాఖలందలి యన్నికార్యములను సవరించుచు శ్రీవారు మిగిలిన విషయముల నశ్రద్ధచేయలేదు.

శ్రీవారు రాజ్యమునకు వచ్చునప్పటికే సర్ జార్జివాకరుగా ర్థికమంత్రిగా నుండిరి. ఆయన సమర్థుడు. అదివర కార్థికమున నుండు లోపములను సవరింపగడగెను. ఆయన చేయు పనికి శ్రీవారు బల మొసంగిరి. ఇదివరకు బకాయపడిన శిస్తులు క్రమముగా రయితునకు కష్టము కలుగని పద్ధతిప్రకారము

వసూలుచేయుటకు ప్రారంభించిరి. క్రమక్రమముగా బాకీసము పూర్తియగుచుండెను. ప్రజలకు పీడ చాలా తగ్గిపోయెను. అందుచే శిస్తులను చెల్లించుశక్తి యభివృద్ధి యయ్యెను. ఉభయ తారకముగా కార్యసాధన మయ్యెను. దీనివలన ప్రజలలో శ్రీవారియెడ భక్తి హెచ్చెను. శ్రీవారు రాజ్యమునకు వచ్చిన మరుసటి సంవత్సరమున ననగా (1321 ఫ) 1912 సంవత్సరమున రాష్ట్రమునందలి ఖజానాలలోను బ్యాంకులలోను కలసి నిజాంసర్కారువారి ద్రవ్యము 300 లక్షలు అనగా 3 కోట్ల రూపాయ లుండెను. ఇట్లు రానురాను బాకీసము పూర్తియయ్యెను. తర్వాత పది సంవత్సరములకనగా (1331 ఫ) 1922 సంవత్సరమున నీ మొత్తము 521 లక్షలు అనగా 5 కోట్ల 21 లక్షలకు పెరిగెను. శ్రీవారు పట్టినదెల్ల బంగారమై రాజ్యము క్రమముగా ధనవంతమయ్యెను. (1320 ఫ) అనగా శ్రీవారు రాజ్యమువహించిన సంవత్సరముతోనే నిజాం గవర్నమెంటు ఇండియా గవర్నమెంటువద్ద 4 సంవత్సరముల క్రిందట క్షామనివారణమునకై తీసుకొనిన 340 లక్షల కల్దారు రూపాయల ఋణము తీర్ప

బడెను. ఈ కాలముననే సక్రమాభివృద్ధికై మార్గ మేర్పడెను.

ఇచ్చట నీయార్థికస్థితికి మరియొక కారణము చెప్పవలసియున్నది. శ్రీవారు నిగర్వులు. వారి స్వంత కోరికలు మిక్కిలి తక్కువ. నిరాడంబరజీవులు. ఈ నిరా డంబరత్వమను భాగ్యమును రాజ్యమున కలవడజేసిరి. సమస్తశాఖలలోను ననవసరఖర్చులన్నియు నాపివేసిరి. పాయగాప్రభువులును సామంతరాజులు శ్రీవారినిచూచి సిగ్గుపడసాగిరి. వారందరి జీవితములు క్రమముగా నిరా డంబరములగుటకు మొదలిడెను. శ్రీవారివలెనే వారును ఖర్చు తగ్గించుకొన మొదలిడిరి. ఈపద్ధతి పాయగాల కును తత్ప్రభువులకును మహోపకారక మయ్యెను. వారికి సాహుకార్ల యలజడి తగ్గెను. మిక్కిలి ఋణపడిన పాయగా ప్రభువులను సామంతరాజులను రక్షించుటకు శ్రీవారు పూనుకొని కోర్టుఆఫ్‌వార్డ్సు అను సంస్థను స్థాపించిరి. వారట్టి సామంతరాజుల జాగీర్లను స్వాధీన పరచుకొని సత్పాలనమునను, మితవ్యయమునను, ధనము కూడబెట్టి ఋణములదీర్చి తరువాత మరల వారి జాగీ ర్లను వారికి వశపరచునట్లేర్పాట్లు కావించుచుండిరి.

దీనితో జాగీర్దారులందరును బాగుపడిరి. రాజ్యమున కార్థిక బలము చాల చేకూరెను. శ్రీవారి శీలములోని నిరాడంబరత్వము ముఖ్యమైనదియు ప్రజలను రంజింపజేయు గుణమును నైయున్నది.

ఎప్పుడు ఋణము తీర్పబడి బొక్కసము నిండుట ప్రారంభించెనో యప్పుడు ముఖ్యముగా కావలసిన కట్టడములకు శ్రీవారి దృష్టిమరలెను. రాష్ట్రమునందలి యున్నత న్యాయస్థానమునకు తగినభవనమావశ్యకమయ్యెను. సంస్థయొక్క గౌరవమునకు తగిన భవన ముండవలెనుగదా? అప్పుడు హైదరీగారి సలహాననుసరించి ప్రస్తుతపు హైకోర్టు భవనము నిర్మింపబడెను. సిటీ కాలేజీభవనమును నీకాలమున ప్రారంభింపబడినదే! ఇట్టి పరిస్థితులన్నియు క్రొత్తపన్నులు వేయకుండ జరుగుటయనిన, శ్రీవారి ప్రతిభయు, నుద్యోగుల చాకచక్యమును, ప్రశంసింప వలసియున్నది. ఈ కాలమునందు శ్రీవారుచేసిన రాజ్యకార్యమునకు బ్రిటిషు ప్రభుత్వము మెచ్చినట్లును, నన్నిశాఖలయం దభివృద్ధి కలిగినట్లును 14–7–1913 తేదిన వైస్రాయి హార్డింగు ప్రభువుగారు హైద్రాబాదు వచ్చినప్పుడు వారికిచ్చిన

విందులో వారొనర్చిన యీక్రింది ప్రసంగమువలన తేటపడగలదు. "నిజాం ప్రభువుగారు రాష్ట్రప్రజా క్షేమమునకై మిక్కిలి శ్రద్ధతో పాటుపడుచున్నారనియు బ్రిటిషు ప్రభుత్వముపట్లనున్న సుహృద్భావమును వెల్లడించిరనియు" ననిరి.

ఇట్టీకాలమున శ్రీవారి ప్రజానురాగము, నిరాడంబర జీవనము, మితవ్యయమును, కలసి రాష్ట్రోన్నతికి కారణమై భావ్యభివృద్ధికి పునాదివేసెను.

## ౨. స్వయం ప్రభుత్వము

వైస్రాయి హార్డింగుగారు వెనుక చెప్పినట్లు శ్రీ వారి పరిపాలనమును పొగడుటయే గాక శ్రీవారిని మునుపటికంటె నెక్కువ శ్రద్ధతో సమస్తవిషయముల గూర్చి జాగ్రత్త వహింపుమని సలహానిచ్చిరి. శ్రీవారు వైస్రాయిగారువచ్చిన సందర్భమున 1914 సంవత్సరమున నిచ్చిన యుపన్యాసములోని యీక్రింది వాక్యములు చదివిన పైదానియందలి సత్యము తెల్లముకా గలదు.

"నేను చేయుచున్న కార్యము నాకు ప్రియమైనదనియు, విషయములను స్వయముగా పరిశీలింపవలెనని శ్రీ వైస్రాయిగారి సలహా ననుసరించితిననియు, పరమేశ్వరు డనంతకృపతో నా హస్తగతముగావించిన కోట్లకొలది ప్రజల క్షేమమును నా శక్తికొలది చేయుట నాకు మిక్కిలి యానందదాయకముగా నున్నదనియు చెప్పవలసియున్నది."

పై వాక్యములందు శ్రీవారు తాము స్వయముగా నధికారమునుబూనుటకు, తమయిచ్ఛ, వైస్రాయి

గారి సలహా, ప్రజాక్షేమము, నను మూడు కారణము లను సెలవిచ్చియున్నారు. గట్టిగా ప్రభుత్వమునకు పునాదులు నిర్మింపబడినవి యని వెనుక చదివి యున్నాము. అట్టి గట్టిపునాదులపై భవననిర్మాణము సులభసాధ్యము. మూడవ సాలార్జంగు బహద్దూరుగారు రాజీనామానిచ్చిన తరువాత శ్రీవారికి తగిన ప్రధాన మంత్రికనపడలేదని చెప్పుటకుపీలులేదు. శ్రీవారు రాష్ట్ర మును స్వయముగా పరిపాలించినయెడల రాష్ట్ర సర్వ తోముఖాభివృద్ధి సత్వరముగా జరుగగలదని గట్టిగావిశ్వ సించిరి. తామేస్వయముగా కార్యములన్నియు నిర్వహిం చుచున్న నుద్యోగియుల కందరకు నది త్రోవజూపుట కదా? వారుకూడ శ్రీవారి ననుకరించి ముందుకంటె నెక్కుడు శ్రద్ధవహింతురు. ఈ కారణములకు పైస్రాయి హెచ్చరిక సాయ మొనర్చెను. సామాన్య ముగ రాజులు భోగలాలసులై యుందురు. ప్రభుత్వము నంతను స్వయముగా చేయ నిచ్ఛగింపరు. ఇట్టి స్థితిలో శ్రీవారి కట్టి కుతూహలము కలిగినదన్న శ్రీవారి సదుద్దేశ్యము, రాష్ట్రప్రేమయు, వేనోళ్ళ కొనియాడ దగియున్నది. శ్రీవారికి యౌవనమున్నది! ప్రతిభ యున్నది! రాజునకు కావలసిన నిష్కామకర్మాను

స్థానతత్పరత యున్నది! ఇదివరకే రాజ్యమునకు వచ్చి నది మొదలు ప్రతి శాఖాకార్యములందును స్వయ ముగా నభినివేశమును సంపాదించిరి! ఇంకేమి కావల యును? తాను నమ్మదగినట్టి కొంద రుద్యోగు లున్నారు. పరిపాలనకు వలయు సామగ్రియంతయు నున్నది. ప్రియాసకరమైనను రాష్ట్రముకొరకై, ప్రజా క్షేమముకొరకై, స్వసుఖమునైనను కోల్పోవ నిశ్చ యించుకొనిరి.

ఏనాడు శ్రీవారి కట్టి యభిప్రాయము కలిగినదో గాని, భావిచరిత్రను పరికించినయెడల రాష్ట్రమునం దభి వృద్ధి యిప్పు డెంత సర్వతోముఖముగ కన్పట్టుచున్నదో దాని కంతకును పునాది యీ స్వయంపాలన కాలముననే వేయబడినట్లు కనుగొనగలము. ఈ నిర్ణయము చేసిన కొలది దినములకే తత్పరిణామములుకనపడెను. పన్నుల వసూలు విషయమున సరియైన పద్ధతు లవలంబింప ప్రారంభమయ్యెను. ఆర్థికముగా రాష్ట్ర మభివృద్ధి నొందుచుండెను.

విద్యావిషయమున నేమి, యితర విషయముల నేమి, యభివృద్ధి గమనము త్వర ననుసరించెను.

శ్రీవారు సరియైన సూత్రముల ననుసరించుచున్నా రనియు, సరియైన యుద్యోగస్తులను నియమించియున్నా రనియు, రాజకార్యములన్నియు సక్రమముగా నిర్వర్తింపబడు చున్నవనియు, నిండియా గవర్నమెంటువారి దృష్టి నాకర్షించెను. 14–7–1914 తేదిన జరిగిన జన్మ దినదర్బారులో రెసిడెంటుగారగు ఫ్రేజరుగారిచ్చిన యుపన్యాసమునందలి యీక్రింది వాక్యములను గమనింపుడు.

"ప్రభుత్వము యొక్క యన్నిశాఖలందును నేక ముఖముగా నభివృద్ధి కల్గుచున్నట్లు రాష్ట్రచరిత్రము వలన తెల్లమగుచున్నది. రాష్ట్రముయొక్క సర్వశక్తుల నభివృద్ధిచేయుటకై సక్రమముగా నాలోచించి ప్రణాళికలు తయారుచేయబడి యాచరణమునందున్నవి. వార్తాహరణమునకును, ప్రయాణములకును సౌకర్యములు కల్గింపబడుచున్నవి. ఆర్థిక విద్యావిషయముల ప్రజలు లాభమును పొందుచున్నారు. రాష్ట్రములోని ముఖ్య శాఖలయొక్క కార్యనిర్వహణమునకై తనచుట్టును గొప్పయోగ్యతలుగల యుద్యోగులను చేర్చుకొనుట చూడ నాకాశ్చర్యము కల్గుచున్నది. పూర్వమెన్నడును

నేనిజాం ప్రభువును నిట్టి ప్రతిభావంతులగు నుద్యోగస్థుల సహాయమును బడసియుండలేదు. (ఇది కొంచ మతిశ యోక్తి) పేర్లు చెప్పుటవలన ప్రయోజనము లేకున్నను మిన్నకుండజాలను. రాజభక్తి పూరితులును, సకల సుగుణవంతులునగు నవాబు ఇమాదుల్ముల్కు ఫర్డూ జంగు, గార్ల సహాయము ప్రభుత్వమింకను పొందు చున్నందులకు నేను ప్రభుత్వము నభినందించు చున్నాను. శ్రీ ప్రభువుగారు రాజ్యకార్య నిర్వహణమునకు తమ యావత్కాలమును వినియోగించుచున్నారు. ఎక్కడ చూచినను పనులు సక్రమముగా జరుగుచున్న సూచ నలు కానవచ్చుచున్నవి."

వెనుక వైస్రాయిగారు ప్రథమసంవత్సర విషయ ముల యోగ్యతాపత్రమొసంగిరి. మరలనిప్పుడు స్వపా లనకై యోగ్యతాపత్ర మొసగిరి. ముందు చేయవలసిన పనికి ప్రోత్సాహమువచ్చెను. శ్రీవారి యుత్సాహము నీయభిప్రాయము నినుమడింపజేసెను. ఈకాలమున శ్రీవారికి సలహానిచ్చి రాజ్యకార్యనిర్వహణమున సాయ్యము చేసినవారిలో వెనుకనిచ్చిన పేర్లవారుగాక మరి యిద్దరి నామములను చెప్పవలసియున్నది. మొదటి

వారు సర్ అమీర్ జంగుగారు. రెండవవారు శ్రీ హైదరీ (అప్పుడు) గారు [1] వీరిద్దరును శ్రీవారికి రెండు నేత్రములైరి. ఇమాదుల్ముల్కు ఫర్దుంజంగుగార్ల సంపూర్ణానుభవమును, సమీర్‌జంగు హైదరీగార్ల ప్రతిభయు, నీస్వపరిపాలనా కాలమును మిక్కిలి ఫలవంతమొనర్చెను. పెద్దలిద్దరును తమ వృద్ధానుభవములచే సమయము వచ్చినపుడెల్ల తమ యమూల్యమైన సలహానొసంగుచుండిరి. ఈ సలహాదారులగూర్చి కొంచెముగ ముచ్చటింతును. [2]

1 ఆ కాలమున 'ముల్కీ' 'గైరముల్కీ' భేదములు లేకుండెను. మనుష్యుని యోగ్యతయే గ్రహింపబడు చుండెను. —*'My Life' P. 183.*

2 "Of the Madrasis Moulvi Sheik Ahmed possessed all good qualities and disliked intrigue"

—*'My Life' P. 202.*

"A loyal and conscientious man"

—*Ibid P. 305.*

## ౩. శ్రీవారి సలహాదారులు

### సర్ అమీన్ జంగు బహద్దూరుగారు

సర్ అమీన్ జంగు బహద్దూరుగారి నామము మౌల్వీ అహమ్మదు హుస్సేనుగారు. వీరి స్వగ్రామము మద్రాసు రాష్ట్రమునందలి వానియంబాడి (Vaniyambadi) గ్రామము. ఈయన చిన్నతనముననే గొప్పవాడగు సూచనలు కన్పట్టెను. ఈయన ఎం. ఏ. ప్యాసైనప్పుడది మిక్కిలి యరుదైన పరీక్ష. ఈయనను వెనుకటి ప్రభువుగారు మద్రాసు నుండి తీసుకొని వచ్చిరి. ఈయన వారికి నమ్మకమైన బంటయి, యాయన విశ్వాసమునకు పాత్రుడయ్యెను. "నాకు సర్ అఫ్సరుల్ ముల్కు కుడిచేయి, అహమదు హుస్సేనుగా రెడమచేయి," యనుచుండెడివారట వెనుకటి ప్రభువుగారు ! వీరి సలహా లేని దెట్టి ఫర్మానను బయలువెడలలేదట ! తుదకు మరణకాలమందు గూడ వెనుకటి శ్రీవారు వీరిద్దరినే ప్రక్కన నుంచుకొనిరట ! కీ॥ శే॥ మహబూబల్లీపాషాగారి మరణానంతరము ప్రస్తుత శ్రీవారికి కూడ నంత విశ్వాసపాత్రులై, వారికి సమస్త

వ్యవహారములయందును కుడిభుజమై నడచిరి. శ్రీవా రితో ఢిల్లీదర్బారునకు వెడలివచ్చిరి. ఎన్నిమారులో మద్రాసుప్రభుత్వ కార్యనిర్వాహక సభ్యత్వమునకు పిలుపు వచ్చినను శ్రీవారు వీరిని విడువకపోయిరి. పేరు బయటకు రాలేదుగాని, మ్యాడవ సాలార్జంగుగారు రాజీనామా నిచ్చినతరువాత శ్రీవారి స్వపరిపాలనా కాలమున వీరే ప్రధాన మంత్రిగా గోప్యముగ పనిచేసి నారని చెప్పుట సత్యదూరముకాదు. తుదకు వీరిని శ్రీ వారు రాష్ట్ర సామంతులలో నొకరిగా జాగీరిచ్చి గౌర వించిరి. వీరి విజ్ఞానము భిన్నముఖము. సర్ సి. పి. రామస్వామయ్యరుగారు వీరిని "కక్క" యని పిలు తురు. వీరిద్దరికిని మిక్కిలి మైత్రి. ఇట్టివారీ కాలమున శ్రీవారికి సలహానిచ్చినారన్న రాష్ట్రాభివృద్ధి కలిగెనని చెప్పుట యాశ్చర్యకరమా ? వీరింకను వార్ధక్యంబున తమ విజ్ఞానమును వెదజల్లుచున్నారు. భగవానుడు వీరికి చిరాయు వొసంగుగాక! ఇప్పుడు రాజకార్యముల నుండి విరమించి విశ్రాంతిగొనియున్నారు. ఇప్పటికిని శ్రీవారు కోరినయెడల తమ సలహాను సవినయము గను గట్టిగను నొసంగుటకు సిద్ధముగ నున్నారు.

వెనుకటి తరమువారిలో మిగిలిన కొలదిమందిలో వీరొకరు.

## సర్ అక్బరు హైదరీ (హైదరు నవాజుజంగు బహద్దూరుగారు)

సంఖ్యలో రెండవవారైనను సలహాయందు ముఖ్యులు శ్రీ సర్ అక్బరు హైదరీ హైదర్ నవాజ్ జంగు బహద్దూరుగారు. అప్పుడు వీరిని శ్రీ హైదరీయనువారు. ఈ కాలమునుంచి అనగా 1914 సంవత్సరము నుంచి నేటివరకు 25 సంవత్సరములును వీరి ప్రత్యేక వ్యక్తిత్వము రాష్ట్రమునందలి యన్ని శాఖలపైనను ముద్రితమైయున్నది. రాష్ట్రమునకు "నెచ్చెలియై, యాప్త బంధువై, సద్గురువై"న యీయన మెచ్చుటినుండి వచ్చెనో వీరి సంప్రదాయమెట్టిదో, తెలిసికొనుట యప్రస్తుత మెంత మాత్రమును కాజాలదు.

వీరి పూర్వులు వర్తక వ్యవహారములపై నరే బియానుండి యిండియాకు వచ్చిరి. కొంతకాలమైన వెనుక బొంబాయి పట్టణముచేరి వర్తకము సాగించు చుండిరి. వీరి తండ్రిగారు వర్తకములో గొప్పవారైనను బాలుడగు హైదరీ ప్రతిభను తెలిసికొని, వీరి కింగ్లీషు

విద్య నభ్యసింపజేసిరి. చిన్నప్పటినుండియే తరువాత గొప్పవాడగు సూచనల గన్పరచుచుండెను. పూవు పుట్టగనె పరిమళించునుగదా! రత్నమును దాచియుంచ ప్రయత్నించినను దానికాంతి వ్యాపించుచునేయుండును. వీరు తమ 14 వ సంవత్సరముననే లాటినుభాషతో మెట్రిక్యులేషను పరీక్షయందు త్తీర్ణుడయ్యెను. 17 వ యేటనే బి. యే. పరీక్షయందు త్తీర్ణుడై, యాశ్చర్యము గొల్పెను. ఇప్పుడే పాఠశాలకుపోయి విచారించినను నీయీడున మెట్రిక్యులేషను చదువువారెక్కువగా నుండరు! ఎంత శ్రమపడినను 20 యేండ్లకు పూర్వము బి. యే. ప్యాసగుట యసంభవము.

18 వ సంవత్సరముననే యీయన యిండియా గవర్నమెంటుచే నడపబడుచున్న యార్థిక పరీక్షకు (F. C. S.) కూర్చొని యందత్యంతమైన పొగడ్తతో నుత్తీర్ణుడయ్యెను. వెంటనే బ్రిటిషిండియాలో నార్థిక శాఖలో నుద్యోగిగా గ్రహింపబడెను. ఆ యుద్యోగ సందర్భమున వీరు, లాహోరు, కలకత్తా, అలహాబాదు, మద్రాసు, మొదలగు పట్టణములలోనున్న పరిస్థితులను కనుగొనగల యవకాశము కలిగెను. తమ

కార్యనిర్వహణమున చూపిన ప్రత్యేకతను గవర్నమెంటు వారు కనుగొని, యచ్చులెక్కల తనిఖీపై నియమించిరి. వీ రందులకై యావద్భారతదేశమును సంచారము చేసి, యచ్చుశాఖయొక్క లెక్కల విషయమున కొన్ని సూచనలు గావించిరి. ఇండియా గవర్నమెంటువారా సూచనలను వెంటనే యమలునందుంచిరి. ఆ కారణముననే వారి సలహాప్రకార మిచ్చట స్థాపింపబడిన గవర్నమెంటు ముద్రణాలయశాఖ మిక్కిలి జయప్రదముగా పనిచేయుచున్నది.

వీరికి చిన్నప్పటినుండియు విద్యావిషయములన్న మిక్కిలిప్రీతి. ఇప్పుడు భారతభూమియందున్న యత్యంత విద్యాధికులలో వీరు ప్రథములని చెప్పుటకు సాహసించుచున్నాను. వీరికి చాలాసంవత్సరములనుండి ప్రస్తుతము భారతదేశమునందు గరపబడుచున్న విద్యాపద్ధతిలోని లోపములను సవరించి, మార్పుచేయవలయునను నూహ కలిగెను. వీరి శక్తిప్రతిభలు పూనానగరమున నా కాలమున "హైందవసేవాసమితి" (Servants of India Society) ని స్థాపించి పనిచేయుచున్న యమోఘ దేశసేవాపరాయణులగు గోక్లేగారి నాకర్షించెను. వారు

శ్రీ హైదరీగారిని వారి సంఘములో చేరి దేశసేవ చేయ
వలెనని ప్రోత్సహించిరి. అందులకు శ్రీ హైదరీగారు తమ
యుద్యోగమును వదలుకొనవలసియుండెను. ఆలోచించి
వారందుల కియ్యకొనకపోయిరి. శ్రీ హైదరీగా రామార్గ
మున గాకపోయినను, మరియొక మార్గమున ప్రాము
ఖ్యతవహించి, తమ ప్రతిభను వినియోగించి, కీర్తిప్రతిష్ఠ
లను శాశ్వతములుగా నిల్పుకొనవలెనని, భగవంతుని
కోరిక యగుటచే నప్పుడు వారి కా సంఘమున చేర
వలెనని బుద్ధిపుట్టినది కాదు. 1905 సంవత్సరమున
నార్థికవిషయముల ప్రతిభగల యొక యుద్యోగి హైద
రాబాదుసంస్థానమునకు కావలసివచ్చెననియు, కీ॥ శే॥
మ॥ ఘ॥ వ॥ మహాబూబల్లీ పాదుషాగారు విచారించగా
శ్రీ హైదరీగారు వీరి నాకర్షించిరనియు, వీరిని తమ రాష్ట్ర
మున కిమ్మని వారిండియాగవర్నమెంటును ప్రార్థించి
రనియు, నిండియా గవర్నమెంటువా రనుమతించిరనియు,
నా సంవత్సరముననే యక్టోబరులో వీరిచ్చటికి అకౌం
టెంటు జనరలుగా వచ్చిరనియు తెలియనగును.
ఏనా డాయన హైదరాబాదునగరమున కాలిడెనో
యది పవిత్రదినము. 1906 సంవత్సరముననే యార్థిక
శాఖాకార్యదర్శిగా నియమింపబడిరి. సమర్థతతో నార్థిక

శాఖా నిర్వహణము చేయుచున్న సర్ కాసనువాక రుగా రొకమారు శలవు తీసుకొనినపు డార్థిక మంత్రిగా కూడ పనిచేసిరి. 1911 సంవత్సరమువరకు నీయన యార్థికశాఖలోనే పనిచేయుచుండిరి. 1911 నుంచి 1914 సంవత్సరమువరకును ప్రభుత్వ విషయములయం దత్యంత శ్రద్ధ వహించుచుండ, శ్రీప్రభువుగారా సంవ త్సరముల కాలములో శ్రీ హైదరీగారి కార్యదీక్షను, విశాలదృష్టిని గ్రహింపగలిగిరి. ఆ నాల్గు వత్సర ములును నొండొరులను తెలుసుకొనుటలో వినియోగ పడెను. 1914 సంవత్సరమున శ్రీవారు రాజ్యభారమును నిర్వహింప నిశ్చయించిన కాలమున వీరిని తమ కాంత రంగిక సలహా నియ్యగల ముఖ్యులలో నొకరిగా భావిం చిరి. వారిని హోం సెక్రటరీ (Home Secretary) గా నియమించిరి. ముఖ్యముగ న్యాయ, పోలీసు, విద్యా శాఖలయం దభివృద్ధి కావలయునని శ్రీవారు కోరిరి. శ్రీ హైదరీగా రీడిపార్టుమెంటులపై నియమింప బడిరి. ఇవియేగాక దాదాపన్ని శాఖలయందును వీరి సలహా సంపత్తులు శ్రీవారు గ్రహించిరి. ఇండియా గవర్న మెంటు యొక్క నష్టము హైద్రాబాదు రాష్ట్రపు లాభ మయ్యెను. భగవత్సంకల్పము నెవ రెరుంగుదురు?

## నవాబ్ ఇమాదుల్ముల్కు బహద్దూరుగారు

ఈ కాలముననే హైద్రాబాదు రాష్ట్రము యొక్క సర్వతోముఖాభివృద్ధికి పునాది వేయబడెనని మున్నె విన్నవించియుంటిని. ఇప్పటి యభ్యుదయపు భవనమంతయు నా పునాదులపై కట్టబడినదే! ఈ కాలమున శ్రీవారి కవసరమైనయెడల సలహానిచ్చుటకు నియమింపబడి, తమ వృద్ధానుభవమును ప్రభువునకును రాజ్యోన్నతికిని వినియోగించి, తమ కుటుంబమును రాష్ట్ర సేవకై సమర్పించిన శ్రీనవాబు ఇమాదుల్ముల్కు బహద్దూరుగారిని గూర్చి కూడ కొంచెముగ నిచ్చట చెప్పిన నప్రస్తుతముకాదని తోచుచున్నది. వీరి స్వగ్రామ మయోధ్య పరగణాలోని "బిల్‌గ్రామ్" అను గ్రామము. ఆగ్రామ నామము వీరి కుటుంబనామము. వీరి నామధేయము సయ్యద్ హుస్సేన్ బిల్‌గ్రామిగారు. వీరితండ్రిగారు బ్రిటిషిండియాలో డెప్యూటీ కలెక్టరుద్యోగము చేసిరి. వీరికి శ్రద్ధవహించి యింగ్లీషు అరబ్బీ భాషలయందు మంచి పాండిత్య మలవడజేసెను. వీరి యింగ్లీషుభాషా పాండిత్యమును చూచి వీరిని "లక్నోటైమ్సు"ను పత్రికా సంపాదకునిగా నియమించిరి. అప్పుడు వీరయోధ్య



నేవాబు ఇమాదుల్ముల్కు బహద్దూదుగారు

తాలూక్దార్లకొరకు చేసినసేవకు వారి మెప్పువడసిరి. శ్రీ మొదటి సాలార్జంగుగారు 1872 సంవత్సరమున లక్నో నగరము పోయినప్పుడు, వీరి కుటుంబము నిచ్చటకు రమ్మని యాహ్వానించిరి. వారి యాహ్వాన మంగీకరింప బడెను. వీరును వీరి తమ్ములగు శ్రీ సయ్యదల్లీ బిలిగ్రామీగారును సర్కారుద్యోగములలో గొప్ప పదవుల నలంకరించిరి. వీరి తమ్ములగు సయ్యదల్లీ బిలిగ్రామీగారు గొప్ప భాషావేత్త. వీరు ఖనిజ రైల్వే శాఖాధ్యక్షులుగా నున్నకాలమున మా తండ్రిగారగు సుబ్బరావుగారు వీరికి పేషీమున్షీగానుండి పనిచేసిరి. వీరిని గూర్చియు వీరి పాండిత్యమునుగూర్చియు వారు నా చిన్నితనమున చాల ప్రశంసించుచుండెడివారు. శ్రీయిమాదుల్ముల్కుగారిసేవను క్రమముగా తెలిసికొని ప్రభుత్వమువారు వీరికి పదవుల నెట్లిచ్చిరో యట్లె బిరుదావళి నొసంగి గౌరవించిరి. వెనుకటి ప్రభువుగారి కాలమునందలి రాష్ట్రాభివృద్ధియంతయు వీరిసేవతో సమ్మిళితమై యున్నది. వీరు విద్యావిషయముల నారితేరినవారు. అందుచే నిచ్చటి విద్యాభివృద్ధికరములగు ననేక కార్యములకు పునాది వేసినవారు వీరే! హైదరాబాదు రాష్ట్రమునందలి ధనికుల బిడ్డలకొరకు "మద్రసా ఐజా" యను పాఠ

శాలను స్థాపించిరి. అది యిప్పటికిని పనిచేయుచున్నది. "మద్రాసా ఆలియా"కు మధ్యమ శాఖను చేర్చగా నదియే యభివృద్ధినొంది యిప్పటి నిజాం కళాశాలయై ప్రసిద్ధి కెక్కియున్నది. 1885 సంవత్సరమున పరదాపద్ధతి ననుసరించుచు స్త్రీ విద్యకొరకై పాటుపడు సంస్థ నొకదానిని స్థాపించిరి. బహుశః యిదియే భారత భూమియందలి ప్రథమ స్త్రీ విద్యా సంస్థయై యుండ వచ్చును. ఔరంగాబాదు, వరంగల్లు, హైద్రాబాదు పట్టణములయందు పరిశ్రమ పాఠశాలలను స్థాపించిరి. ఇప్పటికి నవి తృప్తికరముగా పనిచేయుచున్నవి. ప్రాచ్య కళాశాల నొకదానిని "దారుల్ ఉలుం" అను పేరుతో స్థాపింపగా నదియే ప్రస్తుతపు "ఉస్మానియా విశ్వవిద్యాలయము"గా మారినది. అపురూపమైన యరబ్బీ గ్రంథ ప్రచురణమునకై "దయరతుల్ మారీఫ"ను నొకసంఘ మును స్థాపింపగా నది ప్రపంచ సంస్థయై యనేకము లగు నరబ్బీగ్రంథములను ప్రచురించి ప్రపంచమునం దనేక దేశములయందు శాఖలుకలిగి వరలియున్నది. వీరి యొక్క ప్రతిభ యుండియూ గవర్నమెంటు వారినాకర్షింప వీరిని స్టేటు సెక్రటరీ సంఘసభ్యునిగా నియమించిరి గాని, యారోగ్యము సరిగా నుండనందున మరల నిచటికే

రావలసివచ్చెను. ఇది యది యననేల ! సర్ అక్బరు హైదరీగారికి వెనుకను, ప్రథమ సాలార్జంగువారి తరువాతను, రాష్ట్రాభివృద్ధి వీరిపేరుతో సమ్మిళితమై యున్నది. రెండు విషయములు చెప్పి వీరి సెలవు గైకొందును. 1914 యుద్ధసమయమున టర్కీ జర్మనీలో చేరినపుడు, హిందూదేశమునందలియు, ప్రపంచమున నితర ప్రదేశములందలియు, ముసల్మానులను, జర్మనీతో చేరిన, తమ భావ్యభివృద్ధికి భంగము కల్గుననియు, బ్రిటిషు సామ్రాజ్యముపట్ల తమ భక్తివిశ్వాసములను వెల్లడించుట కర్తవ్యమనియు, శ్రీ నైజాముగారు చేసిన ప్రకటనను రచియించినవారు వీరని చెప్పిన, వీరి సంఘాభిమానమును, రాష్ట్రాభిమానమును, వేర చెప్పబని లేదు. వారు తమ కుటుంబమును రాష్ట్రసేవకు సమర్పించిరి. ఇప్పటి కార్యనిర్వాహకసభయందు వీరి పుత్రు లిద్ద రుండుటయేగాక, యనేకోన్నతపదవులను వీరి బంధుజాల మలంకరించుచున్నది.

ఈకాలపు టుద్యోగనియామకములలో నికరెండు చెప్పి తరువాత నీకాలమునజరిగిన కార్యములకు వెడలెదను. విద్యాశాఖకు మిక్కిలి యనుభవముకలిగిన

ప్రముఖుడు కావలసివచ్చెను. నవాబు ఇమాదుల్ముల్కు గారు విద్యాశాఖలోచేసిన ఘనకార్యములను పరిణతములుగ చేయగలవారుగా నుండవలసివచ్చెను. అట్టి వారిని వెదుకగా తుదకు నవాబు మసూద్జంగు బహద్దూరుగారు కనపడిరి. వీరు 1915 సంవత్సరమున విద్యాశాఖాధ్యక్షులుగా నియమింపబడిరి. వీరు జపాను మొదలగు ననేక విదేశములకువెడలి యచ్చటి విద్యా విధానముల నన్నిటిని బాగుగాగ్రహించిన ప్రముఖులు. వారు తమ విశాలానుభవముతో శ్రీ హైదరీగారికి విద్యావిషయములను, నితర విషయములనుగూడ బాసటమైరి. వీరు పింఛను గ్రహించినతరువాత, ననగా 1926 సంవత్సరము తరువాత, బ్రిటిషిండియాలో ననేకపదవుల నలంకరించి, తుదకాలిఘరు విశ్వవిద్యాలయోపాధ్యక్షులుగా పనిచేసి, రెండు సంవత్సరముల క్రిందటనే పరమపదమునొందిరి.

ఇంజనీరింగు శాఖాభివృద్ధికూడ కావలసియుండెను. 1908 సంవత్సరమున హైదరాబాదు నగరము యొక్క రెండుభాగములకు మధ్యనుండు మూసీనది పొంగి, పట్టణములోని చాలాభాగములను నాశనము

చేసెను. అదిగాక హైద్రాబాదునగరమున కవిచ్ఛిన్న పానీయ సౌకర్యము లేర్పడవలసియుండెను. ఈరాష్ట్రము మొదటినుండి పంటలకు దేవమాతృకమై, వర్షముపై నాధారపడియుండెను. రాష్ట్రమునుండి గోదావరీ కృష్ణా తుంగభద్రా నదులును, వాని యుపనదులును ప్రవహించుచున్నను, వీనిని వ్యవసాయానుకూల్యతకు తెచ్చుటకు యత్నములుసల్పుట యొక ముఖ్యకార్యమయ్యెను. అట్టిపనులచే రాష్ట్రాభివృద్ధి యగుటయేగాక, ప్రజలు సౌఖ్యపడి రాష్ట్రనాగరకత యభివృద్ధియగును. వీని నన్నిటిని నిర్వర్తించుటకు ప్రతిభాశాలియగు నింజనీరు కావలసివచ్చెను. రాష్ట్రము గొడ్డుమోతు కాదనియు, నిచ్చటను నన్ని శాఖలకు వలయు ప్రతిభావంతులున్నారనియు, చాటునట్లు ప్రభువుగారిదృష్టి శ్రీ ఆనవాలీజు జంగుగారిపై బడెను. మూసీప్రణాళిక, నిజాంసాగరు ప్రాజెక్టు మొదలగు ఘనకార్యములన్నియు వీరి ప్రతిభా ఫలములే. వీరు 1918 సంవత్సరమున ఛీఫు ఇంజనీరుగా నియమింపబడిరి. వీరి ప్రతిభను కనుగొనినవారు సర్ యం. విశ్వేశ్వరయ్యగారు. ఇంతకుపూర్వ మింజనీరింగు విషయముల శ్రీ విశ్వేశ్వరయ్యగారు నైజాం గవర్నమెంటుకు సలహాల నిచ్చుచుండిరి. వా రాలీనవాజుజంగు

గారి శక్తినిగ్రహించి రాష్ట్రపుత్రుడగు నీయనపై సర్కారుదృష్టి పడునట్లుచేసిరి. వీరు చేసిన సలహా మిక్కిలి ఫలవంతమై రాష్ట్రమును సర్వతోముఖముగా నుచ్ఛస్థితికి తెచ్చెను. ఆలీ నవాజుజంగుగారిప్పటికిని గవర్నమెంటుకు సలహా యింజనీయరుగ పనిచేయుచు రాష్ట్రోన్నతికి తోడ్పడుచున్నారు. ఇట్టి యున్నతోద్యోగులును, రాష్ట్రాభ్యున్నతియే తమ పవిత్రకర్తవ్యమని తలంచు ప్రభువును, కల్గిన నింకనేమికొదువ? బొక్కసమున ప్రతిసంవత్సరమును ధనమభివృద్ధి యగుచుండెను. రాష్ట్రాభివృద్ధి ప్రణాళికలు తయారగుచుండెను. అవి యన్నియు తగిన పెద్దల చేతులలోనుండెను. సమస్త శాఖలందును వెనుకటిమాంద్యము పోయి నూతన సమర్థత యావిర్భవించెను. ప్రభువుగారన్న భయము, గౌరవము, ప్రేమ యభివృద్ధియయ్యెను.

ఈ కాలమున జరిగిన మహాకార్యములను కొన్నింటిని వివరించిన నీపైమాటలయందలి సత్యము తెల్లము కాగలదు.



## ౧. మూసి ప్రాజెక్టు

మూసీనది హైద్రాబాదు పట్టణమును రెండు భాగములుగా విభజించినది. పట్టణములోని యొక భాగమునుండి మరియొక భాగమునకు పోవుటకీ నదిపై 3, 4 వంతెనలున్నవి. ఈనదికి "ఈసా" యను నొక యుపనది కలదు. ఈ రెండును కలసి కృష్ణతో కలియుచున్నవి. ఈనది పొంగి వరదయై హైద్రాబాదును 1908 సంవత్సరమున నాశన మొనరించెను. ప్రతి కార్యమును కొన్ని మంచి విషయములకును, మరికొన్ని చెడ్డవిషయములకును పరిణామమగును. పట్టణము చెడిపోయినని దుఃఖించినను, నూతన నిర్మాణము చక్కని పద్ధతిపై యగుట కవకాశము కలిగెను. ఆ వరదకు జరిగిన నాశనమును ప్రభువుగారి తండ్రిగారగు కీ॥ శే॥ మహా బూబల్లీపాషా గారు చూచి కన్నీరు కార్చిరట! ఆశ్చర్యము లేదు! అప్పుడు రాష్ట్రపు బొక్కసమును వీరు బీదలకు విరివిగా పంచిపెట్టిరి. పరిస్థితులు కొంచెము శాంతించిన వెంటనే వారింజనీర్లను రావించి, యిట్టి

యాపత్తు పట్టణమున కెప్పటికిని జరుగకుండనుండు మార్గముల నన్వేషించుట కాజ్ఞాపించిరి. ఇండియాలోని గొప్ప యింజనీరని ప్రసిద్ధికెక్కినట్టియు, మైసూరున కృష్ణరాయసాగరము కట్టుట కంచనాలువేసి దానిని నిర్వహించినట్టియు, శ్రీ సర్ యం. విశ్వేశ్వరయ్యగారు రావింపబడిరి. వారు 'మూసీ' 'ఈసా' నదులకు రెంటికిని యానకట్టలుకట్టి రెండు గొప్ప చెరువులను నిర్మించినయెడల, నవి హైద్రాబాదు నగరముపై వరద దాడి నాపుటయేగాక, వ్యవసాయమునకుకూడ నుపయుక్తములై, రాష్ట్రక్షేమముకూడ జరుగునని సలహా నొసంగిరి. ఈ ప్రాజెక్టునకు ధనము కావలసి యుండుట చేతను, రాష్ట్రమునకు వచ్చిన విపత్తునకు వెంటనే యంత ధనము సమకూడకపోవుటచేతను, ప్రణాళిక ప్రభుత్వముచే నంగీకరింపబడినను, కొన్ని సంవత్సరములాగవలసివచ్చెను. శ్రీవారు స్వయంపాలనమునకు గడంగినవెంటనే యీ విషయము వారి నాకర్షించెను. వెంటనే పని ప్రారంభించుట కుత్తరవు లొసంగిరి. మూసీ ప్రాజెక్టు మొట్టమొదట ప్రారంభించిరి. శ్రీవారు తమ స్వోపయోగమునకు మీరాలం (Mir Alam) చెరువునందలి నీటినేగాని త్రాగరు. అయినను ప్రజల సౌఖ్య

ము శ్రీవారి సౌఖ్యమే యగుటచే, వారీ విషయమున కాలయాపనము సహింపలేకపోయిరి. ఈ ప్రాజెక్టునకు శ్రీవారు 22-3-1913 తేదీన శంఖుస్థాపనము గావించిరి. 1918 సంవత్సరమున సంపూర్తియయ్యెను. అప్లేర్పడిన మహాసరస్సునకు శ్రీవారి పేరిట "ఉస్మాన్ సాగర" మని నామకరణ మొనర్చిరి. వర్షములు 5 సంవత్సరముల కాలమువరుసగా లేక పోయినను నీచెరువు హైద్రాబాదు నగరమున కవిచ్ఛిన్నముగా మంచినీటి వసతిని కలుగజేయగలదని చెప్పుదురు.

ఈచెరువు గండిపేటయను గ్రామమువద్ద నుండుటచే దీనిని గండిపేటచెరువనికూడ పిలుచుచున్నారు. ఇది హైద్రాబాదు నగరమున కారుమైళ్ళదూరమున నున్నది. ప్రతిదినమును వందలకొలది జనులు యాత్రకువలె నిచ్చటికి వెడలుచుందురు. సరోవరతీరమున మనోహరమైన యుద్యానము నొకదానిని నిర్మించినారు. ఈ యుద్యానము కొన్ని కాలములయందు, పగ లెండ వేడిమి నపనయించుకొనుటకును, రాత్రులయందు చంద్రికా విహారమునకును నుపయోగించు చున్నది. రాష్ట్రాతిథులు తప్పక చూడవలసిన దృశ్యములలో నొకటి.

ఈసాగర నిర్మాణమునకు 55 లక్షల రూప్యములు వ్యయమని చెప్పుటతోనే యీప్రాజెక్టుయొక్క మహాత్వము తెలుపడగలదు. ఒకమారచ్చటికి వెడలి చూచినవారాదృశ్యము నెప్పటికిని మరువజాలరు. శ్రీవారు స్వయంపాలన కాలమున హైదరాబాదు నగరమునందలి యైదులక్షల ప్రజలకిచ్చిన యమూల్య వరదానమిది. హైదరాబా "దుద్యాన నగర" మన జెల్లును. ప్రతి గృహమునను కొద్దియో గొప్పయో చెట్లు వేసుకొను నలవాటుకలదు. ఇట్లు ప్రతి గృహమునకు గల యుద్యానముల కవిచ్ఛిన్నముగను, నిర్మాల్యముగను, నుదకమును దానము చేయుచున్నదనిన, దానివలన కలుగు లాభములకు విలువ చెప్పుట యసంభవము. ఈ చెరువులోనుండియే నీటిని కొలది ధనమునకు కొని దానిపై లక్షల ద్రవ్యమును సికింద్రాబాదు కంటోన్మెంటువారార్జించుచున్నారన్నప్పుడు సరిహద్దులనున్న పరిస్థితులు పాఠకులకు గోచరింపక మానవు. సికింద్రాబాదున దినమున నీరువచ్చుకాలమునకు పరిమితి కలదు. హైదరాబాదున 24 గంటలు నవిచ్ఛిన్నధారగా నీరు ప్రవహించును. నీటికి హైద్రాబాదు నగరమున నున్నంత తక్కువ పన్ను మరియెచో

నగరమున లేదని చెప్పుట యతిశయోక్తి యెంతమాత్ర
మును కాదు. ఎండకాలమున నీ వరదానముయొక్క
విలువ చెప్ప నలవికాదు. సికిందరాబాదున నెచ్చ
టనో తప్ప ప్రజాసామాన్యముకొరకు నీటిసౌకర్యము
లేదు. ఎండకాలమున కొన్ని భాగములందలి పేదలు
మైలమైల మోడవలసినదే! కాని హైదరాబాదున ప్రజా
సామాన్యముకొరకై చేయబడిన నీటిసౌకర్యము మిక్కిలి
ప్రశంసనీయము. బాటసారులకును, బీదలకును అమృ
తప్రాయమైన దీ వరదానము. దీనివలన ప్రజల హృద
యములలో శ్రీవారు శాశ్వతస్థాన మలంకరించిరి. పట్ట
ణముయొక్క ఆపత్తును తప్పించుటయేగాక "ఏక
క్రియాద్వ్యర్థకరీ" యన్నట్లు, దీనితో శాశ్వతపానీయ
సౌకర్యమను రెండవయర్థమునుగూడ సాధించిరి.

## ౨. హిమాయత్ సాగరు

ఇదియు నీ కాలముననే కట్టుటకు నిర్ణయించినను, తరువాత 1919_20 సంవత్సరమున పని జరిగెను. కాని గండిపేట చెరువునకు సంబంధించిన విషయ మగుట చేతను, వరద నివారణ సాధనములలో నొకటి యగుట చేతను, నొకే ప్రణాళికలోని భాగమగుట చేతను, దీనినికూడ నిచ్చట చెప్పుటయే సమంజసమని తోచు చున్నది. మూసీతోపాటు "ఈసా" నది హైదరాబాదు ముప్పునకు కారణమని తలచిరి. అట్టి ముప్పునుండి నగరమును కాపాడుటకై యీ చెరువు కట్టబడి, దానికి శ్రీవారి పెద్దకుమారులును, యువరాజుగారునునగు, హిజ్ హైనెస్ మీర్ హిమాయతల్లీఖాను బహద్దూరు గారి పేరిట "హిమాయత్ సాగర"ని నామకరణమిడిరి. ఈ చెరువు కూడ గండిపేట చెరువున కెందును తీసిపోదు. దీనికి గండిపేట చెరువుకంటె హెచ్చు ద్రవ్యము వ్యయమయ్యెను. 91,51,000 రూప్యములు వ్యయమయ్యెనని చెప్పుదురు. ఈ చెరువుక్రింద కొన్ని వేల యెకరముల భూమిలో వరిపైరు పండుచున్నది. కావున నీచెరువు

ద్వ్యర్థకరియని చెప్పనగును. ఇటీవల జరిగిన విషయ మొకటి చెప్పవలసియున్నది. దాదాపు 5, 6 సంవత్సర ములనుండి వర్షములు బాగుగాకురియుట లేదు. అందుచే గవర్నమెంటువారు గండిపేట చెరువునుండియే గాక, హిమాయత్ సాగరు చెరువునుండికూడ హైద్రా బాదు పట్టణమునకు మంచి నీటివసతిని కల్పించవలెనని యత్నించి, యందులకై కొంత పనిగూడ చేసిరి. ఈ విధముగా నీ చెరువు మిక్కిలి యుపయుక్తమై యున్నది. ఈ చెరువు దృశ్యముకూడ గండిపేట చెరువు దృశ్యమువలెనే నేత్రానందకరము. ఇదికూడ నంత మంది ప్రేక్షకుల నాకర్షించుచునే యున్నది. గవర్న మెంటింతధన మింత యచిరకాలములో వ్యయముచేయ గలుగుట ప్రభుత్వమున కలిగిన పద్ధతియొక్క మార్పే నని చెప్పవలయును. ఇంతియేగాక యింక నెన్నికార్య ముల కెంతధనము వ్యయమయ్యెనో తెలిసికొనిన నాశ్చర్య నిమగ్నులమై చూడగలము! నిందు బొక్కస మేమిచేయలేదు? ఇట్టి పరిస్థితులు కనుగొన్న శ్రీ ప్రభువు వారు సర్వదా స్మరణీయులు!

## ౩. నగరాభివృద్ధి

మూసీ వరదలకు పట్టణము చాలా శిథిలమయ్యె నని విన్నవించియుంటిని. మరియు నీ హైదారాబాదు నగరము దాదాపు ప్రతివత్సరమును ప్లేగు జాడ్యము నకు గురియగుచుండెను. దీనికి కొన్ని కారణములు కలవు. పట్టణము పురాతనమై యుండెను. అందుచే ప్లేగు జాడ్యమును వ్యాపింపజేయు నెలుకలకు మంచి స్థావర మయ్యెను. మురికినీటి కాల్వలు బాగుగా లేకపోవుట చేత కొంత మాలిన్య మేర్పడెను. బొంబాయికి దగ్గర నుండుటచేతను, ప్రపంచ ప్రయాణీకులు, హిందూ దేశమున నాల్గవ నగరమును, పురాతన నాగరకత కాలవాలమునునగు నీ పట్టణమునుచూచుటకు నిరంత రము వచ్చుచుండుటచేతను, వారి రాకతో కొన్ని వ్యాధులుకూడ వచ్చుచుండెను. మరియు నగరముసందలి గృహములు క్రిక్కిరిసి యుండుటచేత నీజాడ్యము వ్యాపించుటకు సులువయ్యెను. కావున నెలుకలు రాకుండ చేసి, మురికినీటి వాసనను రాకుండచేసి, గృహ నిర్మాణములో పెంకుల నుపయోగించకుండ, విశాల

ముగ గృహనిర్మాణము గావించిన నీప్లేగు వ్యాపించుట కవకాశముండదని సుప్రసిద్ధవైద్యుల సలహా ననుసరించి, శ్రీవారు నగరనిర్మాణశాఖ నేర్పరచిరి. పట్టణమును దానికీర్తికి తగినట్లుచేయుటకూడ నీ స్థాపనోద్దేశములలో నొకటి. శ్రీవారు రాజ్యమునకు వచ్చిన సంవత్సరముననే, యనగా 1911 సంవత్సరముననే ప్లేగుజాడ్య మీ నగరమున విజృంభించెను. అప్పు డీ నగరమున వెనుకటివలె గాక, వీధుల విన్యాసమును, గృహ నిర్మాణమును, నూతనపద్ధతులపై నుంచునట్లు తీర్మానింపబడెను. ఈ నూతనశాఖ 1913 సంవత్సరములో అనగా శ్రీవారు స్వయంపాలనము చేయబోవు కాలమున స్థాపింపబడెను. 1914 సంవత్సరము నవంబరు మాసమున పని ప్రారంభింపబడెను. ఈశాఖయొక్క రెండుద్దేశము లీ క్రిందివిధముగా వివరించిరి.

I. పట్టణ సౌందర్యమును పెంపొందించుట.

II. పట్టణ పారిశుద్ధ్యము నభివృద్ధి యొనర్చుట.

వీని సంపూర్తికై యీ క్రిందిపనులు తలపెట్టబడి, వీని కంచనాలు తయారుచేయబడెను.

(1) వరదవలన నదిలోనినీరు పొరలి పట్టణము పైకి రాకుండునట్లు నది యిరుప్రక్కలను, ఎత్తయిన గట్టి రాతిగోడలను కట్టుట. ఈ గోడల ప్రక్కన నిరు వైపులను పొడుగాటి రోడ్లను నిర్మించుట. ఈ రోడ్ల ప్రక్కనే కట్టదలచిన గొప్ప కట్టడములనుకట్టిన మిక్కిలి సుందరదృశ్య మేర్పడును.

(2) వెనుకటి కంకరరోడ్లను సిమెంటురోడ్లుగా గాని తారురోడ్లుగాగాని మార్చుట.

(3) ఇండ్లు మిక్కిలి గుమిగా గూడిన స్థలము లను గవర్నమెంటువారు స్వాధీనపరచుకొని, వీథులను వెడల్పుచేసి, బీదలకును సామాన్య ప్రజలకును ననువగునట్లు తక్కువ యద్దెలకు, ఎలుకలు ప్రవేశించు టకు వీలులేనట్లు నివేశనములను కట్టుట.

(4) మురికినీటి కాల్వలు పైకి కన్పడి దుర్వాసన నియ్యకుండు నట్లు, భూగర్భమున నిర్మించుట. ఈవిధ ముగా వీథులు వెడల్పుచేసి, సిమెంటూ తారురోడ్లను వేసి, స్వచ్ఛ వాయుసంచారమునకు తావిచ్చి, పట్టణ పారిశుద్ధ్యము నభివృద్ధిపరచిన, నిక ప్లేగు మొదలగు



నగర రక్షణశాఖ నిర్మించిన స్లైపుల్లాకులు

నంటు జాడ్యములు తప్పక యడుగంటుననుట సూహా సరియైనదేయని పరిణామమువలన మనకిప్పుడు తెలియు చున్నది. ప్లే గింక నున్నను, నది మిక్కిలి స్వల్పముగా నుండి, శీఘ్రముగా నిర్మూలించుట కవకాశము కల్గి, వెనుకటివలె పురజనులందరు నిండ్లువదలి యూరిబైట నుండు స్థితికి తెచ్చుట లేదన్న, శ్రీవారికాలమున చేసిన యత్నఫలమేనని వేరుగా చెప్పవలెనా? ప్రజాసౌకర్య మునకై వెనుకంజవేయుట శ్రీవారి స్వభావముకాదు! ఈ యుద్దేశ్య పరిపూర్తికై యీక్రింది పనులు జరుగు నట్లు ప్రభుత్వమువారు నిర్ణయించిరి.

(1) అఫ్జల్గంజు వంతెనలదగ్గరనుండి ముసల్లంజంగువంతెనవరకు నది కిరుప్రక్కల గోడలు కట్టుట. ఈ పనికి 8 లక్షలు వ్యయమగునని యంచనావేయ బడెను. 1915 సంవత్సరముననే పని ప్రారంభమయ్యెను.

(2) హైద్రాబాదు నగరమునందలి కాచిగూడా రైలుస్టేషనునకు చేరునట్లు రెండు వీధులు నిర్మించుట. వీనిని తారురోడ్లుచేయుటకై 4 లక్షల వ్యయమగునని యంచనావేసిరి.

(3) ఇండ్లు క్రిక్కిరిసియున్న యీక్రింది పట్టణ భాగములను విశాలముచేయుటకును, నందుండు నివేశనములను పునర్నిర్మించుటకును నేర్పాట్లు కావించిరి. (i) అక్బరుజా బాజారు (ii) సుల్తాన్ షాహి (iii) నాంపల్లి. ఈ మూడు ప్రదేశములలో నిరుప్రక్కలనుండు మురికి నీటి కాల్వలను మూయుటకు నేర్పాట్లు కావించిరి. ఈపనికి దాదాపు 10 లక్షల వ్యయము కావలసియుండెను.

(4) సుల్తాన్‌షాహి నాంపల్లి గృహముల నిర్మాణమునకు 12 లక్షలు వ్యయము కావలసి యుండెను.

(5) పత్తరుగట్టి రోడ్డు వెడల్పుచేసి, వీధి కిరుప్రక్కల సుందరములైనట్టియు, రాష్ట్రశిల్పమును ప్రతిబింబింపజేయునట్టియు, ముఖమండపముల నిర్మించుట. ఆయొక్క ప్రదేశమునందలి వానికి 2 లక్షలు వ్యయమగునని తలంపబడెను.

(6) బీదలకును ప్రయాణీకులకును నుండుటకై నాంపల్లి మొదలగు ప్రదేశములయందు వసతిగృహములను నిర్మించుట. ఇదికూడ నిశ్చయింపబడెను. కాని వెనుకటివి ముందు చేయవలెనని ప్రభుత్వమువారు సంకల్పించిరి.

ఎంతద్రవ్యము! ఈ నగరాభివృద్ధి శాఖాపక్షమున ప్రతి సంవత్సరమును లక్షకు పైగా రూపాయలను వ్యయముచేయున ట్లేర్పాటు గావించిరి. పైపనులుగాక భూగర్భమున పారు మురికినీటికాల్వల ప్రణాళిక కింత కంటె 10 రెట్లు ధనవ్యయము చేయవలసియుండెను. అప్పుడు ప్రారంభించిన పను లింకను ననగా నీ 25 సంవత్సరములనుండి జరుగుచునే యున్నవి. పట్టణమంతయు సిమెంటురోడ్లు పూర్తికాలేదు! డ్రెయినేజి సంపూర్ణముగా నింకను నగరమునంతను నావరింపలేదు. ఒకటి-మారు పట్టణమునంతను తిరిగిన నీ నగరాభివృద్ధి శాఖ చేసినపని బోధపడును. ప్రతి సంవత్సరము ప్లేగు జాడ్యము నగరమున కతిథి కాకుండుటయే ఫలమనుకొన్నను, నింత ధనవ్యయమునకు విచారింప బనిలేదు!

# ౪. ప్రాచీనవస్తు రక్షణశాఖ

ఈశాఖావిషయమునుగూర్చి యెక్కువగా చెప్పుటకు పూర్వ మీరాష్ట్రము చారిత్రకముగా నెంత ప్రాముఖ్యము గలదియో చెప్పుట యవసరము. ఈరాష్ట్రము వింధ్యపర్వతపంక్తి కవ్వవహింత దక్షిణ భాగమున నున్నది. ఉత్తరభారతదేశమునకును, దక్షిణ భారతదేశమునకును, భాషావిషయమున, నాగరికతా విషయమున, చారిత్రక విషయము మొదలగు సన్ని విషయములను, భేదము చాలగలదు. సకలభారత భాగ లక్షణము లీ రాష్ట్రమున గలవు. ఇచ్చటనే శాలివాహ నుని పైఠను నగరముకలదు. ఇదియే హిందూ మున ల్మాను రాజ్యములు పరస్పర స్పర్థతో నధికారము కొఱకు పోరాడినస్థానము. ఇదియే మహారాష్ట్రులు పుట్టి పెరిగి యభివృద్ధిపొంది నశించిన దేశభాగము. ఇదియే పాశ్చాత్య జాతులకు యుద్ధరంగముగా వరలిన భూ భాగము. ఇంకను పూర్వమునకు దృష్టి నిగిడించిన నిదియే ప్రాచీనాంధ్రుల యునికిపట్టు. ఇదియే తూర్పు చాళుక్యులు వలసవచ్చిన మార్గము. ఇదియే మొగలు

లాక్రమింప సమకట్టిన ప్రదేశము. తుదకిదియే నిజాముల్ముల్కు మహాశయుడు స్వాతంత్ర్యమును ప్రకటించిన పవిత్రస్థలము. ఇచ్చట పూర్వాంధ్ర కాకతీయాంధ్ర మహమ్మదీయ మహారాష్ట్ర మొగలు రాజ్యచిహ్నములు గలవు. ఇచ్చటనే పూర్వాంధ్రుల ప్రతాపములు చాటునట్టియు, ప్రపంచమున నిట్టి శిల్పచాతుర్యము లేదని పేర్వడసినట్టియు, ఎల్లోరా యజంతా చిత్రములు గలవు. ఇచ్చటనే యిస్లాం శిల్పమును వెనోళ్ల చాటు గోలకొండా బాదుకోట మొదలగు కట్టడములు గలవు. ఇచ్చటనే కాకతీయాంధ్రుల మాహాత్మ్యమునకు సాక్ష్యములగు వరంగలుకోట రామప్పదేవాలయాదులు గలవు. ఇచ్చటనే కృష్ణరాయలను దుర్నిరీక్ష్యుని జేసిన రాయచూరు యుద్ధము జరిగినది. ఇచ్చటనే విజయనగరసామ్రాజ్యమును నిర్మూలించిన తాలికోట యుద్ధముజరిగినది. ఇచ్చటనే గురుగోవిందుసింగు సమాధికలదు. ఇచ్చట ప్రస్తుత మాంధ్రులు మహారాష్ట్రులు కన్నడులు ముసల్మానులు లేకకుటుంబము వారివలె సోదరులై యున్నారు. పైవారుగాక యనేక రెడ్డి రాజులు మొదలగువా రనాదినుండి యీభూభాగమున రాజ్యములను సంపాదించి, యిచ్చటి పరిపాలనా పద్ధతి

యందును, రాజనీతియందును, శౌర్యచరిత్రమునందును, పాల్గొనిరి. ఇప్పటికిని రాష్ట్రమున నడుగడుగునకును "గడీ" లనబడు చిన్న కోటలుగలవు. ఇది హిందూదేశ హృదయ భాగము. ఇట్టిరాష్ట్రమునకు మధ్యభాగమున నున్నదీ హైద్రాబాదునగరము! ఇది కారణముగా యావద్భా రతదేశ నాగరికతయు నిచ్చట నచ్చుగ్రుద్దినట్లు నిదర్శన పూర్వకముగా స్థావర మేర్పరచుకొనియున్నది.

ఇట్టి నాగరికతా చిహ్నములను రక్షించుట విధి యని శ్రీవారి ప్రభుత్వము కనిపెట్టెను. శ్రీ హైదరీగారికి చరిత్రమన్నను, అందును పూర్వ నాగరికత యన్నను, మిక్కిలి యభిమానము. వారికి చరిత్రమునందున్న ప్రీతిని, కళాప్రియత్వమును, బొంబాయియందలి మ్యూజియము నకు వా రుపయోగించుట కిచ్చి, యిప్పు డచ్చట ప్రద ర్శింపబడుచున్న వస్తుసామగ్రి చాటుచున్నది. అందుచే వా రిచ్చటి ప్రాచీన శిల్పములను రక్షించుట విధియని తలంచిరి. దానికి పరిణామముగ నీశాఖ 27-6-1914 తేదిన స్థాపింపబడునట్లు ప్రభుత్వమువా రాజ్ఞాపించిరి. ఈ క్రింది వాక్యములు ప్రభుత్వమువారి దృక్పథమును తెల్లము చేయగలవు.

"ప్రాచీనచారిత్రకచిహ్నము లీ రాష్ట్రమున పరిశోధనమున కనువగునట్టి భారతదేశమున నెచ్చటను కానరావు. మఱియు నవి శిల్పకళాదృష్టితో చూచిన మిక్కిలి విలువగలవి. మానవునియొక్క చరిత్రమును, నాగరకతను వెల్లడిచేయునట్టియు, మెడోస్ టైలర్ మహాశయునిచే కొనియాడబడినట్టియు, షోరాపూరు ప్రాంతమునందలి శిథిలములవంటి వీ రాష్ట్రమున ననేక ప్రాంతముల గలవు." ఇట్టి విలువను కనిపెట్టుటలో శ్రీవారిప్రభుత్వముయొక్క దూరదృష్టికలదు. ఇవియే మనపూర్వులు మన కిచ్చిపోయిన పిత్రియము.

ఈ చిహ్నములన్నియు నిప్పటికిని సశరీరవిజ్ఞాన చిహ్నములై పూర్వుల కీర్తికాయములని చెప్పనొప్పును. ఇట్టి బౌద్ధచైత్యములు, జైనవిహారములు, హిందూ దేవాలయములు, ముసల్మాను మసీదు గుంబద్లు, క్రైస్తవ ప్రార్థనాలయములు, నీ రాష్ట్రమున నసంఖ్యాకములుగా గలవు. ఇవి యన్నియు ప్రపంచమునందలి యన్ని భాగములనుండి యిచ్చటికివచ్చు బాటసారుల నాకర్షించుచుండుటచే, నీశాఖ మిక్కిలి ముఖ్యమైనదని వేర చెప్పవలయునా ! ప్రప్రథమమున నీ శాఖ

ఎల్లోరా యజంతాశిల్పరక్షణము ముఖ్యోద్దేశ్యముగా కలిగియుండెడిది. క్రమ క్రమముగా సమస్తప్రాచీన వస్తుజాలము నీ శాఖక్రిందికి తేబడెను. ఈ శిల్పములలో కొన్ని శిథిలావస్థయందుండెను. వానిని పునర్నిర్మాణము చేయవలసి యుండెను. నిర్మాణ పద్ధతియు వెనుకటి శిల్పచాతుర్యము ననుసరింపవలసి యుండెను. ఈ శాఖానిర్వహణము ప్రపంచోపకారమన చెల్లును! ఒక జాతియొక్క నాగరకత యది వదలిపోయిన మాన్యముపై నాధారపడియుండును. అట్టి చిహ్నములు నశించినయెడల తన్నాగరకత నశించినట్లే యగును. ఇచ్చటి వస్తుసంచయమునందలి కళావిజ్ఞానము ప్రపంచమునంతను ముగ్ధము చేయుచున్నదన్న నాశ్చర్యము కాదు! ఎల్లోరా అజంతాలుగాక కొన్ని ముఖ్యకట్టడముల నిట చేర్కొందును:—

(1) పర్భనీ జిల్లాలోని నాగనాథ దేవాలయము:— ఈ దేవాలయము మైసూరు రాష్ట్రమునందలి హాలీబెడ్ (Halibed) దేవాలయమువలె మిక్కిలి విచిత్రమైన కట్టడము. బ్రిటిషు కళావేత్తలు దీనిని మిక్కిలి కొనియాడియున్నారు.

గల పుస్తక భాండాగార ముండెనట ! తంజావూరు గ్రంథాలయమును తలపించుచున్నది !

(4) చార్ మినారు:— ఈకట్టడముకూడ మిక్కిలి చారిత్రిక ప్రసిద్ధికలది. నాల్గు గోపురము లుండుటచే నీకట్టడమున కీ పేరువచ్చెను. ఇది 1591 సంవత్సరమున నిర్మింపబడినది. అంగసౌష్టవమునకును, నిర్మాణచాతురికిని, నది మిక్కిలి ప్రసిద్ధిచెందినది. హైదరాబాదున వాడబడు హాలీసూపాయిపైన దీని చిత్రమున్నది. చుట్టు నున్న పరిసరములలో నిది మిక్కిలి చిత్రమై విరాజిల్లు చున్నది. దీని గోపురము లొక్కొక్కటి 180 అడుగుల యెత్తు కలిగియున్నవి. కళానైపుణి యతిసుందరము. మొదట నిది రాజభవన ద్వారమునకుగాను నిర్మింపబడెను. ఇందిప్పుడొక పోలీసుస్టేషను కలదు.

(5) మక్కామసీదు:— ఇది చార్ మినారునకు సమీపముననే యున్నది. ఇది 225 అడుగుల పొడవును, 180 అడుగుల వెడలుపును గలిగి, 75 అడుగుల యున్నతి కలిగి, 10,000 మంది యేకకాలమున ప్రార్థనచేయుట కనువగునట్లున్నది. క్రీ॥ శ॥ 1612 సంవత్సరమున గోలకొండ నవాబగు మహమ్మదు కుతుబ్ షా దీనిని ప్రారంభించెను.

ఆయన తరువాతవారు దాని నిర్మాణమును సాగించిరి. తుదకు దాని నౌరంగజేబుచక్రవర్తి సంపూర్తి గావించెను. దీనికి రెండుగోపురములు కలవు. ఒక్కొక్క దాని యెత్తు 100 అడుగులు. ఈ మసీదునందలి మధ్యభాగమున 360 చతుర గజములుగల మండువా కలదు.

పైమసీదులుగాక ముష్షీరాబాదు మసీదును, తోలీమసీదును, గూడ నెన్నదగిన కట్టడములే! ఇవి హైద్రాబాదు పరిసరములనే యున్నవి. ఇవిగూడ కుతుబ్ షాహి కాలమునాటి నిర్మాణ కౌశలమున కాటపట్టులైయున్నవి. ఇవిగాక గోలకొండ నవాబుల సమాధులు మిక్కిలి కళాకౌశలము కలిగి దర్శనీయములై యున్నవి. ఈ కాలమునందలి కట్టడములందు ముఖ్య విశేషము "ఆర్చి" కట్టడము. మరియు కొయ్య తలుపులందుతప్ప యుపయోగింపబడి యుండలేదు. ఈవిషయమున గూడ నీశిల్పము దక్షిణ దేశమందలి హిందూ భవనములగు తంజావూరు మధుర రాజభవనములను తలపించుచున్నది.

ఇవిగాక జగద్విఖ్యాతములగు నెల్లోరాయజంతా చిత్రములను గూర్చి రెండుమాటలు చెప్పెదను.

ఎల్లోరాచిత్రములు బౌద్ధ హిందూ జైన మతసంబంధము కలిగియున్నవి. మూడుమతములవారి శిల్పమును వీని యందు సమ్మిశ్రితమై యున్నది. ఈ శిల్పము నరేబియా నుండి వచ్చిన బాటసారియగు మసూదీ మిక్కిలి కొనియాడెను. ఈ శిల్పము క్రీ॥ శ॥ 5వ శతాబ్దము మధ్య కాలమునకు సంబంధించినదని చారిత్రికులు చెప్పు చున్నారు. ఎల్లోరాగుహాలలో నెల్ల కైలాసదేవా లయము మిక్కిలి యెన్నదగినది. దీనికి ప్రతివచ్చు శిల్పము ప్రపంచమున లేదని చెప్పుదురు. దేవాలయ మంతయు నొక్కరాతిలో చెక్కబడియున్నది. ఈ యొక్క కైలాసదేవాలయమే 270 అడుగుల పొడవును 150 అడుగుల వెడల్పును కలిగి, చూపరకాశ్చర్యమును గొల్పుచు, ప్రపంచము నందలి యన్నిభాగములనుండి ద్రష్టలనాకర్షించుచున్నది. ఇందలి చిత్రములు కొన్ని వర్ణకలితములై యుండెను. ఇప్పటికిని కొన్ని స్థలము లందు వర్ణములు పురాతన కాంతితో ప్రకాశించు చున్నవి. ఇక నజంతాయందలి బౌద్ధ విహారములు వర్ణనాతీతములు. 24 విహారములును, 5 చైత్యములు నిందున్నవి. అర్ధచంద్రాకారముగ పర్వతము 2596 అడు గుల మొత్తున తొలువబడినది. ఇందలిదియంతయు బౌద్ధ

కాలశిల్పము. ఈ రెండు శిల్పశాలలును హైద్రాబాదు రాష్ట్రమును జగద్విఖ్యాతము గావించినవి.

ఇట్టి ప్రాచీన దృశ్యములను మనుష్యహస్తములు చెడగొట్టకుండ రక్షించుట ప్రభుత్వముయొక్క విధియని తెలిసికొనుటకు వారు వందనీయులు. కేవలము వీని రక్షణమునకేగాక, వీనిని శిథిలము గాకుండ, వలసిన స్థలములయందు పనిచేయించుట కూడ ఈ శాఖ కర్తవ్యమయ్యెను. ఇటలీ దేశమునుండి కెకోర్ని, ఆర్సిని యను శిల్పులను పిలిపించి యీ గుహాలయందలి చిత్రములకు రంగులవేయుటకు ప్రభుత్వమువారు నియమించిరి. పాలంపేట దేవాలయము నందలి కొన్ని భాగములు శిథిలము లగుటకు సిద్ధము కాగా వానిని నిర్మింపజేసి కాపాడిరి. ఈ శాఖాధ్యక్షు లగు శ్రీ గులాం యజ్దానీగారు మిక్కిలి సమర్థులును, విజ్ఞానవంతులు నని పేరువడసియున్నారు. వారి యాధిపత్యమున ప్రాచీనవస్తు రక్షణమేగాక, నూతనమైన త్రవ్వడములుకూడ జరుగుచున్నవి. ఇటీవల పరిశ్రమచే బౌద్ధకాలమునాటి కుంభకార శిల్పమును తెలియ జేయునట్టి యనేక ప్రాచీన వస్తు సముదాయమును,

ప్రాచీనములైన నాణెములును త్రవ్వి యెత్తబడినవి. మరియు వీరజంతా, యెల్లోరా చిత్రములయొక్క సమగ్ర చరిత్రమును వ్రాసి ప్రకటించుచున్నారు. వారి కందులకు ప్రపంచమంతయు సర్వదా కృతజ్ఞమై యుండవలెను. ప్రభుత్వముయొక్క సర్వమత సమ దృష్టి, ప్రాచీనశిల్ప గౌరవమును, దీనివలన తెలియ గలదు. ఏతచ్ఛాఖకై ప్రభుత్వమువారు పెక్కు లక్షల ద్రవ్యమును వ్యయముచేసిరి.

ఇటీవల ప్రభుత్వమువారు మ్యూజియము నొక దానినికట్టి దానియందీప్రాచీన వస్తువులను ప్రదర్శించు నట్లేర్పాట్లు గావించిరి. ప్రాచీన మృత్పాత్రలు, లోహ పాత్రలు, ఖడ్గాదులు, నాణెములు, వస్త్రములు, విగ్రహ ములు మొదలగునవి ప్రదర్శనమున కుంచబడినవి. మరియు ప్రాచీన దృశ్యములయొక్క ఛాయాచిత్రములు స్వల్ప వ్యయమునకే విక్రయింపబడుచున్నవి. ఇట్టీశాఖ మిక్కిలి ప్రశంసనీయమైన పని చేయుచున్నది.

## ౫. సహకారశాఖ

1914 సంవత్సరము ఫిబ్రవరి మాసమందే యనగా శ్రీవారింకను కార్యభారమును పూనకముందే యీశాఖ యుద్దేశింపబడెను. అప్పటి వ్యవసాయ శాఖాధ్యక్షుడగు కెన్నీదొరగా రీశాఖాస్థాపనవిషయమున నొక విన్నపము శ్రీవారి కంపిరి. విషయములన్నియు సంపూర్ణముగ విచారణచేసినవెనుక 1914 సంవత్సరమున నీశాఖస్థాపింపబడెను. మొదట నీశాఖ వ్యవసాయ శాఖతో కలిసియుండెను. కాని తర్వాతవిడదీయబడెను. ఈ శాఖోద్దేశములు ముఖ్యమైనవి రెండు:—

(1) స్థానిక షాహుకార్లవద్ద యెక్కువ వడ్డీకి ద్రవ్యము నప్పుతీసుకొని రయితు నష్టపడకుండునట్లు చేయుట.

(2) కరువు పరిస్థితులకు ప్రతీకారముచేయుట.

ఈ శాఖ పల్లెటూళ్ళ రయితులకు పట్టుకొమ్మయయ్యెను. వెంటనే ప్రజల మనస్సులను చూరగొనెను. ఈ సహకారశాఖాభివృద్ధిచే రాష్ట్రమభివృద్ధి

వంతమయ్యెను. ఈశాఖకొక చట్టము శాసింపబడెను. దానిప్రకారము సంఘములు స్థాపింపబడెను. వ్యవసాయ సంఘములును, వ్యవసాయేతర సంఘములును, వీనిపై కేంద్రసంఘములును స్థాపింపబడెను. ప్రజలకు మిక్కిలి యుపయుక్తములయ్యెను. శాఖాస్థాపనము జరిగిన 4 సంవత్సరములకే, అనగా 1922 సంవత్సరమునకే యీక్రింది విధమైన యభివృద్ధికనబడెను.

1,278 — వ్యవసాయ సంఘములు.
173 — వ్యవసాయేతర సంఘములు.
13 — కేంద్ర సంఘములు.

38,722 — సభ్యులు.

పదమూడు జిల్లా కేంద్రములయందును కేంద్ర సంఘములు స్థాపింపబడి 1922 సంవత్సరమునాటికి శాఖయందు 36,19,243 రూపాయలు వ్యవహరింపబడుచుండెను. అది యీ క్రింది విధముగా విభజింపబడెను.

| | |
|---|---|
| షేరు ధనము | 7,00124 |
| రిజర్వుఫండు | 92,190 |
| డిపాజిట్లు | 17,50,514 |
| ఇతర అప్పులు | 45,621 |
| గవర్నమెంటుఅప్పు | 10,30,794 |
| | **36,19,243.** |

ఈ శాఖాస్థాపనమైన కొంత కాలమునకు పారిశ్రామిక సంఘములేర్పడెను. వీనియుద్దేశము స్థానికపరిశ్రమలకుసహాయమొనర్చుట. గృహాపరిశ్రమలను సాధ్యమైనంత వరకభివృద్ధికి తెచ్చుటకూడ వీనియాశయము. 1914 సంవత్సరము నాటికే మ॥ ఘ॥ వ॥ నిజాం ప్రభుత్వము గృహాపరిశ్రమలయొక్క ప్రాముఖ్యమును కనుగొనగలిగిరి. [1]బ్రిటిషిండియా యందిట్టిది ఇటీవలనే జరిగెను. అఖిల భారతగృహ పరిశ్రమల సంఘము గాంధీగారి నాయకత్వమున స్థాపింపబడి యిప్పుడిప్పుడే పనిచేయుచున్నది. ఈ పారిశ్రామిక సంఘములు స్థానిక పరిశ్రమాభివృద్ధి నిమిత్తమును, నట్టిపారిశ్రామికులకు స్వతంత్రజీవనము చేసు కొనునవకాశ మిచ్చుటకును నియమింపబడెను. ఇట్టి యుద్దేశములతో మహాబూబు నగరు, వరంగల్లు, గుల్బర్గా మొదలగు ప్రదేశములలో 37 చేనేత పరపతిసంఘములును, వరంగల్లు ఔరంగబాదులలో రెండువ్యవసాయ సంఘములును, నాల్గు చేకాగి

1 వెనుకటి నిజాంప్రభువులు కూడ నిట్లే దేశీయవస్తు ప్రీతి కలిగియుండిరి ఘ॥ వ॥ నాజరుద్దౌలావారు దేశీయవస్తువులను తప్ప యుపయోగింప కూడదని యాజ్ఞాపించిరి. — *'My Life' P. 177.*

తపు సంఘములును, స్థాపింపబడెను. ఈ పరిశ్రమల
కీ క్రింది విధముగ సహాయ మొసర్పబడెను:—

| | |
|---|---|
| చేనేత సంఘములు | రూ. 89,783 |
| వడ్రంగి సంఘములు | 7,726 |
| చేకాగితపు సంఘములు | 9,672 |
| | 1,07,181 |

[1]చేకాగితపు పరిశ్రమ యొక్క యావశ్యకత
యిప్పుడిప్పుడే బ్రిటిషిండియాలో గుర్తింపబడుచుండగా
నిచ్చట పావు శతాబ్దము క్రిందటనే గుర్తింపబడుట
ప్రభుత్వమువారి దూరదృష్టిని వేనోళ్ళ చాటుచున్నది.
చేకాగిత మెట్టి కార్యముల కొర కుపయోగింపబడు
చున్నదో చెప్పిన నిందలి రహస్యము తెల్లము కాగ
లదు. శ్రీవారి శ్రీఫర్మానాలీ కాగితములపై ప్రచు
రింపబడుచున్నవి. ఉన్నతోద్యోగు లుత్తర ప్రత్యుత్తర
ములకు వీనినే యుపయోగింతురు. క్రిస్టమసు మొద
లగు పండుగల కభినందన పత్రముల కీ కాగితముల

1 ఇది ఈ రాష్ట్రమందలి యొక ముఖ్యపరిశ్రమ

నుపయోగింతురు. ఈ కాగితము మిక్కిలి పవిత్రమైన దను నభిమానము వ్యాపించియున్నది.

ఇటీవల యీ శాఖాకార్యములు సర్వతోముఖముగా పెరిగిపోయినవి. ఇప్పుడు పట్టణమున నుద్యోగియుల సహకార సంఘములు, గృహనిర్మాణసంఘములు, మరియు నిటీవలనే యొక సహకార యిన్సూరెన్సు సంఘమును స్థాపింపబడి పనిచేయుచున్నవి. గ్రామములందలి వ్యవసాయ సంఘములు మునుపటికంటె నెక్కువగా వ్యవసాయవిషయములందు సలహానొసంగుట యేగాక మంచివిత్తనములుకూడ నీ సంఘద్వారమున పంచిపెట్టుచున్నవి. ఈ శాఖ రాష్ట్రమునందలి శాఖలన్నిటిలోను మిక్కిలి యభివృద్ధికరముగ పనిచేయుచున్న శాఖయని చెప్పనగును.

ఇటీవల బ్రిటిషిండియాయందు సహకారశాఖ బాగుగా పనిచేయుచుండలేదను ప్రతీతి ప్రబలియున్నది. పూర్తిగ ప్రజలపై వదలినగాని యే శాఖయు తృప్తికరముగా పనిచేయజాలదు. గట్టి పై యజమాయషి యుండవలెను. గ్రామములందలి చిల్లర తగాదాలును, పోట్లాటలును, పార్టీలును, నీ శాఖానిర్వహణమునందు

దింపబడుచున్నవి. వానివలన నీశాఖాకార్యములు కొన్ని స్థలములలో స్తంభించి యున్నవి. ఆర్థికస్థితిచే రయితు తీసుకొన్న ఋణమును మరలనియ్యలేకుండ నున్నాడు. మరియు రైతు జీవిత మాడంబరసహితమై వ్యయకారణమై యున్నది. ఈ కారణ పరంపరచే రైతుతన బాధ్యతను నిర్వర్తింపలేని స్థితియందున్నాడు. ఈ వాసన సహకారశాఖకుకూడ తగిలి కార్యము స్తంభించియున్నది. ఈ రాష్ట్రమునందలిపరిస్థితులు భిన్నములు. ప్రభుత్వము వారు తమరే సంపూర్ణబాధ్యతను వహించుట మిక్కిలి తృప్తికరము. ఇచ్చట నార్థికదుస్థితియనునది లేదు. ప్రజలకేమేమి యవసరములో ప్రభుత్వమే నిర్ణయించుటచే, ప్రజలలో పార్టీలెట్లు కలుగగలవు? కావున నీ శాఖ రాష్ట్రమునందంతటను సర్వతోముఖవ్యాప్తికలిగి పని చేయుచున్నది. ఈ శాఖయొక్కయు వ్యవసాయశాఖ యొక్కయు సహకారముచే నప్పుడప్పుడు ప్రదర్శనములు జరుగును. వానిని గ్రామస్థులు మిక్కిలిగా నుపయోగించుకొను చుందురు. ఈ ప్రదర్శనముల బాహుళ్యమును, ప్రజాకర్షణమును నీ శాఖయొక్క ప్రశస్తకార్య నిర్వహణమునకు నుదాహరణములు.

## ౬. వ్యవసాయశాఖ

రాష్ట్రమునందధిక సంఖ్యాకులకు వ్యవసాయమే ముఖ్యవృత్తి. కావున నీశాఖయొక్క ప్రాముఖ్యము వేరే చెప్ప బనిలేదు. శ్రీవారి రాజ్య ప్రారంభముననే యీ శాఖ స్థాపింపబడెను. కాని తత్కార్యము లీ కాలమున విపులీకరింపబడినవి. రాష్ట్రముయొక్క పంటలలో ముఖ్యమైనవియు, ప్రజల కాధార భూతములైనవియు, ప్రత్తి జొన్న పంటలు. రాష్ట్రమునందలి ప్రజలలో దాదాపు సగము సంఖ్యకు జొన్న లాహారము. మరా ట్వాడాయంతయు జొన్న పంటపై నాధారపడియున్నది. ప్రత్తిపంటకూడ రాష్ట్రమున ముఖ్యమైనది.

ప్రత్తిలో రెండురకము లున్నవి. పొడుగు, పొట్టి (Long staple, Short staple). వీనిలో నిచ్చట సామాన్యముగ పొడుగురకము పండింపబడుచుండెను. కాని పొట్టి రకము పంట చాలా యెక్కువగా దిగుబాటగుటచే నిచ్చటి రయితులు తమ పురాతన పొడుగురకమును వదలి పొట్టి రకమును పండింప మొద లిడిరి. దిగుబడీ యెక్కువకు భ్రమపడి పండించినను

రయితుకు వచ్చు నాదాయము తగ్గుచుండెను. ఏలన పొట్టిరకము ధర తక్కువగా పలుకుచుండెను. రయితునకు నష్టము వచ్చుటను ప్రభుత్వమువారు కనుగొని, మరల పొడుగు రకమునకే రయితు మరలుటకై యీ శాఖద్వారా ప్రచారము చేసిరి. ఈ శాఖ చేసిన పనులలో నిది ముఖ్యమైనది. మొదటమొదట రయితు మరల పొడుగు రకమును పండించుటకై విముఖుడుగ నుండెను. కాని సర్కారువారు ప్రచారము మూలమున నాతని నెట్లో త్రిప్పిరి. తుదకు విత్తనములను రైతునకు సప్లైచేసి పండించిరి. మరల ధరపలికి రైతునకు లాభము వచ్చుచుండెను. మునుపటికంటె నా ప్రత్తి పండించు విస్తీర్ణ మెక్కువయ్యెను. రయితుకీ శాఖద్వారా విత్తనము పంచిపెట్టుచుండిరి. తరువాత ప్రత్తి మార్కెటులో నీ రాష్ట్రపుప్రత్తికి ప్రతిష్ఠ హెచ్చెను. "హైద్రాబాదు గారాని" యని దానికి నామకరణ మిడిరి. రయితులు దీనిని విరివిగా పండింపసాగిరి. 1917 సంవత్సరమున నీ ప్రత్తి పండించిన విస్తీర్ణము 2,39,189 యెకరములు. ఇది క్రమముగా నెంత పెరిగెనో యీక్రింది యంకెలు తెలుపుచున్నవి:—

1919 (1329) ఫ) 3,11,774 యెకరములు
1920 (1330 ఫ) 5,73,115 యెకరములు

ఈవిధముగా నీశాఖ రయితునకును రాష్ట్రమునకును సేవచేసెను.

మరియు నీ సహకారవ్యవసాయశాఖ లీ ప్రత్తి పంటనుగూర్చి పరిశోధనలను చేసిరి. పై రకములేగాక "కాంబోడియా" మొదలగు ననేకరకముల ప్రత్తిని గూర్చిన పరిశోధనలు గావింపబడెను. తెలంగాణాలో కొంత భాగములో "కాంబోడియా" ప్రత్తిని కొన్ని యెకరములలో పెంచిరి. ప్రత్తి విషయమునగాక చెరుకు విషయమైకూడ నీ శాఖ పరిశోధనలను గావించెను. చెరుకునకు కావలసిన యెరువు మొదలగు విషయములపైకూడ పరిశోధనలు జరుపబడెను. ఇప్పపువ్వు పిప్పి యెరువుగా నుపయోగించుట మొదలగు ననేక విషయము లీ శాఖ కనిపెట్టెను.

ఇంతియే గాక వ్యవసాయ పరికరముల విషయములోకూడ నీ శాఖవా రెక్కువ శ్రద్ధవహించిరి. ఎచ్చటెచ్చటి నేల యెట్టిదో, యెట్టి నేల కెట్టి పరికరము లుపయోగింపవలెనో, యను విషయములను

గూర్చి రయితులకు తెలియజేయుటకై రాష్ట్రమునందలి పలుప్రదేశములలో, నా ప్రదేశమునందలి వ్యవసాయ ప్రయోజనముల ననుసరించి వ్యవసాయ ప్రదర్శనము లేర్పాటు చేయబడెను. విత్తుట, నీళ్లుచల్లుట, మొదలగుపనుల కెట్టి పనిముట్లు వలయునో రయితులకు తెలియపరచి, వాని యుపయోగ మీ ప్రదర్శనములలో తెల్లము చేయబడెను. రాష్ట్రమునందు పండు పంటలకు తగినట్లు, నేలకు తగినట్లు, విత్తనములయొక్క యోగ్యత రయితునకు విప్పి చెప్పబడుచున్నది. వ్యవసాయవిద్య రైతునకుసులభముగా నందజేయుటకై వ్యవసాయసంఘములు, స్థాపింపబడి వానిపక్షమునకొన్ని పత్రములు ప్రకటింపబడెను. ఉర్దూభాషయందొక వ్యవసాయ పత్రిక స్థాపింపబడెను. ఈ పత్రిక తెలుగునకూడ ప్రకటింపబడుచున్నది. ఈ సంఘముల పక్షమునకూడా వ్యవసాయ ప్రదర్శనములు జరుగుచుండును.

డిసెంబరు 1917 సంవత్సరము (1327 ఫ)న జరిగిన గొప్ప "అవర్ డే పారిశ్రామిక ప్రదర్శనము" సందర్భమున నీ శాఖవారు ప్రశంసా పాత్రమైన పనిచేసిరి. హిందూదేశమున నితర భాగములను, నిక్కడను,

పండింపబడు ప్రత్తియొక్క తారతమ్యము చూపిరి. ఎరువులును వాని యుపయోగమును తెలిపిరి. ఏ పైరున కెట్టి పురుగులు పట్టునో, వానిని నివారించుట కేమి చేయవలెనో చూపిరి. నీళ్ళను చిలకరించు యంత్రములు ప్రదర్శించిరి. పట్టు పురుగులను పెంచుట మొదలు గుడ్డ నేతవరకు నేమిచేయవలెనో చూపిరి. ఇట్టి ప్రదర్శనము లేటేటను జరిగి రయితుకు వలసిన విధానములు తెలుపబడుచున్నవి. కావున నీ శాఖావ్యవహారము లీ స్వయంపాలనా కాలమున మిక్కిలి జయప్రదముగా నుండెను.



## ౭. ఇతరశాఖలు

ఇదివర కిన్ని ప్రత్యేక శాఖలు లేవు. వీని పనుల న్నియు రివిన్యూ శాఖయందే జరుపబడుచుండెను. 1917 (1327 ఫ) సంవత్సరములో నీశాఖలు స్థాపింపబడి, యొకటిగా వ్యవహరింపబడ సాగెను. ఈ శాఖచే రాష్ట్రము నందలి పరిశ్రమలన్నియు పరీక్ష చేయబడెను. రాష్ట్రము న తయారగు ముడి పదార్థములు పరిశ్రమల కుపయోగించుటను గూర్చి యోజింపబడెను. నూనె, ధాన్యములు ననగా నాముదపు పిండి, నువ్వులు, కుసుమ, మొదలగు నవి యీ రాష్ట్రమున విరివిగా పండుచున్నవి. ఆముదము పంటలో నీ రాష్ట్రము చాలముఖ్యమైనది. ఇట్లు నూనె దినుసు లీ రాష్ట్రమున నుండగా, వానినుండి యే పరిశ్రమలు వీలగునో శాఖవారు పరీక్షించి, సబ్బు పరిశ్రమ యందరకు నవసరమని తలచి, సబ్బు చేయు విధానము ప్రజలకు తెలియజేయుటకై యొక చిన్న పరిశ్రమాలయమును స్థాపించిరి. మరియు నీ రాష్ట్రమున నిప్పపూవు మెండుగా దొరకును. దానితో సారాయి తయారగుచున్నది. సారాయి గాక పారిశ్రామికముగా

నుపయోగించుటకు వీలగునట్లు దీనినుండి "ఆల్కో-హాలు" తీయు ప్రయత్నములు సలుపబడెను. అందులకై కామారెడ్డియను పట్టణమున నొక ఫ్యాక్టరీ స్థాపింపబడెను. అది యిప్పటికిని చాలా సంతృప్తికరముగా పనిచేయుచున్నది.

నేతయొక ముఖ్య పరిశ్రమ. చేనేతయొక్క ప్రాముఖ్య మీ ప్రభుత్వమువారు ప్రథమమునుండి కనుగొనిరి. ఈ నేతకు సులభమైన మగ్గములను ప్రచారము చేయుటకై హైద్రాబాదున నొక చేనేత ప్రదర్శనశాలను స్థాపించిరి. ఈ శాఖ పక్షమున నాధునిక నేత పరిశ్రమమునం దారితేరిన వారిచేత ప్రతిజిల్లా కేంద్రమునను ప్రదర్శనము లేర్పాటు చేయబడెను. నేత పాఠశాలలు కొన్ని యేర్పాటుచేసి నేతగాండ్రు తర్బీతు చేయబడిరి. కొన్ని జిల్లా పట్టణములందు నేత ప్రతిష్ఠాపనములను స్థాపించిరి. రసాయన పరిశోధనము యొక్క యావశ్యకత కనిపెట్టబడి యొక పరిశోధనాలయము (Labaratory) స్థాపింపబడెను.

ప్రజల సౌకర్యముకొరకై వివిధరాష్ట్ర ప్రాంతములలో ప్రయాణము సులభము చేయుటకై, ప్రైవేటు

మోటారు ప్రయాణసౌకర్యములను కూర్చుట కీ శాఖ వారు తలపడిరి. రాష్ట్రములోని ధనికులను ప్రోత్సాహ పరచిరి. వారికి బస్సులను నడుపు హక్కులనిచ్చి ప్రయాణసౌకర్యముల నభివృద్ధిచేసిరి.

ఈ విధముగా నీశాఖ బహు తృప్తికరముగా పనిచేసినది. ఈ శాఖా వ్యవహారము లిప్పు డింకను నభివృద్ధియైనవి. ఇప్పు డీ శాఖ మిక్కిలి విరివిగా పని చేయుచున్నది.

వెనుకటివిగాక స్థానిక స్వపరిపాలన శాఖయు, విద్యుచ్ఛక్తి శాఖయు, పారిశుద్ధ్యశాఖయు, నారోగ్య శాఖయు మొదలగు ననేకశాఖలు స్థాపింపబడెను.

ప్రజలకు తమ స్వగ్రామ పాలనమున తర్ఫీదు నిచ్చుటకు స్థానిక స్వపరిపాలనశాఖ యేర్పాటుచేయ బడెను. ఇందు స్థలముయొక్క వి స్తీర్ణము ననుసరించి సభ్యుల హెచ్చుతగ్గు సంఖ్యలతో స్థానిక బోర్డులు నిర్మింపబడెను. పలుకుబడిగల స్థానిక ప్రముఖులను ప్రభుత్వమువారే సభ్యులనుగా నియమించుచుండిరి. ఈ శాఖను ముందు ముందు మ్యునిసిపాలిటీలుగాను,

జిల్లాబోర్డులుగాను నభివృద్ధిచేయుట కవకాశము కలదు. ఇప్పుడీ సంఘములలో కొన్ని మ్యునిసిపాలిటీలైనవి. అట్లే కొన్ని జిల్లాబోర్డులైనవి. ప్రభుత్వమున ప్రజలకు సంబంధము కలుగిజేయవలెనను సూత్రము నిజాం ప్రభుత్వము వా రెంతకాలముక్రిందట కనిపెట్టిరో చూచిన వీరి దూరదర్శిత్వము తెల్లముకాగలదు. విద్యుచ్ఛక్తిశాఖా స్థాపనముచే హైద్రాబాదునగరము విద్యుచ్ఛక్తి దీపములచేత నలంకరింపబడినది. దానికి సంబంధించిన యితర సౌకర్యములును చేకూరినవి. ఈ శాఖ మిక్కిలి లాభకారిగా నున్నది. అందుచే ప్రైవేటు కంపెనీలవారు తమ కనుకూలురగు నుద్యోగుల సిఫారసుచే నీశాఖను గుత్తకు దీసుకొనవలెనని ప్రయత్నించినను శ్రీ ప్రభువు వారియ్యకొనక తమ ప్రజాప్రేమను రాష్ట్రప్రేమను వెల్లడిచేసిరి. ఈ శాఖ యిటీవల రాష్ట్రమంతటను నభివృద్ధిచేయబడుచున్నది. రాష్ట్రమునందలి పెద్ద పెద్ద స్థలములందన్నిటియందును విద్యుచ్ఛక్తిని నెలకొల్ప బ్రయత్నములు జరుగుచున్నవి. వరంగల్లు, గుల్బర్గా, ఔరంగబాదు, రాయచూరు మొదలగు ననేక స్థలములందు విద్యుచ్ఛక్తి యంత్రములు నెలకొల్పబడి జనులకు వెలుతురు నిచ్చుచున్నవి. గండిపేట చెరువు హైదా్రి

బాదు ప్రజల కెట్లు మంచినీటి సౌకర్యము కలిగించెనో యీ శాఖ యట్లే వెలుతురును ప్రసాదించినది. పారిశుద్ధ్య, ఆరోగ్య, శాఖలెట్లు పనిచేయుచున్నవో తెలుపుటకై వెనుకటివలె ప్రతి వత్సరము, నగరమును, రాష్ట్రమును, ప్లేగు జాడ్య మావరించుట లేదనుటకంటె వేరే పరీక్ష వలయునా? పై శాఖలుగాక మరియొక శాఖ స్థాపింప బడినది. అది లెక్కల శాఖ (Statistics). రాష్ట్రమునందలి పంటలు, ధరలు, జనసంఖ్య, వర్షాదులు, వృత్తులు, మొదలగునవి యేయేట నెట్లున్నవో తెలియజేయు లెక్కలను తయారు చేయుట యీ శాఖయొక్క ముఖ్యకర్తవ్యము. ఇప్పుడీశాఖ మిక్కిలి చురుకుగా పనిచేయుచు, నేయేటి లెక్కలు కావలెనన్నను నిచ్చుటకు సంసిద్ధముగా నున్నది. హైద్రాబాదురాజ్య మభివృద్ధినొందుచుండ లేదని దుర్వాదన చేయువారీశాఖసప్లై చేయు నంకెలను చూచి తమ యభిప్రాయములను మార్చుకొందురుగాక!

## ౮. భవన నిర్మాణము

హైద్రాబాదు హిందూదేశమున నాల్గవ పట్టణ మను కీర్తిని గడించి యున్నది. మరియు రాష్ట్రము యొక్క సర్వతోముఖాభివృద్ధి ప్రతి శాఖయందును చేయవలసిన కార్యములను పెంచుచుండెను. విద్యార్థి గణ మెక్కువయ్యెను. జనసంఖ్య యభివృద్ధిచే రోగుల సంఖ్య హెచ్చయ్యెను. న్యాయస్థానములయొక్క పని యధికమయ్యెను. ఇట్టి యభివృద్ధి కిదివరలోనున్న భవనములు చాలకుండెను. కావున నీ మూడు శాఖలకును మూడు కట్టడము లవసర మయ్యెను. వానిని నిర్మించుటకు తీర్మానింపబడెను. ఇప్పుడు మూసీనదీతీరమున కన్నుల పండువుగా నగపడునట్టియు, నంబర చుంబి శిఖరములచే నలంకృతము లైనట్టియు, గొప్ప భవనము లన్నియు నీ కాలమునకు సంబంధించినవే! ఇవి పట్టణ గౌరవమును కూడ కాపాడునట్టివిగ నుండవలదా? నిర్మాణ మీ కాలమున ప్రారంభింపబడినను పూర్తి యగుటకు చాల వత్సరములు పట్టెను. ఉన్నతన్యాయ స్థానము, సిటీకాలేజి, ఉస్మానియా వైద్యాలయములను

నీమూడు కట్టడములును, సమర్థులగు నిర్మాతలచే తయారు చేయబడి పట్టణాలంకారములై యాత్రికుల కాశ్చర్యమును గొల్పుచున్నవి. వీనితోకలసి మూసీ యుద్యానవనము నేత్రానందకరముగ నున్నదనిచెప్పుట యతిశయోక్తి గాదు.

వైద్యాలయమునందు జరుగుచున్న చికిత్సాకార్యములు హిందూదేశమునందలి యే వైద్యాలయమునందలి వానికైనను తీసిపోవు. సమర్థులగు వైద్యు లేర్పాటు చేయబడిరి. ఇప్పు డీ వైద్యాలయము సర్వజనుల నాకర్షించుచున్నది. ఈ భవనము లాయా శాఖాకార్యములకు వలయుస్థలమును సమకూర్చెను. నగరాభివృద్ధి శాఖయు, నీ భవనములకు తగినట్లు రోడ్లు మొదలగు వానిని నిర్మించి సాయమొనర్చెను. మూసీయుద్యానము వైద్యాలయమునందలి రోగులకు నేత్రానందకరమై ముదావహమై యున్నది. మరియు సద్వాయు ప్రచారమునకు తోడ్పడి రోగులకు రుగ్మతలు తగ్గుటయందు సహకారి యగుచున్నది. ఈ భవనములన్నియు హిందూ ముసల్మాను వైజ్ఞానిక సమ్మేళనమునకు తార్కాణములుగా నున్నవి.

## ౯. పోలీసుశాఖ

1912 సంవత్సరములో బ్రిటిషిండియాయందు పోలీసునిర్మాణోపసంఘ మొకటి యేర్పడెను. దాని ఫలముగా కొన్నిసూచనలు చేయబడెను. వాని ననుసరించి యీకాలమున నీరాష్ట్రమునగూడ నామార్పులు గావింపబడెను. ఈ శాఖ రెండుభాగములుగా భాగింపబడెను.

(1) నగరశాఖ

(2) జిల్లాశాఖ

నగరశాఖ యొక కమీషనరుక్రింద నుంచబడెను. జిల్లాశాఖయంతయు నొక రాష్ట్రాధికారిక్రింద నుంచబడెను. ప్రథమములో నపరాధ పరిశోధనశాఖయొకటి యేర్పరుపబడి ప్రత్యేకముగా పనిచేయుచుండెను. అది క్రమముగా నభివృద్ధియయ్యెను.

మరియు నీకాలమున నూతనముగా కొన్నిమైళ్ళ రైలుమార్గము నిర్మింపబడి క్రొత్తమార్గముల కంచనాలు తయారు చేయబడెను. హైద్రాబాదునుంచి

గద్వాలకు మార్గము తయారయ్యెను. అచ్చటనుండి కర్నూలుకు కలుపవలె నని యుద్దేశింపబడెను. మీటరు గేజికి ప్రత్యేకముగ కాచిగూడాలో స్టేషను నిర్మింపబడి వేరుచేయబడెను. ఈ రైలుమార్గమును రాష్ట్రస్వ మును చేయవలెనను నభిప్రాయము శ్రీవారి కీ కాల మందే కలిగెను. కాని యది యధిక ద్రవ్యసాధ్య మగు టచే కాలముకొరకై వేచియుండుట తటస్థించెను.

ఈ కాలముననే వైద్యవిద్యాలయము స్థాపింప బడెను. అంటురోగముల చికిత్సాలయ మేర్పాటు చేయబడెను. ఈ కాలమునకు సంబంధించిన మూడు ముఖ్యవిషయముల నింకను చెప్పవలసియున్నది. తత్కథనముచే శ్రీవారి సామ్రాజ్యసేవ, విద్యాప్రియత్వము, ప్రజానురంజకత్వము తేటతెల్లము కాగలదు. మరియు వారి రాజ్య కార్యధురంధరత్వము కన్నులకు కట్టిన ట్లగపడును. రాష్ట్రముయొక్క యార్థికోన్నతియు తెలియును.

**(2) పాలంపేట దేవాలయము:—** ఇది వరంగల్లు జిల్లాలో కలదు. మిక్కిలి యందమైన కట్టడము. ఈ దేవాలయముపై నుపయోగించిన యిటుకలు నీటిలో తేలునని చెప్పుదురు. (కాని నేను ప్రయత్నించిన నట్లు జరుగలేదు.) ఈ దేవాలయ స్తంభములకుగల శిల్ప మద్భుతము. ఇచ్చటనే రామప్ప చెరువు బాటసారుల నేత్రముల నానందింపజేయుచు వరలుచున్నది. ఈ సర స్తీరము గొప్ప యడవులుకలిగి వ్యాఘ్రాది ఘాతుక మృగముల కాకరమై యున్నది. ఘ॥ వ॥ శ్రీ యువ రాజుగారిచ్చట నేకరాత్రమున నరగంటకాలమున నాల్గు పులులను చంపిరి. రామప్ప, లఖ్నావరము, పాకాల, చెరువులు కాకతీయుల కాలమునాటివి. వానిక్రింద యిప్పుడు కొన్నివేల యెకరములు వరిపంటపండు భూమి యున్నది.

**(3) ఇట్టగి, దిచ్‌పల్లి దేవాలయములు:—** ఇట్టగి లోని మహాదేవుని యాలయమును, దిచ్‌పల్లిలోని నృసింహాలయమును మిక్కిలి యందమైన శిలాశిల్ప మును గలిగియున్నవి. మెడోస్‌టైలరుగారీ రెండు దేవాలయములను మిక్కిలి పొగడియున్నారు. షోరా

పురమను గ్రామమున కొంతకాల మీడోస్ టైలరు గారు నివసించినారు. వారు నివసించిన యిల్లిప్పటికి నీ శాఖవారిచే పోషింపబడుచున్నది. షహాపూరు షోరాపూరు ప్రాంతమున ప్రథమ ముసల్మానులు దక్షిణ దేశమునకు వలసవచ్చి స్థావర మేర్పరచుకొనిన గ్రామములు గలవు.

(4) వరంగల్లులోని వేయి స్తంభాలగుడి:-[1] ఈ పట్టణమున నీ దేవాలయమేగాక వెనుకటి కోట త్రివ్వడములు కూడ ముఖ్యముగా చూడదగినవి. ఇచ్చటి శిల్పముగూడ మిక్కిలి చారిత్రక విలువగలిగి కాకతీయాంధ్రుల కీర్తిని వేనోళ్ళ చాటుచున్నది. జాయ సేనాని యిచ్చటివాడే! ఎంత గొప్ప సేనాపతియో యంత కళాభిజ్ఞుడు. ఈయన రచించిన నృత్త రత్నావళి యను నాట్యగ్రంథముయొక్క ప్రతి తంజావూరు పుస్తకాలయమున కలదు. అది యాంధ్రుల కమూల్యమైన గ్రంథము.[2]

1 శం॥ అప్పన్నశాస్త్రిగారి గ్రంథమును చూచునది:

2 చూ. గోలకొండపత్రికలోని వ్యాఖ్యానము.

వెనుకటి మూడు ముఖ్య విషయముల నీక్రింద బొందుపరచుచున్నాను.

**౧. 1918-19 సంవత్సరపు క్షామము**
**౨. ఉస్మానియా విశ్వవిద్యాలయ స్థాపనము**
**౩. మొదటి ప్రపంచయుద్ధము**

వీనిలో నొక్కొక్క దానినే తీసికొని వివరింతును.

## ౧. 1918-19 సంవత్సరపు క్షామము

1918 సంవత్సరములో ననావృష్టి ప్రజలను మిక్కిలి పీడించెను. పంటలన్నియు వానలేమిచే ఫలింపక పోయెను. కాటకము తటస్థించెను. ప్రజలాహారము లేక మలమలమాడిరి. శ్రీవారు ప్రజల కష్టములను సహించలేక కరువు కార్యములనుపేర పనులను కల్పించి ప్రజలకు సాయ మొనర్చిరి. వెచ్చించిన ద్రవ్యమును చూచిన శ్రీ ప్రభువువారికి ప్రజలపై నున్న ప్రేమ తెల్లముకాగలదు. అదివరలో ప్రారంభించిన భవన నిర్మాణాదులు కొందరు ప్రజల కన్నము లభింపజేసెను. ప్రత్యేకముగా కరువుకొరకు వెచ్చించిన ద్రవ్యము **51,71,515** రూపాయలని లెక్క తయారు

చేయబడెను. బ్రిటిషిండియాలో కూడ కరువులు కలిగెను. కాని బ్రిటిషిండియాలో నన్ని కరువులకును వెచ్చించిన ద్రవ్యమును కలిపినను, నీయొక్క వత్సరమున నైజాం ప్రభుత్వమువారు ఖర్చు చేసిన దానితో తులతూగ జాలదు. బ్రిటిషు పరిపాలనము యంత్రము వంటిది. దానిలో మనుష్యత్వము తక్కువ. కాని యిచ్చట "నా రాజ్యము, నా ప్రజలు" అను భావమే యింత ద్రవ్యము వెచ్చించునట్లొనర్చినది. ప్రభుత్వమునకు మానవత్వ మీ యొక్క విషయ మియ్యజాలును. శ్రీ వారి కృపచే రాష్ట్ర మీ యనావృష్టి వత్సరమును గడపెను. ఈ రాష్ట్రము పంటలకు వర్షముపై నాధారపడియున్నది. అందుచే నీ సంవత్సరము నుండి యెప్పుడనావృష్టి తటస్థించునో యను భయముచే శ్రీ హైదరీ గారు రాష్ట్రాదాయములోనుండి కొంత ద్రవ్యము కరువు నిధిగా ప్రత్యేకించుట మొదలిడిరి. కొంతకాలమున కా నిధి కొన్ని కోట్ల రూపాయలైనది.[1] ఈ రాష్ట్రముయొక్క యార్థిక నిర్మాణమున నిది యొక ముఖ్యవిషయము.

1 ఇటీవల మరల కరువు పరిస్థితులు కలుగుటచే నీ నిధినుండి చాల ద్రవ్యము ఖర్చు పెట్ట బడుచున్నది.

## ౨. ఉస్మానియా విశ్వవిద్యాలయ స్థాపనము

**విద్యావ్యాపనము :—**

శ్రీ వారి రాజ్య ప్రారంభమున నీ రాష్ట్రమం దంతటను 1052 పాఠశాలలును, నందు 65,104 విద్యార్థులు మాత్రమే యుండిరి. శ్రీ వారు మిక్కిలి విద్యాప్రియులు. ప్రజలు విద్యావంతు లయినగాని రాష్ట్రము వృద్ధి నొందజాల దని గ్రహించిరి. అందుచే పురాతన విద్యా సంస్థల యభివృద్ధి మూలమునను, నూతన విద్యాలయ స్థాపనము మూలమునను, విద్య నభివృద్ధి పరచిరి. శ్రీ వారు రాజ్యమునకు వచ్చునప్పటికి సంవత్సరము క్రిందటనే మధ్య రాష్ట్రముల డైరెక్టరుగారగు టి. ఐ. మేహ్యూ అనునాయనను, నిజాం రాష్ట్రము నందలి విద్యావిషయములను పరీక్షించి యభివృద్ధికొరకు సలహాల నిచ్చుటకు నియమించిరి. శ్రీ వారు రాజ్యమునకు వచ్చిన కొలది దినములలోనే వీ రా రిపోర్టును శ్రీ వారికి సమర్పించిరి. అం దీ క్రింది ముఖ్యసూచనలు కావింపబడెను.

(1) ప్రారంభవిద్య త్వరగా రాష్ట్రమునందంతటను వ్యాప్తమగునట్లు చూడవలెను.

(2) ప్రారంభవిద్య, విద్యార్థియొక్క మాతృభాషయందే గరపవలెను.

(3) నిమ్నజాతులకొరకు ప్రత్యేక విద్యాలయములను స్థాపింపవలెను.

(4) విద్యాలయముల తనిఖీని బాగుగా చేయవలెను.

(5) స్త్రీవిద్యాలయములు స్థాపించి స్త్రీవిద్యనభివృద్ధి పరుపలెను.

(6) ట్రైనింగై యోగ్యతగల యుపాధ్యాయులను నియమించవలెను.

(7) ఇంగ్లాండునందు బోధనమునందు తరిబీతైనవారి నున్నతవిద్యాలయాధ్యక్షులుగా నియమింపవలెను.

(8) హైద్రాబాదునందలి ట్రైనింగు కళాశాలనభివృద్ధిపరచి, ప్రతి జిల్లా ముఖ్యపట్టణమునందును ప్రాథమిక మాధ్యమిక బోధనాభ్యసన పాఠశాలలను స్థాపించవలెను.

(9) ప్రాథమిక మాధ్యమిక విద్యావిధానమును, పారిశ్రామిక పాఠశాలల యందలి విద్యావిధానమును, రాష్ట్రావసరముల ననుసరించి మార్చవలెను.

(10) విద్యావిషయమున నొక నియమావళిని (Code) తయారుచేయవలెను.

(11) పఠనీయ గ్రంథములను నిర్ణయించుటలో మిక్కిలి శ్రద్ధ వహించవలెను.

శ్రీవారు వీని నన్నిటిని గమనించి క్రమముగా నీ సూచనల నన్నిటి నమలులో నుంచున ట్లానతిచ్చిరి. మొదట పరీక్షాధికారులను తనిఖీనిమిత్త మేర్పాటుచే యుట యవసరమని తనిఖీశాఖ యభివృద్ధి చేయబడెను. మద్రాసు నందలి (S. S. L. C.) ప్రణాళిక ననుసరించి (H. S. L. C.) ప్రణాళిక మార్చబడి యమలులోనికి వచ్చెను. స్త్రీలకొరకై రెం డున్నతపాఠశాలలు నెల కొల్పబడెను. నాంపల్లిలోని జనానావిద్యాలయము (H. S. L. C.) కిని, మహబూబియా స్త్రీపాఠశాల కేంబ్రిడ్జిపరీక్షలకును, సంబంధింపజేసిరి. బాలికలు విద్యాలయములకు విరివిగా రా మొదలిడిరి. నిజాం కళాశాల రాష్ట్రముయొక్క యవసరములను కొంత

వరకు తీర్చుచుండెను. ఈ విధముగా విద్యాలయముల యొక్కయు విద్యార్థులయొక్కయు సంఖ్యకూడ హెచ్చసాగెను. ఈ క్రిందియంకెలు మనకు సాక్ష్యము నిచ్చుచున్నవి.

| సం॥ | పాఠశాలలు | విద్యార్థులు |
|---|---|---|
| 1911 | 1052 | 65,104 |
| 1919 | 4255 | 1,57,097 |

పాఠశాలల సంఖ్య నాల్గురెట్లును, విద్యార్థుల సంఖ్య మూడింతలును పెరిగినట్లు కనుగొనగలము. ఇది యంతయు శ్రీ వారి స్వయంపాలనాఫలము. కాని యీ సంఖ్య లింకను రాష్ట్రవిస్తీర్ణమునకు చాలా తక్కువయైనను, నభివృద్ధి కల్గినదనియు, నింకను కలుగుచున్న దనియు, తెల్పుజాలి యున్నవి. అంతలో శ్రీ వారి దృష్టిని మరియొక విషయ మాకర్షించెను.

**ii పరివర్తనకాలము:—**

1918 సంవత్సరమునాటికే హిందూదేశమున విద్యావిషయమైన యభిప్రాయములు మారుచుండెను. ఇంగ్లీషు విద్యయందలి వ్యామోహము తగ్గుచుండెను. నిరుద్యోగ సమస్య ప్రారంభమై హెచ్చజొచ్చెను. విద్యాలయ

ములలో నోసంగు విద్య దేశపరిస్థితులకును, నవసర ములకును, నాగరకతకును, తగనిదని నాయకు లెల్ల రును గొంతెత్తి చాటుచుండిరి. ఇట్టి పరిస్థితులకు పునాదివేసినది జాతీయవిద్యోద్యమము. దాని ప్రారం భము 1906 సంవత్సర మని చెప్పనగును. లార్డు కర్జన్ వైసరాయిగా నున్నప్పుడు బంగాళారాజధానిని రెం డుగా విభజింపగా గొప్ప యాందోళనము ప్రారంభ మయ్యెను. తత్ఫలితముగా మూడుద్యమములు తల యెత్తెను.

1. స్వరాజ్యోద్యమము
2. స్వదేశవస్తువులనే యుపయోగించుట
   (విదేశవస్తు బహిష్కారము)
3. జాతీయవిద్యోద్యమము

వీనిలో మూడవది మనకు ప్రస్తుతము జాతీయ విద్యాస్వరూప మెవ్వరును చెప్పలేకపోయినను, ప్రస్తుత విద్య యనుపయుక్త మని మాత్ర మందరు నేకీభవిం చిరి. ఇట్టివారిలో శ్రీ హైదరీగా రొకరు. వా రిచ్చట శ్రీవారి కుడిభుజమై వర్తించుటచే నిచ్చటి విద్యావిష యములయందు మార్పు కలుగజేయవలెనను నూహ

వారిలో బాడమెను. వారు సుప్రసిద్ధ రాజకీయ విద్యావేత్తయగు గోపాలకృష్ణఘోక్లేగారి మిత్రులు. అందుచేత విద్యావిషయక పరిజ్ఞానము పూర్ణముగా గలవారు.

అప్పటి (ఇప్పటికూడా) విద్యనుగూర్చి మూడు మాటలను చెప్పెదను. బ్రిటిషిండియాలో నియ్యబడు చున్న విద్య, దాదాపు శతాబ్దముక్రిందట నింగ్లీషువారు సుకరముగ రాజ్యము చేయుట కనువగునట్లు, చిల్లర యుద్యోగస్థులను తయారుచేయుట కేర్పరుప బడినది. అప్పటినుండి యిప్పటికిని యట్లే గతానుగతికముగా నా పద్ధతియే యనువృత్త మగుచున్నది. ఈ విద్యాపద్ధతి వలన హైందవులయందు దాస్యభావము పెంపొందు చున్నదనియు, హైందవబాలుని సహజప్రతిభ తగ్గి, బాలురు వైజ్ఞానికముగా మార్పు నొందుచున్నారనియు, నీ విధానము వారిని సాంప్రదాయదూరుల నొనర్చు చున్న దనియు, నాయకులు తలంచ మొదలిడిరి. శ్రీ వివేకానంద స్వాములవా రొకమా రిట్లు సెలవిచ్చిరి.

"The first thing that a boy learns as soon as he goes to school, is that his father was a

fool, that his grand-father was a crazy lunatic, and that all his sacred books were lies."

ఈ అభిప్రాయపరివర్తనము కొంతవరకు బంగాళా విభజనాందోళనాఫలితము. అప్పటినుండి జాతీయ విద్య కావలెనని దేశమంతయు ఘోషిల్లమొదలిడెను.

ఇప్పుడు విద్యాలయములయందమలున నున్న విధానము గుమస్తాలను తయారుచేయునదియే నని యనుకొనినను, దానిని వలయునట్లు మార్చుట కధికారము లేకపోవుట విషాదకరము. అట్లు సవరించుటకు వీలులేకపోవుటచే, నీ లోటును తీసివేయుటకు వీలు లేదయ్యెను. సంస్థానములుకూడ బ్రిటిషిండియానే గ్రుడ్డిగ ననుసరించుచుండెను. నాయకులందరును దేశభాషలలో నున్నతవిద్య వరకును గరపిన విద్యార్థులకు విద్యను సేకరించుట సులభమయి శ్రమ తగ్గుననియు, క్షేమకరమనియు, నాందోళనము చేయజొచ్చిరి. కాని యా యాందోళనము సంస్థానములలోనికి వ్యాపింపకుండెను. శ్రీ హైదరీగారు విద్యాధికుడనియు, విద్యావిషయముల నిశ్చితములైనట్టియు, నభివృద్ధికరములైనట్టియు, నభిప్రాయములు గలవాడనియు, మున్నే విన్నవించియుంటిని. వారి నీ విషయ మాకర్షించెను.

దానివలననే యే సంస్థానమునందును నిప్పటికిని జరగని విషయము జరుగుట తటస్థించెను.[1] శ్రీ ప్రభువువారికి శ్రీ హైదరీగారొక వినతిపత్రమును సమర్పించుచు దానియందు తమ సూచనల గావించిరి. ఇంతకు పూర్వమే శ్రీ మేహర్యాగారు ప్రాథమిక మధ్యమోన్నత విద్యయందు వలసిన మార్పులను సూచించుచు చేసిన ప్రణాళిక వీరికి సహకారి యయ్యెను. ఆ ప్రణాళిక కొంతవరకమలులోనికి వచ్చుటకూడా యిందులకు సహాయ మొనర్చెను. ఆ ప్రణాళికయను పునాదిపై కళాశాలా విద్యాభవనమును నిర్మించుట శ్రీ హైదరీగారి వినతిపత్రములోని సారాంశము. అందలి కొన్నియంశముల నిట నుగ్గడించుట యప్రస్తుతము కాజాలదు.

"ఇప్పటి విద్యావిధానమునందున్న లోపములు లేనట్టియు, వానిని సవరింపగల్గునట్టియు, విశ్వవిద్యాల

[1] బ్రిటిషిండియాయం దిప్పటికిని నీ పద్ధతి యవలంబింపబడలేదు. ఇప్పట్లో యవలంబింపబడు సూచనలుకూడ కానబడవు. మద్రాసు, ఆంధ్ర విశ్వవిద్యాలయములు మెట్రిక్యులేషనువరకు నర్ధాంగీకారము నిచ్చినవి.

యము నొకదానిని మనము నిర్మింపవలయును. విద్యా విషయికములైన మూలసూత్రములపైన విద్యాలయ మాధారపడవలయును. ఎవరికొరకది కల్పింపబడినదో వారి యాశయములను సంపూర్తిచేయుచు, వారి జాతీయ స్వభావము ననుసరించి యుండవలెను. ఇప్పటియు, పురాతనమైనట్టియు, విద్యయందలి యుత్తమాంశముల నన్నిటి నది కాపాడవలయును. ఒకే సంస్థ విద్యను గరపుచు, పరీక్షాధికారమును కూడ కలిగియుండవలయును. మరియు నిక్కడి దేశభాషయగు "ఉర్దూ"లో గ్రంథములను స్వయముగా రచించుటయు, భాషాంతరీకరించుటయేగాక, విద్యార్థుల బుద్ధులను వికసింపజేయ సమర్థమై యుండవలెను."

ప్రస్తుతవిద్యయందలి లోపముల నుగ్గడించుచు శ్రీ హైదరీగారు ముఖ్యమైన యీ క్రింది విషయములను సెలవిచ్చిరి.

(1) విద్యార్థియొక్క జ్ఞాపకశక్తి ననవసరముగా కష్టపెట్టి కుంఠీభూతమొనర్చుట.

(2) విషయగ్రహణముననేగాక, సూక్ష్మాంశము లతో కూడ భాషను నేర్చుకొనుటలో కాలమునంతను నిరుపయోగముగా వ్యయపరచుట.

(3) స్వతంత్రముగ నాలోచించు శక్తి నరికట్టి, ప్రజాసామాన్యమునకు జ్ఞానమును దేశభాషామూల మున నందిచ్చుట కభ్యంతరము కలిగించుట.

పైమూడు కారణములచే, హిందూదేశము నందలి విద్యావంతులకును, సామాన్యప్రజలకును నంతర మధికమగుటయేగాక, యిక నెన్నటికిని నది కలియుటకు వీలు లేని పరిస్థితు లేర్పడవచ్చును. ఇప్పటి ప్రజా బాహుళ్యమందున్న యసంతృప్తి కిది యొక కారణము. ఉద్యోగులను ప్రజలనుండి వేరుచేయుటే, విధానము నేర్పాటు చేసినవారి ముఖ్యోద్దేశము. [1] ఉర్దూను బోధనభాషను చేయుటలో కొంద రాక్షేపణముచేయుట తటస్థించెను. రాష్ట్రమందలి యల్పసంఖ్యాకులుమా

1 శ్రీవారి తండ్రిగారి కాలముననే యదివరలోనుండు పారసీమార్చి యుర్దూ రాజభాషగా చేయబడెను. ఉర్దూ యదివరకు మునల్మానుల వాడుకభాషగా నుండెను.

—'*My Life*' P. 220.

త్రమే యుర్దూ స్వభాషగా గల్గియుండిరి. అత్యధిక సంఖ్యాకుల స్వభాష ఉర్దూ కాకపోవుటచే నది బోధన భాషగా నుండుటకు ప్రాతికూల్యమును కొందరు తెల్పిరి.

"రాష్ట్రములో "ఉర్దూ" భాష నందరు మాట్లాడకపోవుటయేగాక దానిని మాట్లాడువారికంటె నధిక సంఖ్యాకులు మాటలాడు నితర భాషలు కలవనియు, "ఉర్దూ"లో నన్ని తరగతులకును వలయు పఠనీయ గ్రంథములు లేవనియు కొంద రనుచున్నారు."

పై రెండు కారణములను చూపువారికి శ్రీహైదరీగారీ క్రింది విధముగ సమాధానమును చెప్పి వారిని నిరుత్తరుల గావించిరి.

"ఉర్దూ యల్పసంఖ్యాకుల మాతృభాషయైనను నది రాజభాష యగుటచేతను, సామాన్యముగా విద్యార్థు లేతరగతి ప్రజలలో నుండి వత్తురో వారికి సామాన్యభాష యగుటచేతను, దానిని బోధనభాషగా నుంచుట వెట్టి లోపమునుకాదు.

గ్రంథరచన కొక సంఘమును స్థాపించిన వలయు పుస్తకములన్నియు వెలువడును."

పై విధముగా సమాధానముల నిచ్చినను, తత్కారణములనే యుగ్గడించువా రిప్పటికిని లేకపోలేదు. వారి వాదములోకూడ కొంత నిజమున్నది. ఎప్పుడీ విధముగా శ్రీ హైదరీగారు సమాధానముల నిచ్చిరో యప్పటికి ప్రతిపక్షులు మరల నోరెత్తలేకపోయిరి. ఎప్పుడు విమర్శనము లేక సౌముఖ్యము కల్గెనో పని చేయుటకు పూనిక కల్గెను. హిందూదేశమున నేసంస్థానమునందును జరుగనట్టియు, నిప్పటికిని బ్రిటిషిండియాలో పూర్ణముగా జరగనట్టియు పరివర్తనము, శ్రీ హైదరీగారి ప్రేరణముచేతను, శ్రీ ప్రభువువారి దూరదర్శిత్వముచేతను నీ రాష్ట్రమున సాధ్యమయ్యెను.

### iii విద్యాలయ స్థాపనము :—

శ్రీ హైదరీగారి వినతి పత్రములోని సిద్ధాంతముల నంగీకరించుచు శ్రీవారు ఉస్మానియా విశ్వవిద్యాలయ స్థాపనమునకు తమ యంగీకారమును సెలవిచ్చుచు తమ సమ్మతిని తెలుపు ఫర్మానాను ప్రసాదించిరి. శ్రీవారి మాటలచే వారికి విద్యావిషయముల నెంత యభినివేశముకలదో కనుగొనగలము:-

"పూర్వాధునిక విద్యా విజ్ఞానములయొక్క సరస మగు సమ్మేళనముచే, ప్రస్తుత విద్యావిధానమునందలి లోపములను సవరించి, పూర్వాధునిక విద్యావిధాన ములయందలి శారీరక మానసిక తత్వములలోని యుత్త మాంశము లన్నిటియొక్క ప్రయోజనమును పొందుచు, నొక విశ్వవిద్యాలయమును స్థాపింపవలయునని నావద్దకు పంపిన వినతి పత్రమునందలి యభిప్రాయములను హృదయపూర్వకముగా సమ్మతింపగల్గుటకు నా కానందము కల్గుచున్నది. విజ్ఞానమును వెదజల్లు ముఖ్యోద్దేశ ముండుటయేగాక, యీ విశ్వవిద్యాలయము, విద్యార్థుల నైతికాభివృద్ధికి తోడై శాస్త్ర విషయముల నన్నిటియందును పరిశోధనములను పురికొల్పవలయును. విశ్వవిద్యాలయ కార్యములందు "ఉర్దూ"యే సమస్త విషయములను బోధించు భాషగా నుండవలెనను మూల సూత్రమును పాటించుచు, నింగ్లీషుకూడ విద్యార్థులందరును తప్పక చదువవలసిన నిర్బంధభాషగా నుండవలెను. ఈ చెప్పిన యుద్దేశములను నెరవేర్చుచు, నా రాజ్య ప్రారంభ జ్ఞాపకార్థమై "ఉస్మానియా విశ్వవిద్యాలయము"ను పేరుతో, వినతిపత్రములో తెల్పిన పద్ధతుల

ప్రకారమొక విశ్వవిద్యాలయమును స్థాపింపవలెనని సంతోషపూర్వకముగా నాజ్ఞాపించుచున్నాను."

సువర్ణాక్షరములు! ఈ విద్యాలయ స్థాపనము రాష్ట్రముయొక్క యనేక సమస్యలను పరిష్కరించ సమర్థమయ్యెను! శ్రీవారికి విద్యావ్యాప్తియందును "ఉర్దూ ఇంగ్లీషు" భాషలయందును, నెంత యభిమానము కలదో యీ వాక్యముల వలన స్పష్టమగుచున్నది.

వెనుక ననువదించిన యాజ్ఞానుసారముగా విశ్వవిద్యాలయము ప్రారంభింపబడినది. కాలేజీ తరగతుల నెలకొల్పుటకు పూర్వము పుస్తకము లావశ్యకములని తలపబడెను. వానిని తయారు చేయుటకై యొక భాషాంతరీకరణ సంఘమేర్పాటు చేయబడెను. ఇంగ్లీషు భాషయందలి యన్నివిషయములందలి యుత్తమ గ్రంథములును, కళాశాలావిద్య కనువగు గ్రంథములును, భాషాంతరీకరించుటయేగాక, తద్రచనమునకు వలసిన సాంకేతిక పదములను సృష్టించుటగూడ నీ శాఖ యొక్క పనియయ్యెను. అందుకొక యుపసంఘము స్థాపింపబడెను. ఈ యుపసంఘముయొక్క సహాయమున భాషాంతరీకరణ సంఘమునందలి సభ్యులు వారివారి

యభిమాన విషయములయందు పుస్తకములను వ్రాయ నియమింపబడి, యీ శాఖకు "ఉర్దూ"భాషా పండితు లలో నగ్రగణ్యులని పేర్వడసి తద్వారా దేశభాషా సేవలయందు ప్రసిద్ధిగాంచిన మౌల్వీ అబ్దుల్ హఖ్ సాహెబుగారి నధ్యక్షులుగా నిర్ణయించిరి. వీరి యాజ మాన్యమున కళాశాలా ప్రథమతరగతి స్థాపనమునకు వలయు ముఖ్య గ్రంథములు మొదట తయారయ్యెను. తరువాత ప్రథమ తరగతి 28-8-1918 తేదీన ప్రారంభ మయ్యెను. ఏ శుభదినమున నది ప్రారంభింపబడినదో గాని యా దినమునుండి తత్కార్యములే కోత్తరాభివృద్ధిగా జరుగుచున్నవి. ఇప్పుడిది ప్రపంచమునందలి మహోన్నత విశ్వవిద్యాలయములలో నొకటి యైనది. ఇంజ నీరింగు, బోధన, న్యాయవైద్యశాఖలకు సంబంధించిన కళాశాలలు, కలవు. స్త్రీలకొరకు ప్రత్యేక కళాశాల పని చేయుచున్నది. వీనికన్నిటికిని నూతనముగా "అడిక్మెట్టు" అను స్థలమున భవనముల నిర్మించు చున్నారు. వసతి విశ్వవిద్యాలయమగుటచే విద్యార్థు లకు వసతి గృహములను నిర్మింపవలసి వచ్చెను. వాని పద్ధతిని చూచి యాక్సుఫర్డు కేంబ్రిడ్జి మొదలగు నే విశ్వవిద్యాలయమునందు కూడ విద్యార్థులకిట్టి వసతులు

లేవని తెలిసినవారు చెప్పుచున్నారు. భవనముల న్నియు కలిసి యీప్రాంతమొక నూతన నగరమై విరాజిల్లగలదు. ఈపట్టణము చూడవచ్చిన వారికందరికి నిది ముఖ్యదృశ్యములలో నొకటి యైనది. పరదేశములనుండి వచ్చు ద్రష్టలు భవనములను చూచి యాశ్చర్యమగ్నులగుచున్నారు. సర్వమానవులకును విద్య ముఖ్యధనము. తద్విద్యాదేవి వసతిగృహము తగినట్లుండవలదా? ఈ భవన నిర్మాణమునందు పయోగింపబడిన కళాకౌశలము కొనియాడదగినది. హిందూ ముసల్మాను నాగరకతలకు రెంటికిని ప్రతిబింబమై వరలియున్నది. ఏ తన్నిర్మాణమునకై భవననిర్మాణ కుశలులను ద్రవ్యవ్యయమునకు సరకుసేయక దూరదేశములనుండి రావించిరి. ఏ వస్తువెచ్చట లభించునో యచ్చటనుండి దానిని తెప్పించినారు. సంపూర్ణముగా సన్నిభవనములును పూర్తి యగునప్పటికి విశ్వవిద్యాలయము భవన విషయమున ప్రపంచాభరణమగును.[1]

1. సర్వకళాశాలాభవనము పూర్తియై శ్రీవారు ప్రారంభోత్సవము సల్పినారు. నానాదేశాగతులు దానినిచూచి యానందము నొందనివారును, మెచ్చనివారును లేరు. ప్రకృతిశాస్త్ర యింజనీరింగు కళాశాలానిర్మాణము జరుగుచున్నది.

బోధన మన్నివిషయములను "ఉర్దూ"లో జరుగుచున్నది. దేశభాష లున్నతవిద్యా బోధనమునకు తగవను నపఖ్యాతి యీ విశ్వవిద్యాలయము పోగొట్టినది. అసంతృప్తి కొంత యున్నదన్న నేవిషయమున లేదు ? ఈవిశ్వవిద్యాలయ పరీక్ష లాక్సుఫర్డు కేంబ్రిడ్జి మొదలగు ననాదిసిద్ధములైన విశ్వవిద్యాలయములచే నంగీకరింపబడుచున్నది. ఈ విశ్వవిద్యాలయ విద్యార్థులు ప్రపంచమునందలి మహోన్నత విద్యాసంస్థలయందు మన్ననల వడసియున్నారు; గౌరవ పదమును బొందియున్నారు; రాష్ట్రమునకు కీర్తిని తెచ్చియున్నారు. ఇదివరలోనున్న నిజామియా నక్షత్రపరిశోధనాలయము కూడ దీనికి శాఖగా చేయబడినది. [1]అదియు తల్లి సంస్థవలెనే యంతర్జాతీయ పరిశోధనములలో పాల్గొనుచు రాష్ట్రమునకు కీర్తిని గడించుచున్నది. ఉస్మానియా

1. ఇటీవల నీ విశ్వవిద్యాలయోపాధ్యాయులలో నొకరగు ప్రొ॥ రజయుద్దీన్ సిద్ధీకీగారికి నోబిల్ బహుమానము వచ్చినట్లును నది యుద్ధముతరువాత నొసగబడుననియు వినియున్నాము. ఈ విశ్వవిద్యాలయోపాధ్యాయులు ప్రాచ్యవిజ్ఞానసభలకన్నిటికిని వెడలి తమసంస్థకు కీర్తిని తెచ్చుచున్నారు. మరియు కొందరు విదేశ విద్యాలయములచే నాహ్వానింపబడి యచ్చట తమ పరిశోధనలను ప్రకటించి కీర్తిని గడించుచున్నారు.

విశ్వవిద్యాలయస్థాపనముచే నిజాం కళాశాలయందలి ముస్లిము విద్యార్థులసంఖ్య తగ్గునని తలచిరి గాని యట్లు తటస్థించలేదు. ఇప్పుడీ రెండు విద్యాసంస్థలును తమ పార్థక్యమును కాపాడుకొనుచు, హంసాయిదారులై వర్తించుచు, రాష్ట్రాభ్యున్నతికి తోడ్పడుచున్నవి. ఈ రాష్ట్రమునందలి యనేకులగు ధనవంతులు తమపిల్లలను విద్యకొరకై విదేశముల కంపునలవాటు గలదు. అట్టి వారింగ్లీషు బోధనభాషగానుండు విద్యాలయమొకటి యుండవలెనని ప్రభుత్వమువారికి విన్నవించినందున, నిజాంకాళాశాలకూడ రాష్ట్రావసరములను తీర్చుచున్న దనియే చెప్పవలసి యున్నది. కాని మొత్తముమీద నీపద్ధతి యూస్మానియా మూలసూత్రములకు విరుద్ధ మను నభిప్రాయము ప్రబలుచున్నట్లు తోచును. ఏదియెట్లున్నను విద్యావిషయమున రాష్ట్రప్రభుత్వము సంతృప్తికరమగు మార్గముననే నడచుచున్నదని చెప్ప నగును.

ఉస్మానియా విశ్వవిద్యాలయము నిజాంరాష్ట్ర ధ్వజమై, రాష్ట్రాభ్యుదయమునకు సహకారియై, బహిః ప్రపంచమున కాశ్చర్యస్థానమై, స్థాపకుల ప్రతిభాప్రక

టన సాధనమై, యూస్మానలీపాషా హైదరీ సమావేశ మహాఫలమై, విరాజిల్లుచున్నది. ఈవిశ్వవిద్యాలయ మాచంద్రతారార్కమై వర్ధిల్లుగాక! దానితోగూడ పాషా హైదరీగార్ల నామములు చిరస్థాయిలగుగాక!

# ౩. మొదటి ప్రపంచయుద్ధము

పరమేశ్వరుని కృత్యము లనిర్వాచ్యములు. వాని పుట్టుకను తుచ్ఛ మానవు డెరుగడు! ఎరుగుటకు సాధనములును గానరావు! భూభారహరణము కావలసివచ్చినపుడా మహామహుడేదోయొక కారణమును కల్పించును. భూభారహరణమన్న "Survival of the fittest" అనుసూత్రమే! ప్రపంచమున నెవరు జీవింప నర్హులో వారినిమాత్రము జీవింపజేసి పరమేశ్వరుడు తన కార్యమును నిర్వహించుకొనును. ప్రకృతి యీయన సాధనము. ప్రకృతికి నిమ్నోన్నతములను సమముచేయు శక్తికలదు. కార్యకారణభారము తత్సూచన. మన రాష్ట్రమింత యుచ్ఛస్థితికివచ్చి యింకను పుష్కలముగా ధనమితరకార్యములకు కావలసి వచ్చిన కాలమున యూరపు ఖండమున యుద్ధకారణములు రగుల్కొని ప్రపంచ సంగ్రామముగా పరిణమించెను. అసాధారణ పరిస్థితులు తటస్థించెను. "శరీర మాద్యం ఖలు ధర్మసాధన" మన్నట్లు . సామ్రాజ్య రక్షణమే ముఖ్య కర్తవ్యమయ్యెను!

### 3. మొదటి ప్రపంచయుద్ధము

1914 సంవత్సరమున యుద్ధమారంభమయ్యెను. ఎంతయుద్ధమని యడుగవచ్చును. దేనివలన గల్గిన పరిణామములనుండి ప్రపంచము నిన్న మొన్నటివరకును కోలుకొనలేదో యంత ప్రచండమైనదని చెప్పనగును. ఇప్పటికిని ధూమములు చల్లారక పోవుటయేగాక క్రమముగా మరల రగుల్కొని మండుచున్నది. ఇంగ్లాండున కనగా బ్రిటిషుసామ్రాజ్యమునకు బాసటగా హైందవభూమి నిలువవలసివచ్చెను. హైందవభూమియదృష్టము సామ్రాజ్యముయొక్క యదృష్టముతో బద్ధమై యుండెను. ఒడంబడికల ప్రకారము హిందూదేశమునందలి వివిధ సంస్థానములుకూడ తమయావచ్ఛక్తిని సామ్రాజ్య రక్షణమునకై వినియోగింపవలసి వచ్చెను. అందును నిజాం ప్రభువరేణ్యునకు "ఇంగ్లాండు ప్రియమిత్రుడ"ను బిరుదముండెను! అందుచే మిత్రునకు సంతోషపూర్వకముగా సాయపడెను! అట్లు సాయపడుటలో కూడ హిందూదేశమునందలి సంస్థానములలో తనకున్న ప్రథమ స్థానమునకు తగినట్లే ధన విషయమునను, సేనావిషయమునను, సామగ్రి విషయమునను, ప్రవర్తించెను. అంకెల నొకమారు పరిశీలించిన నెట్లు సహాయముచేసినది తెలియగలదు. అవి మన కాశ్చర్య

మును గొల్పును. కొలది సంవత్సరముల క్రిందటనే యార్థిక పరిస్థితులు బాగుగా లేని రాష్ట్రమింత స్వల్ప కాలముననే చాల ద్రవ్యము నొకవంక రాష్ట్రాభివృద్ధికి వెచ్చించుచు, నింత వస్తుసామగ్రిని, ధనమును, నింగ్లాండు సహాయమునకు పంపగల్గినదన్న కార్య నిర్వహణము చేయు ప్రముఖుల దూరదర్శిత్వము నార్థికజ్ఞానమును కొనియాడవలసియున్నది. 1857 వ సంవత్సరమునకు పూర్వమే నిజాం ప్రభుత్వమునకును బ్రిటిషువారికిని ప్రారంభించిన మైత్రి సజ్జనమైత్రి కావున "దినపరభాగ జనితమైన ఛాయ" పోలిక నానాటికిని పెరిగి యనుబంధము హెచ్చుచు వచ్చెను. 1857 సంవత్సరపు సిపాయి తిరుగుబాటున నిజాంప్రభు వింగ్లీషువారికి సాయము చేయకపోయిన హిందూదేశచరిత్ర మిప్పటివలెనుండక మరియొకవిధముగ నుండెడిదియని మున్నే విన్నవించితిని. అటుతరువాత 1887 సంవత్సరమునగూడ యాఫ్ఘనిస్థానపు సరిహద్దున జరిగిన యుద్ధకలకలమున, మ॥ ఘ॥వ॥ శ్రీ ప్రభువుగారి తండ్రిగా రిచ్చటినుండి సైన్యము నంపుటయేగాక, 60 లక్షల రూప్యముల ద్రవ్యసహాయము చేసిరి. మరల నామైత్రిని ప్రకటించు నవకాశము మన ప్రభువుగారికిప్పుడు కలిగినది. సహజ మైత్రీ

భావముతో బ్రిటిషువారికి సహాయముచేయ నిశ్చయించి యట్టి తమ గాఢమైన పూనికను బ్రిటిషు గవర్నమెంటువారికి తెలియపరచగా వారు మిక్కిలి కృతజ్ఞతను చూపిరి. వీరు యుద్ధమునకుచేసిన సహాయమును మూడు విధములుగా విభజించి చెప్పనగును.

(1) సైన్యము (2) ధనము (3) సామగ్రి. వీనిలో నొక్కొక్కదానిని గూర్చి కొంచెముగ ముచ్చటింతును.

(1) సైన్యము:—

హైదరాబాదు, మైసూరు, పాటియాలా, జోధ్పూరు, సంస్థానమునందలి సామ్రాజ్య సేవాదళముల (Imperial Service Troops) నన్నిటిని కలిపి సర్ ఆర్థరు వాట్సన్ అను సేనాని నాయకత్వము క్రింద నీజిప్టు వగైరా స్థలముల యుద్ధము చేయునట్లు బ్రిటిషధికారులు నిర్ణయించిరి. ఆనిర్ణయప్రకారము హైదాబ్రాదునందలి యాదళముయొక్క రెండు రెజిమెంట్లు బయలు దేరెను. ఈరెండు రెజిమెంట్లును నప్పటినుండి యుద్ధపరిసమాప్తివరకును నాప్రాంతముననే సేవచేయుచుండెను. వీనికగు వ్యయమంతయు నిజాంప్రభుత్వమువారే భరించుచుండిరి.

ఈ దళము లేగాక యెప్పుడవసరము కల్గునోయని 20 వ దక్కను ఆశ్వికదళమును నూతనాయుధపరికర ములతో తయారుగానుంచిరి. దీనికికూడ మిక్కుటముగ ధనవ్యయమయ్యెను. ఎప్పుడు పిలుపువచ్చునో యని యెప్పటికప్పుడు యుద్ధసంసిద్ధులై యుండవలసివచ్చెను. మరియు నాశ్వికశిక్ష యందు మొదటినుంచి పేరుగాంచిన శిక్షకులు రాష్ట్రమునందలి యాశ్వికదళ కేంద్రము లన్నిటియందును గుఱ్ఱములకు శిక్షనొసంగున ట్లేర్పాటు చేయబడెను. [1] (Cavalry centres). పైన వివరించిన పనులేగాక సైనికదళములయందు నూతనముగ మనుష్యులను చేర్చుటకై యొకశాఖయేర్పడి రాష్ట్రము నందంతటను ప్రచారమొనర్చెను. పైన చెప్పిన పనుల కన్నిటికిని నగువ్యయమును నిజాంప్రభుత్వమువారే భరించిరి. వీని కన్నిటికిని లెక్కలను తేల్చగా నయిన వ్యయము దాదాపు 28,76,664 రూప్యములు. ఇంగ్లీషు సిక్కాలో చెప్పిన నీద్రవ్యము 19,777 పౌనులగును.

1 వీనినాశ్విక కేంద్రములని పిలిచిరి.

ఈ సందర్భమున నింతధనము వెచ్చించినందులకు మనసేన యుద్ధమున నెట్లు ప్రవర్తించె నను ప్రశ్నము రావచ్చును! కావున దానిని చెప్పుట యప్రస్తుతము కాదు. యుద్ధానంతరము హైద్రాబాదుసేన మరలి వచ్చుటకు ప్రయత్నములు జరుగుచున్నప్పుడు సమీప ప్రాచ్యదేశ సేనానాయకుడగు జనరల్ హార్బొర్డుగారీ క్రిందివిధముగా వారికి వీడ్కోలు ప్రసంగమును గావించియున్నారు.

"మిమ్ముల సంపరనోక దళముగా నేనుచూచుట కిది తుదిసారి. కావున సమయమువచ్చినపుడెల్ల నాకు మీరొసంగిన హృదయపూర్వక సహకారమునకు మీరు వెడలిపోవులోపల మీకందరకును నామనః పూర్వకమైన కృతజ్ఞతను వెల్లడిచేయుచున్నాను. రణ రంగమున మీరు మీప్రజ్ఞను చూపునపుడు మీ రెల్లప్పుడును మీనిర్భీకత్వమును, కార్యనిపుణత్వమును, వెల్లడిచేసి, మీరుచేసినసేవను సామ్రాజ్యముయొక్క సమస్తభాగములందును కీర్తనీయము గావించి, దానిని వ్యాపింపజేసియున్నారు. మీకీర్తి మీకు గర్వకారణమైయున్నది. మీ గౌరవమెల్లపుడును తప్పక మీ

హస్తగతమైయున్నదని నిర్భయముగా చెప్పవచ్చును. మరియు మీయాజ్ఞాపాలనాపటిమను, మీ ప్రవర్తనా సౌష్టవమును, నెల్లప్పుడును మీరు చూపగలరని నమ్మకముగా చెప్పవచ్చును. మీరు మీ స్వగృహములకును, కుటుంబములకును, నచిరకాలముననే వెడలనున్నారు. మీ ఐశ్వర్యమును, భావిజీవితములయందు సంపూర్ణ సౌఖ్యమును, మీ ధైర్యముచే గడించిన బహుమానములను, ననుభవించుటకు చిరాయువును కలిగియుండవలెనని నేను హృదయపూర్వకముగా కోరుచున్నాను. మీదళముతో సంబంధము కలిగినందులకు నేను మిక్కిలి గర్వపడుచున్నాను."

శ్రీ|| శ్రీ|| చక్రవర్తిగారు, మ|| ఘ|| వ|| నిజాం ప్రభువువారికీ క్రింది ప్రశంసా వాక్యములను దయచేసియున్నారు. "హైదాబాదుసేన సకాలమునచేసిన మహాసేవకు నేను మిమ్మును స్వయముగా నభినందించుచున్నాను." ఇంతకంటె గర్వకారణమేమి కావలయును?

(౨) ధనము:—

నిజాంప్రభుత్వమువారు బ్రిటిషు ప్రభుత్వము వారికి ధనరూపముగా దాదాపు రెండుకోట్ల రూపాయ

ముల నుచితముగా సాయముగావించిరి. మరియు ననేక యుద్ధ ఋణములలో మొత్తమున నిజాం గవర్నమెంటు వారు 164 లక్షల విలువగల పత్రములను కొనిరి. ఇదిగాక యీ సమయమున బ్రిటిషిండియాలో కల్గిన యార్థికమైన యలజడిని వారించి సర్దుకొనుటకు 5 లక్షల పౌనుల వెలగల వెండి నిండియా గవర్నమెంటువారి కప్పిచ్చి కష్టకాలమున సాయపడిరి. తాము పంపిన సేనకగు వ్యయమును, నితరమైన చిల్లర వ్యయములను, తామే భరించిరి. ఎంతధనము !

(3) సామగ్రి:—

పై రెండువిధముల నేగాక నిజాం ప్రభుత్వకర్మాగారములలో యుద్ధసామగ్రిని తయారుచేయించి పంపిరి. మందుపెట్టెలను, గుండ్లను, యినుపబండ్లు మొదలైన వానిని, తయారుచేయించిన సామగ్రిని మదింపువేయగా దాదాపు 12½ లక్షల రూప్యములగును. ఇదిగాక 22,000 రూపాయల విలువగల గడ్డిని సప్లై చేసిరి.

నిజాంరాష్ట్రముయొక్క యార్థికాభ్యున్నతి క్షేమాత్రమును లోటురాకుండ, నిక్కడ జరుగుచున్న రాష్ట్రాభివృద్ధికరములగు కార్యములను కొనసాగించుచు,

కట్టుటకు ప్రారంభించిన కట్టడములనాపక, యిచ్చటి యవసరముల నన్నిటిని గడుపుకొనుచు, నింతసహాయ మును బ్రిటిషుగవర్నమెంటువారికి చేయగల్గుట మిక్కిలి సంతోషకరమనియు, నిక్కడి కార్యనిర్వాహకుల శక్తి సామర్థ్యములను వేనోళ్ళ చాటుచున్నదనియు చెప్పుట కెంతమాత్రము నభ్యంతరము లేదు. బ్రిటిషిండియా యంతయు మొత్తమున చేయలేనంతపని నొక్క నిజాం ప్రభుత్వముచేయగల్గెననుట యతిశయోక్తి కాదు.

పరమేశ్వరుని కృపచే మహాసంగ్రామము 1918 సంవత్సరము నవంబరు 11 తేదీని సమాప్తమయ్యెను. ఆదినము పవిత్ర దినమై యుద్ధమునందు పాల్గొన్న యన్ని దేశములందును తగురీతిని నడపబడుచున్నది. నిజ ముగానది పవిత్రదినమే ! ఎంతనాశన మా దినమున నాగెనో చెప్పుటకు వలను పడదు ! యుద్ధాంతము దాదాపు ప్రపంచమున కంతకును విశ్రాంతి నొసంగెను! యుద్ధమున మరణించినవారి యెడల కృతజ్ఞత యిప్పటి కిని సామ్రాజ్యమునందంతటను వెల్లడిచేయ బడుచున్నది. ఈదినమున మధ్యాహ్నమున 12 గంటలకొక రెండు నిమిషముల కాలము బ్రిటిషు సామ్రాజ్యము నందంత

టను మానము వహింపబడుచున్నది. ప్రతి పాఠశాలా విద్యార్థికిని నీసంగతి తెలియును.

నిజాంప్రభుత్వమువారు బ్రిటిషు ప్రభుత్వమునకు చేసిన యుపకృతికి ప్రతికృతిగా యుద్ధానంతరము బ్రిటిషు ప్రభుత్వమువారు, మ॥ ఘ॥ వ॥ నిజాంప్రభువుగారికి కొన్ని బిరుదములనిచ్చి గౌరవించిరి. ఇది తమను తాము గౌరవించుకొనుటగా భావింపవలయును. ఈ సందర్భమున, మ॥ఘ॥వ॥ ప్రభువువారికిని జార్జి సార్వభౌమునకును జరిగిన కొన్ని యుత్తర ప్రత్యుత్తరముల ననువదించుట యప్రస్తుతముకాదు.

[1]"యుద్ధసమయమున సామ్రాజ్యమునకు మీరు చేసిన సహాయమునకు తమకు ప్రత్యేక గౌరవముగా

1. దక్కను హైదరాబాదు సెప్టెంబరు 7-1939. "జర్మనీతో యుద్ధానికి దిగకుండా వుండడానికి బ్రిటిషుప్రభుత్వంవారు చాలప్రయత్నాలు చేశారు కాని వారు యుద్ధంలోదిగకుండా తప్పిందికాదు. ప్రపంచమందంతటా శాంతిని రక్షణను రూపుమాపటానికి హిట్లరు సిద్ధపడ్డారు. కాబట్టి ప్రపంచములో శాంతిభద్రాలను కాపాడడానికి హిట్లరిజమును రూపుమాపక తప్పదు. అందువల్లనే బ్రిటను ఫ్రాన్సుదేశాల వారు యుద్ధాన్ని ప్రకటించారు. అని రాజప్రతినిధి యీ నెల 3 వ తేదీని నాకు తెలియజేశారు. ఇదివరకు నా వంశంవారున్ను 1914 జరిగిన యుద్ధంలో

"మహోఘనతవహించిన" యను బిరుదమును, నాకును నాపూర్వులకును, మీరును మీపూర్వులును చూపుచున్న మైత్రిని గమనించి "ఆప్తమిత్రము" (Faithful Ally) అను గౌరవ బిరుదమును మీకొసంగి నాసంతసమును వెలిబుచ్చు నవకాశము తటస్థించినందులకు మిక్కిలి యానందము నొందుచున్నాను. మొట్టమొదటి యొడంబడికలను సంతకము చేసినప్పుడును, తరువాత సిపాయి తిరుగబాటు సమయముననూ, తమ పూర్వులెట్లు ప్రవర్తించిరో యట్టి ప్రవర్తనమునే యనుసరించుచు, తాముకూడ నట్టి చారిత్రక ప్రసిద్ధమగు బిరుదమును వహించుటకు సంపూర్ణార్హత కలదని

నేనున్నూ బ్రిటను రాజుగారికి యేలాగు సహాయం చేశామో అలాగే యిప్పుడు మళ్లీ బ్రిటను మిత్రమండలికి సహాయం చెయ్యడానికి నేను సిద్ధంగా వున్నాను. 'నైజాం దొరతనమువారికి నమ్మకమైన మిత్రుడనే పేరు సార్థకం కావాలి' అని నేను రాజ ప్రతినిధికి తెలియచేశాను. కాబట్టి భారతదేశీయులందరున్నూ, ముఖ్యంగా ముస్లిం లందరున్నూ సర్వవిధాలా యీ యుద్ధంలో బ్రిటిషువారికి సహాయంచెయ్యగోరుతాను. మిత్రమండలికి సంపూర్ణ విజయం కలిగితేగాని హిట్లరువర్గంవారి నిరంకుశత్వం పూర్తిగా రూపుమాయదు. అది రూపుమాస్తేగాని ప్రపంచంలో శాంతిభద్రాలు స్థిరంగా యేర్పడవు. భగవదనుగ్రహంవల్ల ధర్మంకోసం యుద్ధానికి దిగిన బ్రిటిషు మిత్రమండలివారికి అఖండవిజయం కలుగుగాక. ధర్మచింతగలవారికే భగవంతుడు సహాయం చేస్తాడనేది నిశ్చయం." (ప్రస్తుత ప్రపంచయుద్ధారంభమున శ్రీ ప్రభువు వారి ఫర్మానా. అం. ప.)

తమ ప్రవర్తనముచే వ్యక్తీకరించియున్నారు. హిందూ దేశమునందలి యుత్తమ ముస్లింసంస్థానాధిపతిగా తమ కున్న యున్నత స్థితి ననుసరించి తమ ప్రజలకును, తమ స్వమతస్థులకును, నాసింహాసనమునకును, సామ్రాజ్య మునకును, తమ సంపూర్ణ భక్తిని చూపుట యవసర మని తమరొక యుదాత్తమైన ప్రకటన గావించి, యుద్ధారంభ మైన వెంటనే తమ సామ్రాజ్య భక్తిని వెల్లడి చేసియున్నారు. కావలసినపు డెల్ల యుద్ధావసరములకు తమ రొనర్చిన విరివి యైన ద్రవ్యసహాయ మింగ్లాండు యొక్కయు, హైదా్రి బాదు రాష్ట్రముయొక్కయు, దర్జాకు తగియుండి, యీ రెండు సంస్థలయొక్క భావ్యభివృద్ధి యన్యోన్య మైత్రీ బంధముపై నాధారపడియున్నదని స్ఫుటముగా వ్యక్తీకరించుచున్నది."

జార్జి చక్రవర్తిగారు పైవిధమున వ్రాసిన యుత్తరమునకు శ్రీ నిజాంప్రభువారి క్రింది ప్రత్యు త్తరము నొసంగిరి.

" 'మహా ఘనతవహించిన' యను బిరుదము నిచ్చియు, 'ఆప్తమిత్రము' అను బిరుదమును గట్టిపర

చియు, వైస్రాయిగారిద్వారా తమరు దయతో నంపిన 24_1_18 తేదిగల లేఖకు, నా విశ్వాసపూరితము లైనట్టియు, హృదయపూర్వకములైనట్టియు, వందనము లను సమర్పించుచున్నాను. ఈ యుద్ధమున తమ సామ్రాజ్యమునకు నేనుచేసిన సేవ కొంచెమైనను, చక్రవర్తులరగు తమ మన్ననకు పాత్రమగుట నాకు మిక్కిలి సంతోషదాయకము. నేను నా పూర్వుల త్రోవనే యనుసరించుచున్నాను. కీ॥ శే॥ మా తండ్రి గారికి బ్రిటిషు గవర్నమెంటువారిచే నా ప్తమిత్రమని పిలుబబడుటకంటె వేరు గర్వకారణము లేకుండెను. ఆ బిరుదమును నా కొసంగి యా మాటను స్థిరపరచి నందులకు నేను సర్వదా కృతజ్ఞుడను. ప్రపంచము యొక్క స్వాతంత్ర్య నాగరకతలను రక్షించుటకు చేసిన యీయుద్ధమున బ్రిటిషు సామ్రాజ్యము పాల్గొని, ప్రపంచ మునకు చేసిన సేవయెడల మాకున్న గౌరవ మీా బిరు దముయొక్క విలువను హెచ్చించుచున్నది."

ఈ యుత్తర ప్రత్యుత్తరములలో వెలువరచిన భావముల మూలమున నీ రెండురాజ్యములకు నుండు స్నేహభావముయొక్క పునాదులు మరింత గట్టిబడి,

యవి శాశ్వతమయ్యెను. ఈ సందర్భమున శ్రీ వారు చేసిన యొక కార్యముయొక్క ఘనతయు, పరిణామమును మిక్కిలి కొనియాడదగియున్నది. టర్కీ దేశము ముస్లిములతో నిండియుండియు, నిస్లాం మతమును కల్గియు, జర్మనీ పక్షమున యుద్ధము చేయుచుండెను. మరియు టర్కీ సుల్తానుగారు ముస్లిముల కందరకును మత గురువై ఖాలీఫాయైయుండెను. ఈ విషయము బ్రిటిషు వారికి భయకారణమయ్యెను. బ్రిటిషువారి కిదివరలో మిత్రులైనట్టియు, నధికారమున నున్నట్టియు, ముసల్మానులు మతాభిమానమును పురస్కరించుకొని టర్కీ పక్షమున చేరి సాయ మొనర్తురేమో యను భయము బ్రిటిషధికారులను బాధించెను. ఈ భయము నానాట హెచ్చసాగెను. ఈసందర్భమున టర్కీ దేశమునకు వెలుపలనుండు ముసల్మానులను టర్కీ పక్షమున చేరకుండ ప్రచారము చేయుట యవసరమయ్యెను. అట్టి ప్రచారము పలుకుబడిగల వారిచే చేయించి సత్యమును తెల్లము చేయవలసియుండెను. అట్టి సమయమున, మ॥ఘ॥వ॥ మన ప్రభువుగారును, ఘ॥వ॥ ఆగాఖానుగారును, బ్రిటిషువారి దృష్టి నాకర్షించిరి. ధనవంతులై, యొక గొప్ప విస్తీర్ణమైన రాష్ట్రము

నకు పాలకులై, ముసల్మానులలో పలుకుబడి వడసి యున్నవారు నిజాం ప్రభువుగారు. ముసల్మానులలో నొక తెగయగు ఖోజాలకు మతగురువులై, ప్రపంచమునం దంతటను పలుకుబడి గలవా రాగాఖానుగారు. ఈ యిద్దరు వ్యక్తులును గట్టిగా నొక్కి చెప్పిన బ్రిటిషువారికి వలసిన వాక్సహాయమగునని వారు నమ్మకముతో నిద్ద రిని వేడుకొనిరి. అట్టి సమయమున వీరిద్దరును బ్రిటిషు సామ్రాజ్యమునకు చేసిన సేవ చెప్పనలవికానిది! అను కొనినట్లు వీరిద్దరిమాట ముసల్మానుల నమ్మకమును చూరగొనెను. వీరిద్దరును నొక ప్రకటన గావించిరి. అందు బ్రిటిషు సామ్రాజ్యము మానవస్వాతంత్ర్య రక్షణమునకై పోరాడుచున్నదనియు, నట్టి సామ్రాజ్య పక్షమున ముసల్మానులు యుద్ధము చేయుట వారి విధియనియు, పొరపడిన టర్కీదేశము ననుసరింపవల దనియు, స్వాతంత్ర్యము పరమావధిగాగల యిస్లాం మతానుయాయులు బ్రిటిషు సామ్రాజ్య పక్షముననే యుండవలెననియు, నొక యుదాత్తమైన ప్రకటనమును గావించిరి. ఈ ప్రకటన మనుకున్నంత గొప్పపని నొన ర్చెను. ఈ ప్రకటనమునకు కర్త శ్రీ నవాబ్ ఇమాదు ల్ముల్కు బహద్దూరుగారని వెనుక విన్నవించియుంటిని.

అట్టి పని యట్టి రాజకీయ వేత్తకు తప్ప యితరునికి సాధ్యమగునా? అప్పుడు శ్రీవారు బ్రిటిషు గవర్నమెంటుకు చేసిన మహోపకారమునకు కృతజ్ఞతా సూచకము లీ వెనుక చెప్పిన రెండు బిరుదములు! అప్పటినుండి శ్రీ ఆగాఖానుగారు బ్రిటిషు సామ్రాజ్యమునకు గట్టి స్నేహితులయ్యెను. ఈ యిద్దరికిని బ్రిటిషు గవర్నమెంటు నెడలనున్న మైత్రి వ్రేళ్లు ప్రాకుకొని పోయి దినదిన ప్రవర్ధమానమై వరలుచున్నది.[1] అప్పుడు నాటుకొన్న యీ మైత్రియే శ్రీవారి జ్యేష్ఠ పుత్రునికి, వెనుకటి టర్కీ-సుల్తాను వారి కుమార్తెనిచ్చి పరిణయ మొనర్చునట్లు చేసినది. ఆ వివాహముచే ప్రపంచమునందలి రెండుత్తమ ముసల్మాను కుటుంబములకు బంధుత్వమలవడుట కవకాశము కలిగెను. ఆ సంబంధ మా చంద్రార్కము వర్ధిల్లుగాక!

1 ఇప్పుడు జరుగుచున్న యుద్ధమున గూడ వీరిద్దరును తమ పలుకుబడిని బ్రిటిషువారికొరకే వినియోగించుచున్నారు. ఘ॥వ॥ ఆగాఖానుగారి కుమారుడు సేనలో చేరినారు.

పైన యుల్లేఖించిన ప్రకటనమును గూర్చియు, దాని ప్రాముఖ్యమును గూర్చియు, 1917 సంవత్సరమున శ్రీ ప్రభువువారి జన్మోత్సవ సందర్భమున నప్పటి రెసిడెంటుగారగు ఫ్రేజరుగారు సెలవిచ్చిన యీ క్రింది వాక్యముల నిచ్చట ననువదించిన మనకు తేటపడ గలదు.

" * * * శ్రీవారు యుద్ధవిషయమున చేసిన సహాయములలోనెల్ల ప్రశంసించదగిన దొకటికలదు. అది వారి వ్యక్తికి సంబంధించినదై యున్నది. 1914 సంవత్సర మక్టోబరు నెలలో— ఎంత దీర్ఘకాల మనిపించుచున్నది!—టర్కీ సామ్రాజ్యము దురదృష్టవశమున జర్మనీచే బలవంతముగ ప్రేరేపింపబడి మన శత్రుకోటిలోఁ చేరవలసి వచ్చినప్పుడు, మ॥ ఘ॥ వ॥ నిజాం ప్రభువువారు వెంటనే కాలహరణము చేయక, హిందూదేశము నందలి ముసల్మానులకు నాయకత్వమును వహించి, తనరాష్ట్రమునందలి ముసల్మానులనేగాక, యాసేతు హిమాచల పర్యంతము నున్నవారినందరిని తమ రాజభక్తిని మార్చవలదనియు, బ్రిటిషు సార్వభౌమునియెడ నిరంత

రము భక్తిపూరితులై యుండవలసినదనియు, హృదయ పూర్వకముగ ప్రోత్సహించిరి. హైదరాబాదు రాజ్యమును మాత్రమే యెరిగి బయటి పరిస్థితులెరుగని వారికీ ప్రబోధ మీదేశమునందలి వివిధ ప్రాంతమునందలి ముసల్మానుల నెంత కలచెనో తెలుసుకొనుటకు సాధ్యము కాదు. దానియొక్క ప్రాముఖ్యము నాకు బాగుగా తెలియును. ఈ యుద్బోధ మొక్క హిందూదేశము నందేగాక, వెలుపల ననగా నాఫ్రికాఖండమునందలి సుడాన్ మొదలగు దేశములందుండు పత్రికలలో ప్రకటింపబడి, యక్కడి ముసల్మానులకుకూడ మార్గదర్శకమై, తమ కర్తవ్యమును నిర్ణయించుకొనుటకు ముఖ్యసాధనమయ్యెను. కావున శ్రీ ప్రభువుగారు తమ కుటుంబమున కొసంగబడిన "ఆంగ్లాప్తమిత్రమ"ను గొప్ప బిరుదమునకు తగినట్లు ప్రవర్తించితిమని గర్వ పడవలసియున్నది."

యుద్ధ విరామముతో ప్రపంచమొక గొప్ప నిట్టూర్పు విడచెను. అది పవిత్రదినము! యుద్ధమున్నంత వరకు నేరాష్ట్రమును స్వవిషయమున శ్రద్ధవహించుటకు వీలులేకపోయెను. ఎక్కడి ద్రవ్యమును యుద్ధ

వ్యయములకే చాలకుండెను. శత్రుమారణము గావించి
యిక నెన్నటికిని తలయెత్తకుండ చేసినగదా [1] ప్రపం
చము నిష్కంటకమై ప్రతిరాష్ట్రమును తన్నిర్మాణము
గావించుకొనుటకు వీలగును! యుద్ధవిరామ సూచక
ములగు కట్టడములు బ్రిటిషు సామ్రాజ్యమునందలి
యన్నిస్థలములందును నిర్మింపబడినవి. మనరాష్ట్రమున
సికింద్రాబాదున పెరేడు మైదానముకడను, హైద్రా
బాదునగరమున రెసిడెన్సి వ్యాయామ మైదానమునను,
నట్టి కట్టడములు కలవు. ప్రతిసంవత్సరమును నవంబరు
11 తేదిన నిచ్చట ప్రార్థనాదికములు జరుగును.

ఒక్కమారీస్వయం ప్రభుత్వకాలమును సింహావ
లోకనముచేసిన రాష్ట్రము సర్వతోముఖముగ నభివృద్ధి
మైనట్లు తెలుసుకొనగలము. రాష్ట్రోన్నతికి వలసిన సర్వ
శాఖలును స్థాపింపబడెను. [2] రాష్ట్రమునకు గౌరవము

1. మరల యుద్ధమువచ్చుట విషాదకరము.

2. వాని నీ క్రిందివిధముగా చెప్పనగును—: పేషీ, పొలిటికల్, మ్యునిసిపల్, ఆర్థిక, టంకసాల, విద్యుచ్ఛక్తి, న్యాయ, పోలీసు, టపా, విద్యా, రిజిష్ట్రేషను, స్టాంపు, ప్రాచీనవస్తురక్షణ, రివిన్యూ, సర్వే, సెటిలుమెంటు, కరోడిగిరీ, ఆటవిక, కోర్టు ఆఫ వార్డ్సు, ఆబ్కారీ, లెక్కల, చట్టనిర్మాణ,

పెంచ్చెను. బ్రిటిషు గవర్నమెంటునకును హైద్రాబాదు నకును ననుబంధము హెచ్చెను. పట్టణము సుందర మయ్యెను. విద్యావృద్ధి యపారముగ నయ్యెను. రాష్ట్ర విషయముననేగాక శ్రీవారి కుటుంబ విషయమునగూడ నీకాలము ఫలకాలమనవచ్చును. 1906 సంవత్సరమున (అనగా 1325 హిజ్రీ) జననమొంది, రాష్ట్ర ప్రజల కల్హారు ముద్దుబిడ్డలైన ప్రభువువారి జ్యేష్ఠపుత్రులును, తరువాత జననమొందిన ద్వితీయపుత్రులును, శుక్లపక్ష చంద్రులవలె దినదిన ప్రవర్ధమానులై, శ్రీ వారికే గాక రాష్ట్రమునకంతకును సంతోషదాయులైరి. 1917 సంవత్సరమున శ్రీవారి జన్మదిన సందర్భమున జరిగిన దర్బారున రాకుమారులిద్దరు రెసిడెంటు ప్రేజరుగారిచే మిక్కిలి ప్రశంసింపబడిరి. భగవంతుడు వీరికి దీర్ఘా యువు నొసంగుగాక! ఈకాలమున శ్రీవారికి సర్వ కార్యములయందును కుడిభుజమైనట్టియు, ప్రతిభా శాలియై రాజకీయవేత్తయైనట్టియు, విద్యావిజ్ఞానవంతు

జలాధార, కట్టడముల, టెలిఫోను, సైన్య, వైద్య, ఆరోగ్య, పారిశుద్ధ్య, పశు వైద్య, ఖనిజ, లోకల్‌ఫండు, సహకార, వ్యవసాయ, కర్మాగార, మత, శాఖలు—

లైనట్టియు శ్రీ హైదరీగారి దూరదర్శిత్వమును, రాజ్యాంగ వేత్తృత్వమును, పొగడతరముగాదు! వీని కన్నింటికిని పైన శ్రీ ప్రభువువారి ప్రజాప్రీతి, సత్య నిరతి, న్యాయబుద్ధి, కార్యదీక్ష మకుటములై యభివృద్ధిని గట్టిపరచెను! కాని యెంత బలవంతుడైనను నింతబరువు సర్వకాలమును మోయగలడా? చూతము !

—

## ౧. మంత్రిసంఘ స్థాపనము

శ్రీ ప్రభువువారు తమ స్వయంపాలన వత్సరములలో చిన్ననుంచి పెద్దవరకు సమస్త వ్యవహారములు తాము స్వయముగా పరిశీలించి నీతిజ్ఞుల సలహా సహాయములతో నేలుచుండిరి. ఈపద్ధతి మిక్కిలి ఫలవంతమై రాజ్యముయొక్క యున్నత స్థితికి కారణమయ్యెను. సమస్త వ్యవహారశాఖలును సరియైన మార్గమున నడిపింపబడసాగెను. రాష్ట్రాభ్యుదయకార్యములన్నిటికిని పునాదివేయబడెను. రాష్ట్రము సర్వతోముఖముగ నభివృద్ధినొంది యితర రాష్ట్రములకు మార్గదర్శకమయ్యెను. రాష్ట్రాదాయము హెచ్చెను. ద్రవ్యవ్యయము సరియైన మార్గముల జేయబడెను.

ఇదియంతయునైనను మిక్కిలి కష్టపడి పనిచేయుటచే శ్రీవారి యారోగ్యము కొంచెముగ చెడెను. ఎంత బలవంతుడైనను మోయలేని బరువు మోయగలడా? ఒక వేళ పండ్లు బిగబట్టి మోసినను నెక్కువ కాలము మోయజాలడు! శ్రీవారు మిగుల డస్సిరి. విశ్రాంతి

కోరిరి. "శరీర మాద్యంఖలు ధర్మసాధన" మని కదా యార్యోక్తి? శ్రీవారి కెప్పుడనారోగ్యమను మాట ప్రజలు వినిరో వారప్పుడు మిక్కిలి దుఃఖించిరి. శ్రీవారప్పుడు తమ భారమును కొంత తగ్గించుకొనవలసి వచ్చెను. రాష్ట్రముయొక్క దైనందిన వ్యవహారమునకు మార్గములు స్వపరిపాలనాకాలమున వేయబడియుండుటచే, నొక కార్యనిర్వాహక సంఘమున కాపనినంతయు నప్పగించి, యవసరమైనప్పుడు తాము జోక్యము కలుగచేసుకొనుట మంచిదని వారికి తోచెను. నమ్మకమైన మంత్రివర్గము నేర్పాటుచేయ నిశ్చయించుకొనిరి.

శ్రీవారు మిక్కిలి దేశజాత్యభిమానముకలవారు. అందుచేతను, దేశీయులకు సర్వశాఖల యందును తరిబీతునిచ్చుటకును, నన్ని శాఖలలోను సమర్థులగు దేశీయుల నుద్యోగములయందు నిలిపిరి. ఇదివరలో నున్న బ్రిటిషుద్యోగులు పింఛను తీసికొనిన వెంటనే తరిబీతు పొందిన దేశీయుల నాయుద్యోగములకు నియమించుచుండిరి. ఇది బ్రిటిషుద్యోగులకు కొంచెమయిష్టముగ నుండెనని చెప్పుకొనుచుండిరి. వీరు వైస్రాయివరకు తమ యసంతృప్తిని తెలియచేసిరట! అందుచే రెండు

ప్రభుత్వములకును నుత్తర ప్రత్యుత్తరములు జరుగు చుండెనని యాకాలమున ననుకొనుచుండిరి.

పై రెండు కారణములుగాక మరియొకటి కలదు. బీరారు పరగణా యనాదిగా నిజాంరాష్ట్రమున భాగ ముగానుండెను. శ్రీవారి తండ్రిగారి కాలమున నది బ్రిటిషువారికి సైన్యవ్యయము బాకీక్రింద శాశ్వతకౌలున కిచ్చినట్లు వెనుక విన్నవించియుంటిని. అప్పటికైన పైకము వడ్డీతో తీర్చి మరల నాభాగమును కొనవలెనని శ్రీవారికి గట్టియుద్దేశ్యముకలిగెను. తాము స్వయముగా నీవిషయమున ప్రవర్తించుటకంటె రాజుయొక్కయు, ప్రజలయొక్కయు మోదమును వడసిన మంత్రివర్గము ద్వారా యీపనిని చేయించిన మంచిదని శ్రీవారు తలచిరి.

అదియునుగాక పరిసర రాష్ట్రములలోని ప్రజలు సుపరిపాలనముకంటె స్వపరిపాలనము మంచిదని యాం దోళనము చేయసాగిరి. ఇట్టి పరిస్థితులలో తామొక్కరే యొక్కబుద్ధిచే రాజ్యకార్యమంతయు నిర్వహించుట కంటె, యనుభవజ్ఞులగు మంత్రివరులుండిన యెడలను, నట్టిమంత్రివర్గము బహు ప్రజాదరణము వడసినవారై

నను, నట్టివారి సంఘమొకటి స్థాపించి ప్రభుత్వసూత్ర ముల విశాలముల నొనర్చిన మంచిదనికూడ తలచినట్లు కన్పట్టును. ఎట్లయినను తుది యధికారము తమ హస్త ములలోనే యుంచుకొని, సామాన్యదైనందిన రాజ్య కార్యములనుండి విశ్రాంతిగొన నిశ్చయించిరి.

ఒకసమయమున తమ యుద్దేశ్యమును తెల్పుచు శ్రీ ప్రభువువారు తాము భారము తగ్గించుకొనుట కీ క్రిందమూడును కారణములని సెలవిచ్చియున్నారు.

1. ప్రభువు స్వయముగా రాజ్యముచేయుట సమంజసముకాదు.

2. ఒకవ్యక్తి సలహాకంటె బహువ్యక్తుల సలహా న్యాయతరముగ నుండును.

3. కాలానుగుణముగ రాజ్యాంగమును విశాల మొనర్చుటకు పునాది వేయవలెను.

కారణత్రయము మిక్కిలి సమంజసముగా నున్నది. తాము రాజ్యాంగముయొక్క కళ్లెములను సడలించినను, మార్గములుసరియై యుండుటచే ప్రమాద ముండదని నిశ్చయ మయ్యెను. ఇచ్చట శ్రీవారి దూర

దృష్టికూడ గమనింపదగినది. అప్పటికే మైసూరు, బరోడా, తిరువాన్కూరు మొదలగు సంస్థానములలో రాజ్యాంగ పరివర్తనములు జరుగుచు ప్రజల మన్ననల వడసి యుండెను. శ్రీ వారికి కూడా యట్టి మార్పుల గావించి ప్రజాదరణమును బడయవలెననియుండి యుండ వచ్చును. రాష్ట్రాభివృద్ధి కరములగు కార్యముల జేసి ప్రజానురాగమును పొందిన యీ సమయమే, యట్టి మార్పులకు తగినదనికూడ శ్రీవారికితోచి యుండును. ఎట్లున్నను గట్టిపునాదులపై భవననిర్మాణము సులభ సాధ్య మగుటచేతను, గట్టిపునాదులు స్వయంపాలనా కాలమున వేయబడియుండుటచేతను, నీమార్పు సమం జసమనియు సకాలమున జరిగినదనియు చెప్పక తప్పదు.

## ౨. 4–11–1919 సుదినము

1919 సంవత్సరము నవంబరు 4 తేది రాష్ట్రమున కొక సుదినము! ఆదినమున శ్రీవారి యుద్దేశ్యము కార్యరూపమును దాల్చెను. ఆదినమున శ్రీవారు తమ నివాసమగు "కింకోటీ" రాజభవనమున నొకగొప్ప దర్బారు గావించిరి. అచ్చటకు రాష్ట్రమునందలి హిందూముసల్మానుపెద్దల నందరను నాహ్వానించిరి. రాజభవనము చక్కగా నలంకరింపబడెను. శ్రీవారప్పుడా సభలో తమ యుద్దేశ్యమును స్ఫుటవాక్యములలో ప్రకటించిరి. చేరిన పెద్దలందరు విస్మయాశ్చర్యములకు లోనైరి! శ్రీవారి రాజ్యకార్య ధురంధరత్వమును వేనోళ్ళ గొనియాడిరి! తమ కృతజ్ఞతను తమ దృష్టులలో వెల్లడించిరి! అనేకులు శ్రీవారు రాజ్యకార్యములనుండి విరమించుట రాష్ట్రాభివృద్ధి కాటంకమేమోనని భయమందిరిగాని, శ్రీవారి యభిప్రాయమనుల్లంఘనీయమగుటచే శిరసావహించి యూరుకొనిరి. అప్పుడు శ్రీవారు పలికిన పలుకులు చిరస్మరణీయములగుటచే సావధానముగా నిచ్చుట సమంజసము. అవి

స్వర్ణాక్షరముల ముద్రింపఁదగినవి. వానిలో శ్రీవారి శుద్ధాంతఃకరణము ప్రతిబింబించుచున్నది !

" నా రాష్ట్రచరిత్రమున నొక నూతన శక ప్రారంభకాలమున నీసభ సమావేశ పరచినాను. మొదటినుండి యీ రాష్ట్రప్రభుత్వ మేకవ్యక్తి హస్తగతమై, నిరంకుశమై, యొక్క మంత్రి సహాయముచే నడపబడు చున్నదని మీకందరకును తెలిసిన విషయమే! ఎవరో సుహృదయులు కొందరు తప్ప, యితర ముఖ్య మంత్రులందరును తాము లోబడి యుండవలసినట్టియు, తమరు సేవింపవలసినట్టియు నిజాంప్రభువుల యొక్క యధికారమును సాగనియ్యకుండ చేసినట్టి రాష్ట్రపూర్వ చరిత్రమువలన తెలియగలదు. ప్రాచీన రికార్డు భవనమున నీవిషయమైన సాక్ష్యము చాలగలదు. ఆ సాక్ష్యమును వలన నా పూర్వమంత్రులు తమ యధికారము నెట్లు దుర్వినియోగ మొనర్చిరో, యందువలన సక్రమ రాజ్య విధానమున కెట్లాటంకములు కలిగెనో, ప్రజలను న్యాయముగ పరిపాలింపక యెట్లు వారిని కష్టపెట్టిరో తేటతెల్లమగును. రాజున కుండవలసిన సంపూర్ణాధి కారమును తామే తమ హస్తగత మొనర్చుకొనవలె

నను దురాశచే నీ పూర్వ ప్రధానులందరును ప్రజా హిత రాజ్యాంగ విషయమున నెట్టి శ్రద్ధ వహించనివా రైరి. కావున నిదివర కమలుననున్న పరిపాలనా నియమములు సరియైనవి కావని దీనివలన స్పష్టమగుచున్నది.

మొదటి సాలార్జంగు బహద్దూరుగారు పరమపదించిన వెనుక కీ॥ శే॥ మాతండ్రిగారు, శ్రీ సాలార్జంగు గారు పరిపాలనావిషయమున సూచించిన మార్పుల నమలు పరచవలెనని చాల ప్రయత్నించి తుదకు తమ దూర దర్శిత్వసహాయముచే వానియందు కొన్ని లోపము లున్నట్లు తెలిసికొని, 1892 సంవత్సరమున ప్రధాన మంత్రియొక్కయు, నితర సలహాదారులయొక్కయు, దర్జాలను, కర్తవ్యములను, నధికారములను, నిర్వచించుచు నొక చట్టమును నిర్మించిరి. అందు క్రింద కొన్ని పద్ధతులుగల ప్రణాళికను తయారుచేయించిరి.

నేను రాజ్యమునకు వచ్చినవెంటనే పరిపాలనా విషయములను స్వయముగా కొంతవఱకు పరీక్షించితిని. ఆ పరీక్షవలన రాష్ట్రపరిపాలనా విధానముయొక్క పునాదులలోనే కొంత మార్పు కలిగించినగాని, యున్న లోపములను సవరించుట యసంభవమను నిశ్చయము

నాకు కలిగెను. అప్పుడు చాలా శ్రమకలిగించినను లెక్కసేయక, మిక్కిలి యాలోచించి, మంత్రి లేకయే స్వయముగా రాజ్యకార్యమంతయు నిర్వహింపవలెనని నిశ్చయించి, యయిదు సంవత్సరముల కాల మట్లు నిర్వహించితిని. నా ప్రజలపై నాకు సంపూర్ణ పుత్ర ప్రేమ యుండుటచే వారి సంపత్తిని, సౌఖ్యమును చేకూర్చునట్టి పద్ధతుల రాజ్యము చేయవలెనని యీ స్వయంపరిపాలనా కాలమున నా యావచ్ఛక్తిని విని యోగించితిని. పరిపాలనమునకును నాకును కల్గిన యీ సన్నిహిత సంబంధముచేత నీ పద్ధతియందు కూడ మార్పు కల్గించుట యవసరమని నాకు గోచ రించెను. కాలమువల్ల కల్గిన పరిణామము, నీ కాలపు ప్రజాజీవనమునందలి వైవిధ్యము, ప్రాచ్యదేశములలో కలిగిన రాజకీయ పరివర్తనములు, నా రాష్ట్రమునకు పరిసరరాష్ట్రములకును గల సంబంధము మొదలగు వానిని పరిశీలించిన, రాజు స్వయముగా, నిస్సహాయ ముగా రాష్ట్రప్రభుత్వమును నిర్వహించుట సమంజసము కాదనియు, కొంత మార్పుచేయుట యవసర మనియు నాకు తోచెను. అనేకమార్లు ప్రయత్నించి విఫల మైన పురాతన రాజ్యాంగవిధానమునే పునరుద్ధరించుట

యసంభవమని తలచి, వెనుకటికంటె కట్టుదిట్టములు కల్గినట్టియు, క్రమముగా విపులమగుటకు తగినట్టియు, నొక నూతన సంస్కరణవిధానమును రాష్ట్రమున కొసంగవలెనని దీర్ఘాలోచనముచేసి, దృఢముగ నట్లు చేయుటకు సంకల్పించినాను. ఎంత గొప్పవాఁడైనను నొక్క వ్యక్తిచే నిర్వహింపబడు పరిపాలనముకంటె నొక కార్యనిర్వాహకసంఘమునందా యధికారముండి ప్రభుత్వము నడిపింపబడుటలో ననేకోపయోగము లున్నవని, యితర స్థలముల చేయబడుచున్న యత్నములచే రుజువు చేయబడినది.

కావున నిట్టి ప్రయోజనములను నా ప్రజలకు కలిగించవలెనని నా మనస్పూర్తియైన యాశయమై యున్నది. ఈ యుద్దేశ్యముతో, నొక యధ్యక్షుడును, నేడ్గురు సామాన్యసభ్యులును, నొక్క యసామాన్య సభ్యుడును కల యొక కార్యనిర్వాహకసంఘమును స్థాపించుచు ఫర్మానా నొసంగినాను. అందు ప్రతి సభ్యునియొక్కయు, యావత్సభయొక్కయు నధికార బాధ్యతలు నిర్వచింపబడినవి........ అట్లు నిర్వచింపబడిన మంత్రిసంఘము ప్రభుత్వముసందలి యన్ని శాఖల

లోనున్న సర్వ వ్యవహారములయందును సహాయ మొన ర్చుటయేగాక, ప్రత్యేకముగా నాకొరకుగాను నేను ప్రత్యేకించుకున్న యధికారములలోకూడ నాకు తగిన సలహా నియ్యగలదు. ఈ సంఘముయొక్క విశిష్ట వ్యవహారము, ప్రభుత్వకార్యముల కొక యైక్యతను, సామరస్యమును కలుగజేసి, నా ప్రజలకు మిక్కిలి ప్రయోజనకారియగును.

విద్యావ్యాప్తి, యార్థిక సంపదభివృద్ధి, వాణిజ్య పారిశ్రామికవిషయ ప్రోత్సాహము, నాధునిక వైద్య పారిశుద్ధ్యవిషయక వ్యాపనము, రోడ్లు నితర ప్రయాణసౌకర్యముల వ్యాపింపజేయుట మొదలగు విషయములెన్నియో యింకను నిర్వర్తింపవలసియున్నవి. ఇట్టి యంతస్సంస్కరణ మెంత యవసరమో, యిం డియా గవర్నమెంటుకును నా ప్రభుత్వమునకును గల రాజకీయ సంబంధ విషయ మంత యవసరమైయున్నది. ఇట్టి యన్ని విషయములందును నీ కార్య నిర్వాహక సంఘముయొక్క యత్నములు ఫలవంతములగును. ఇం డియా గవర్నమెంటువారికిని నాకును వెనుకటివలెనే యిప్పుడును స్నేహపూరితమైన సంబంధమే యున్నది.

ఇండియా దేశములో బ్రిటిషు పరిపాలనము ప్రారంభించినప్పటినుండియు, మా కుటుంబమునకును వారికిని నవిచ్ఛిన్న మైత్రీసంబంధమే యనువర్తించుచున్నది. అనేకములగు నవసరములందు, మా యాసఫ్జాహీ ఖడ్గము, బ్రిటిషు సామ్రాజ్య రక్షణమునకై వినియోగింపబడినది. బ్రిటిషు సామ్రాజ్యము మహాయుద్ధములో సంపూర్ణవిజయము నొందవలెనని నేను వారికిచేసిన సహాయము నాముఖతః చెప్పుకొనవలసినదికాదు.

మిక్కిలి ముఖ్యమైన బీరారు రాష్ట్రసమస్య నెదుర్కొనుటకై యీ కార్యనిర్వాహక సంఘము ప్రయత్నించుటకు మంచి యవకాశము కలుగును. ఒకప్పుడు నా రాజ్యభాగముగనుండెడి యీ బీరారు ప్రాంతముపై నాకుండెడి హక్కు న్యాయసమ్మతమైనది. పరీక్షించినవారెవ్వరును కాదనుటకు కారణములు కానరావు. కావున నీసందర్భమున నిట్టిముఖ్యవిషయమున నీసంఘము నాకెట్టి సహాయమును, సలహాను నొసంగునోయని మిక్కిలి యాతురతతో వేచియున్నాను. నాసామంత ప్రభువులను, నాయుద్యోగీయులను, నా

జాగీర్దార్లను, తుదకు నా ప్రియప్రజలను, నీనూతన
రాజ్యాంగ సంస్కరణములను శ్రద్ధతోనమలునందుంచు
టకు తమ సంపూర్ణమైనట్టియు, భక్తిపూరితమైనట్టియు
సహకారమొసంగవలయునని మనస్ఫూర్తిగా హెచ్చ
రించుచున్నాను. హృదయపూర్వకముగ ననుసరించిన
గాని యెట్టి ప్రణాళికయు సఫలము కాజాలదు."

ఏమి పవిత్రవాక్యములు! ప్రజలపై శ్రీవారికెంత
పితృప్రేమ! రాష్ట్రాభివృద్ధికై యెంతశ్రమ! భావికాలమున
నేయేవిషయముల రాజ్యాభివృద్ధి కావలసియున్నదో
కూడ పైవాక్యములలో సూచింపబడియున్నది. అన్నిటి
కంటె బీరారు పరగణాయొక్క పునఃప్రాప్తి శ్రీవారి
కెంత హృదయ పూర్వక కార్యమో గోచరింపగలదు.
ఇట్టి పవిత్రాశయములతో సంస్కరణములు ప్రారం
భింపబడెను. రాష్ట్రాభ్యుదయసూచన మింతకంటె
నేమి కావలయును?

## 3. ప్రథమ మంత్రి మండలి

మంత్రి సంఘస్థాపనోద్దేశము పొడమినంతనే శ్రీ ప్రభువువారు, తదధ్యక్షపదవికి వలసిన యోగ్యతలు గల వ్యక్తికొరకు ప్రయత్నించుట ప్రారంభించిరి. సమస్త వ్యవహారములును దాదాపు మంత్రిసంఘమునకు వశము చేయవలసినపుడు, వానిని నిష్పాక్షికముగను క్షేమకరముగను నిర్వహింప శక్తుడగు వ్యక్తి వలయునుకదా? ఈ రాష్ట్రము ముసల్మాను రాజ్యమగుటచే నట్టి వ్యక్తి ముసల్మానుడైన మరియు మంచిదని భావించిరి. రాష్ట్రముననున్న వారిలో తగినవారున్నను నీ నియామకమును, రాజ్యాంగ పరివర్తనమును, నిండియాగవర్నమెంటుకుకూడతృప్తికరముగనుండవలసివచ్చెను. మిక్కిలి జాగ్రత్తగా పరిశీలించి యిండియా ప్రభుత్వమువారి సలహా తీసుకొని తుదకీపదవికి శ్రీ సర్ ఆలీ ఇమాము కె. సి. ఐ. ఇ. గారిని నియమించిరి. శ్రీవారు మంత్రి సంఘస్థాపన సందర్భమున చేసిన దర్బారులో నీమంత్రులను గూర్చి యిట్లు ముచ్చటించిరి.

"ఈసంఘ సభ్యులను మిక్కిలి జాగ్రత్తతో నేరితిని. మిక్కిలి యనుభవము కలిగి యిదివరలోనే ఘన కార్యములను నిర్వహించినవారైయున్నారు. అధ్యక్షులగు సర్ ఆలీ ఇమాముగారిని గూర్చి మీకు కెక్కువగా చెప్పనక్కర లేదు. బ్రిటిషిండియాలో వారు చేసిన పని జగద్విదితమే!"

ఈ సంఘసభ్యుల నేరుటలో శ్రీవారుపయోగించిన దూరదృష్టి, బుద్ధికుశలత, వ్యక్తుల నామములను చెప్పిన చదువరులకు విశదముగా తెలియగలదు. వారి నామముల నిచ్చుట యిక్కడ యప్రస్తుతము కాదు. వారి సంఖ్య, యొక యధ్యక్షుడు, నేడుగురు సాధారణ సభ్యులు, నొక యసాధారణసభ్యుడు, మొత్తము తొమ్మిదిమంది యని విన్నవించియుంటిని.

1. నవాబ్ మొయీనుద్దుల్ముల్కు సర్ సయ్యదు ఆలీ ఇమామ్, కె. సి. ఐ. ఇ. (అధ్యక్షుడు).

2. నవాబు సర్ ఫరిద్దూన్ముల్కు బహద్దూరు. కె.సి.ఐ.ఇ., సి.యస్.ఐ., సి.బి.ఇ. (అసాధారణ సభ్యుడు).

3. నవాబు సర్ నిజామత్ జంగు బహద్దూరు. కె.సి.ఐ.ఇ., ఎం.ఏ., యల్.యల్.బి., బారట్లా.

4. నవాబు తిలావత్ జంగు బహద్దూరు. బి.ఏ.

5. నవాబు అఖీల్ జంగు బహద్దూరు.

6. నవాబు వలీఉద్దౌలా బహద్దూరు.

7. నవాబు లుత్ఫుద్దౌలా బహద్దూరు.

8. రాజాఫతేనవాజువంతు బహద్దూరు.

9. సర్, రిజినాల్డుగ్లాంసీ, సి.ఐ.ఇ., సి.యస్.ఐ.

ఈ ప్రథమసంఘ సభ్యుల పేర్లను చదివినంతనే శ్రీవారీ నియామకమున నెంతబుద్ధిని వినియోగించినది తెలియును! రాష్ట్రాభ్యుదయమునకుగాను మిక్కిలి ప్రతిభయు, ననుభవమును గలవ్యక్తుల నేరి నియమించిరి. వీరినిగూర్చి వీరి యోగ్యతల నుగ్గడించుచు కొంచెము ముచ్చటించుట యప్రస్తుత మెంతమాత్రమును కాజాలదు. అధ్యక్షుడు బీహారురాష్ట్రమునకు చెందిన సుప్రసిద్ధ ముసల్మాను మహాశీయుడు. దేశసేవయందు వయసంతయు గడపిన దేశసేవకుడు. బ్రిటిషిండియాయందనే కోన్నతపదవుల నధిష్టించిన ధీరుడు. వైస్రాయి కార్యనిర్వాహక సభయందు సభ్యుడై, కొంతకాలమైన

వెనుక తత్సభకుపాధ్యక్షుడై, రాజ్యకార్య నిర్వహణ మందు చక్కని యనుభవము సంపాదించిన ప్రతిభాశాలి. పాట్నా హైకోర్టు జడ్జీగానుండి న్యాయ విచారణదక్షతతో కూడిన తెలివితేటలు గలవాడు. ఇట్టివాడగుట చేతనే యీయన శ్రీవారి దృష్టి నాకర్షించెను. ఇచ్చటికి వచ్చుటలో నాయనయు తాను బ్రిటిషిండియా ప్రభుత్వమున గడించిన యనుభవము నీరాష్ట్రాభ్యుదయమునకై వినియోగించుటయే ముఖ్యోద్దేశమని చెప్పవలయును. కాన నీనియామకము మిక్కిలి సమంజసమని తెలుపవలసియున్నది.

ఈ సంఘమునందు ముగ్గురు రాజబంధువులు కలరు. శ్రీనవాబ్ వలీఉద్దౌలా, లుత్ఫుద్దౌలా బహద్దూరులును, శ్రీనవాబ్ తిలావత్ జంగు బహద్దూరు గారును శ్రీవారికి దగ్గిర బంధువులు. విద్యావంతులగుట చేతను, ప్రతిభాశాలురగుట చేతను, శ్రీవారియందు సంపూర్ణ భక్తివిశ్వాసములుగలవారగుట చేతను, వారు తమ కర్తవ్యమును యథాన్యాయముగా నిర్వర్తింతురని శ్రీవారు తలచుటలో నెట్టి యాశ్చర్యమును లేదు.

**నవాబు వలీఉద్దౌలా బహద్దూరు :—**

కీ॥ శే॥ వెనుకటినిజాంప్రభువుగారి కీయన మేనల్లుడు. ఈయన తండ్రి యగు సర్ వికారుల్ ఉమ్రాగా రీయనకు పదమూడవ యేటనే, యదివరలో నుర్దూ పర్షియను భాషాపరనమున నీయన చూపిన తెలివితేటలను గమనించి, యీయనను చదువుకొరకు కింగ్లాండునకు పంపిరి. హైద్రాబాదులో నిదివరకు ప్రఖ్యాతివహించిన డాక్టరు లాడర్ అను దొరగారి నీయనకు గార్డియనుగా నియమించిరి. రాజపుత్రులును, ప్రభువులును చదువుకొను పబ్లికుపాఠశాలలో నీయన విద్యాభ్యాసము ప్రారంభించెను. ఇంగ్లీషుభాషయందు ప్రవీణుడయ్యెను. మొత్తము మీద నీయన పండ్రెండు సంవత్సరము లింగ్లాండున విద్యాభ్యాస మొనరించెను. మరలి వచ్చిన తరువాత నీయన సైన్యశాఖలో చేరి డేరాఢూనున శిక్షణమును పొందెను. కర్జనుప్రభువు వైస్రాయిగా నున్న కాలమున జరిగిన ఢిల్లీదర్బారున కాహ్వానము చేయబడినవారిలో నీయన యొకరు. సైన్యశిక్షణమును పొంది మరలినపిదప క్రమముగా సైన్యశాఖయందు గొప్పపదవి నధిష్ఠించెను. **1911–14** సంవత్సరములమధ్య శ్రీవారీయనను కొంత

కాలము సైన్యమంత్రిగాను, కొంతకాలము న్యాయ శాఖామంత్రిగాను, నియమించి యాయనకు రాజకార్యా నుభవము నొసంగిరి. కావున విద్యావంతుడై యనుభవజ్ఞుడైన యీయన కార్యనిర్వాహక సభ్యత్వమునకు మిక్కిలి తగినవాడని చెప్పవలెను. ఇదివరకే యిట్టి దానితో తుల్యమైన పదవిని వహించి తన యోగ్యతను వ్యక్తపరచెను. తరువాత 1924 సంవత్సర ప్రాంతమున ముఖ్య మంత్రి పదవినికూడ నలంకరించి, రాజకార్యముల నారితేరి, తమ జీవితమును తమ ప్రభువును కొలుచుటలో వినియోగించి ధన్యజన్ముడై యిటీవలనే పరమపదించెను.

**నవాబ్ లుత్ఫుద్దౌలా బహద్దూరు:—**

వీరు వలీఉద్దౌలా బహద్దూరుగారికంటె నైదేండ్లు చిన్న. వీరుకూడ శ్రీవారి బంధుకోటిలోనివారే! వీరి తండ్రిగారు నవాబ్ సఫ్దర్ జంగుబహద్దూరుగారు బహుదేశసంచారులై, యనుభవజ్ఞులై, కొంతకాలము మంత్రి పదవిని కూడ నధిష్ఠించిరి. కావున శ్రీ లుత్ఫుద్దౌలా బహద్దూరుగారి కుగ్గుపాలతోనే రాజకార్య జ్ఞాన మలవడెను. 35 సంవత్సరముల వయస్సుననే వీరు మంత్రి

పదవి నధిష్టించిరి. మంత్రి సంఘస్థాపన సమయమునకే వీరు రాజకార్యములందారితేరి యుండుటచే వీరి నియామకము తప్పక సరియైనదని చెప్పనగును. వీరును నియమించిన సంవత్సరమునుండి దాదాపు తుదివరకును మంత్రి సంఘసభ్యులై యుండి రాజసేవయందు నిపుణులై యిటీవలనే కాలధర్మము నొందిరి. వీరరబ్బీ పారసీ భాషల యందు పండితులై యింగ్లీషు భాషను కూడ నొక పండిత సహాయమున నభ్యసించిరి.

**నవాబ్ తిలావత్‌జంగు బహద్దూరుగారు:—**

వీరును రాజబంధువులై రాజకుటుంబమునకు చెందియుండిరి. చిన్నప్పటినుండి వీరు గొప్ప విద్యావంతులగు లక్షణములను చూపుచు విద్యాలయం దారితేరి పంజాబు విశ్వవిద్యాలయమున బి. ఏ. పరీక్షయందు త్తీర్ణులైరి. రాజబంధువులయి యిట్లుత్తీర్ణులగుట మిక్కిలి యరుదైయుండుటచే రాజకార్యములయందు తర్బీతు పొందుట ప్రారంభించిరి. కొంతకాలమైనవెనుక వీరు విద్యాశాఖాధికారిగా నియమింపబడి, తమ కర్తవ్యమును మిక్కిలి శ్రద్ధతో నిర్వర్తించిరి. వీరు బహుభాషావేత్తలు. వీరి ప్రతిభను చూచి శ్రీవారు మంత్రిసంఘ

సభ్యులుగా నియమించిరి. శ్రీవారి నియామకమును సఫలము చేయుచు, వీరు తమక్రిందనుండు శాఖల నత్యంత సమర్థతతో నిర్వహించిరి. ఇప్పటికిని మంచి యారోగ్యముతో నున్నారు. కాని రాజకార్యముల నుండి విరమించి విశ్రాంతిని గైకొనుచున్నారు. వీరి యిద్దరు కుమాళ్ళును విద్యావంతులై ప్రభుకోటిలో మన్ననల నందుచున్నారు. శ్రీ నవాబు తిలావత్ జంగు బహద్దూరుగారి కాలమున ననేక దేశోపకారకములగు విషయముల వారొనర్చిరి. రైల్వేను రాష్ట్రీయము చేయు ప్రయత్నమన్నిటిలో ప్రశంసింపదగినది.

రాజబంధువులు రాజభక్తి కలిగి రాష్ట్రవ్యవహారములను తమ శక్తివంచన లేకుండ నిర్వహించుట సహజమే! కాబట్టి శ్రీవారి నియామకములలో దూరదర్శిత్వమును చూపిరనుట కభ్యంతరము లేదు. మిగిలిన వ్యక్తుల విషయమున కూడ శ్రీవారి నియామకము మెచ్చదగినదని యీ క్రింది వారియోగ్యతల వలన తెల్లమగుచున్నది.

**నవాబ్ సర్ నిజామతుజంగు బహద్దూరు, కే. సి. ఐ. ఇ., ఓ.బి.ఇ., ఎం.ఏ ,యెల్.యెల్.బి., బారట్లా. :—**

ఈ రీరాష్ట్రమునందలి విద్యాధికులలో ముఖ్యులలో నొకరు. ఈయన బిరుదావళియే వీరి యోగ్యతను చాటుచున్నది. వీరి వంశ మరేబియానుండి వచ్చిన దైనను, నీయన పూర్వులు నిజాముల్ముల్కుతో నీ రాష్ట్రమునకు వచ్చిరి. రాజభక్తియందును, రాజకార్యములందును నారితేరినవంశము వీరిది. వీరి తండ్రిగారు వరంగలు సుబేదారుద్యోగమును బహు సమర్థతతో నిర్వహించినవారు. వీరు చిన్నతనమునుండియే విద్యార్జన సూచనలు కనపరచుచుండెను. వీరిసోదరులు సర్కారున గొప్ప యుద్యోగములో నున్నారు.

వీరు ప్రథమమున మద్రసాఐజాలో విద్యార్జనము చేసి, 1887 సంవత్సరమున నున్నతవిద్యకొరకై యింగ్లాండునకు వెడలెను. అప్పటికి వీరి వయసు 16 సంవత్సరములు. వెడలిన నాల్గు సంవత్సరములలోనే బి. యే. యల్. యల్. బి., పరీక్షయందు కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయమున నుత్తీర్ణులైరి. తరువాత యెం. ఏ. పరీక్షయందుత్తీర్ణులై బారిస్టరై 1896 సంవత్సరమున

మద్రాసు హైకోర్టులో న్యాయవాదిగా చేరెను. కాని శ్రీవారి తండ్రిగారు వీరి విద్యను రాష్ట్రమున కుపయుక్తము చేయ నిశ్చయించిరి. వీరిని రాజోద్యోగమున కాహ్వానించిరి. జిల్లాజిడ్జి పదవినుండి క్రమముగా హోం సెక్రటరీయై, హైకోర్టు జడ్జియై, తుదకు మంత్రి సభాసభ్యులైరి. అనేకోద్యోగ పదవులను మిక్కిలి సమర్థతతో నిర్వహించినవారు మంత్రిపదవికి తగుదురని వేరే చెప్పననవసరము. వీరు ప్రభువుగారికి చేసిన భక్తియుతమగుసేవకు మెచ్చి బ్రిటిషుగవర్నమెంటువారు వీరికి సర్ బిరుదము నిచ్చిరి. వీరు హృదయమున హిందూ ముసల్మాను భేదము లేక, సర్వసామ్యభావమును వహించిన న్యాయశీలురు. యోగ్యతను బట్టియే తప్ప ముల్కీ-ముల్కీతర భేదమును పాటింపకూడదని వీరి యభిప్రాయమని చెప్పుదురు. వీరి న్యాయదృష్టికీ రెండు దృష్టాంతములును చాలును. వీరు నగరాభివృద్ధిశాఖ యందుకూడ కొంతకాలము జోక్యము కలుగచేసుకొనిరి. అనేక సంస్థలతో సంబంధము కలిగియున్నారు. వీరింగ్లీషున గొప్ప కవులై, పారసీ భాషలో పండితులై, మన్నన లనందుచున్నారు. వీరు చేసిన యొక్క మహా కార్యమును చెప్పిన వీరి రాష్ట్రసేవ తెలియగలదు. 1915

సంవత్సరమున నప్పటి ఛీఫింజినీరగు మెకంజీ దొరగా రితో మద్రాసుకు వెడలి, యదివరలో తుంగభద్రోదకములలో హైదరాబాదు ప్రభుత్వమున కెట్టి భాగము లేదని వాదించు మద్రాసు ప్రభుత్వముతో తాము సకారణముగా వాదించి, యీ ప్రభుత్వమువారికి భాగము గొనివచ్చిరి. దీనివలన వారి వాదనా సామర్థ్యమును, రాష్ట్రప్రీతియు వెల్లముకాగలదు. వీరు మానవునకు సత్స్వభావమవసరమని నమ్మకమున్నవారికి బోధించుచు, వలయుకాలమున నేలికకు మంచి సలహా నిచ్చి రాష్ట్రసేవచేయుటకు సిద్ధమై తమ వార్ధక్యమును ప్రశాంతముగా గడపుచున్నారు.

**శ్రీ అబ్దుల్లా యూసుఫల్లీగారు:—**

వీరు బ్రిటిషిండియావాసులై విద్యార్థికులై యింగ్లాండువెడలి, యచ్చట ఐ. సి. యస్; పరీక్షయందు త్తీర్ణులై, బ్రిటిషిండియాలో ననేకోన్నతపదవుల నంది

1 మొదటి కార్యనిర్వాహక సభలోనికి నియమింపబడిన వారిలో రివిన్యూ మంత్రియగు రాజాఫత్తేనవాజువంతు బహద్దూరుగారి నామము శ్రీ రాయ మురళీధరు గారు. ఈయన ప్రతిభాశాలి. మేధావి. నిర్దుష్టప్రవర్తన గలవారు. మిక్కిలి రాజసేవా

యుపకార వేతనము గొన్నవారు. శ్రీవారు వీరి తెలివి తేటలను రాష్ట్రమునకు వినియోగించునట్లుగా వీరిని నియమించిరి. వీరిచ్చట చాలకాల ముండలేకపోయెను. వీరిప్పటికిని ప్రజాసేవ చేయుచునేయున్నారు. వీరు పవిత్రమగు ఖురానుషరీఫు గ్రంథము నింగ్లీషుభాష లోనికి పరివర్తనము చేయుచున్నారు. గ్రంథ ముత్త మాంగ్ల గ్రంథములలో నొకటియై వరలగలదని చదివిన వారు తెలిసికొనగలరు.

**నవాబు సర్ ఫర్దూంజంగు బహద్దూరు. కె. సి. ఐ. ఇ., సి. యస్. ఐ., సి. బి. ఇ.,:—**

పార్సీలు మొదటినుండియు రాష్ట్రమునకు స్నేహితులై, వారి జనసంఖ్యకంటె యెక్కువ యధికార పదవుల ననుభవించుచున్నారని మొదట తెలిసికొన వలెను. అట్లు రాష్ట్రమును భక్తితో కొలిచినవారిలో

సక్తుడు. వీరి స్వదేశము పశ్చిమోత్తరరాష్ట్రము.(North Western Province) వీరి కుటుంబమున కిప్పటికిని నచ్చట యాస్తికలదు. ఇంతకుపూర్వమీయన యనే కోద్యోగములను సమర్థతతో నిర్వర్తించెను, ఈయన నిచ్చట జాగీర్దారుగా శ్రీప్రభువు వారుచేసిరి. వీరు కొంతకాలము కార్యనిర్వాహక సభ్యుడుగానుండి వార్ధక్యముచే విరమించినందున శ్రీ అబ్దుల్లా యుసుఫల్లీగారు తత్ స్థానమునకు నియమింపబడిరి.

నీయన ముఖ్యుడు. ఈయన రివిన్యూశాఖలో నుద్యోగిగా చేరి, యందనేకోన్నత పదవులను పొంది, రెండవ సాలార్జంగుగారి మంత్రిత్వకాలమున వారి యాంతరంగిక కార్యదర్శిగా నియమింపబడెను. ఎన్ని వెనుకముందులు ప్రభుత్వమున తటస్థించినను, రాష్ట్రము నెడల నీయనయొక్క స్థిరభక్తి నిలచియే యుండెను. శ్రీవారి రాజ్యప్రారంభసంవత్సరముల నీయన శ్రీవారికి ముఖ్య సలహాదారులలో నొకరుగా నుండెను. స్వయంప్రభుత్వ కాలమున గూడ నీయన శ్రీవారికి మిక్కిలి విశ్వాస పాత్రుడయ్యెను. కొన్నిమార్లీయనను రెసిడెంటులు పొగడియుండిరి. ఇట్లీవిధముగా నిజాం యిండియాగవర్నమెంట్లు రెండింటిచేతను పొగడ్తనుగన్న యీయనను శ్రీవారు నియమించుటలో నెంతమాత్రము పొరబడియుండలేదని గట్టిగా చెప్పనగును. ఈయన సచ్ఛీలమును, విశాలహృదయమును, నీయన గృహమును, పురప్రముఖులు తరుచు కలియు కొలువుకూటముగా నొనర్చెను. రాష్ట్రమునందలి పెద్దయుద్యోగీయు లందరును నీయన సలహాకు మూగుచుండిరి. ఈయన వేట మొదలగు ననేక వ్యాయామములం దసమానప్రజ్ఞ కలిగి



నేవాబు అఖిల్‌జంగు బహద్దూరుగారు

యుండెను. ఈయన 40 సంవత్సరములు రాష్ట్రసేవ చేసి, తుదవరకు కార్యనిర్వాహకసభ్యుడుగా నుండెను.

**నవాబు అఖిల్‌జంగు బహద్దూరుగారు :**

రాష్ట్రసేవలో నారితేరి, రాజునకు కుడిభుజమై, సాటిలేని కీర్తిని గడించిన నవాబ్ ఇమాదుల్ముల్క బహద్దూరుగారి తృతీయపుత్రు డీయన. 1874 సంవత్సరమున జననమొంది 1897 సంవత్సరముననే రాజ్యకార్యముల నిర్వహింప ప్రారంభించెను. రివిన్యూ కార్యదర్శి మొదలగు ననేకోన్నత పదవుల నలంకరించి, వాని కార్యముల నత్యంతసమర్థతతో నిర్వహించుటచే శ్రీవారీయనసేవకు ప్రీతులై యింకను సేవచేయుట కవకాశ మిచ్చుటకై యీాయనను మంత్రి పదవియందు నియమించిరి. చిన్నప్పటినుండియు నీయన చాకచక్యమును, తెలివితేటలను, సమబుద్ధిని చూపుచుండెను. ఇప్పటికి నీయన చిన్నతనపు సంతోషహృదయమును విడువలేదు. వీరి కుటుంబము రాష్ట్రసేవ కిచ్చినంతమంది వ్యక్తుల నే యితర కుటుంబమును నియ్యలేదు. ఇప్పటికిని యీా బిలిగ్రామీ కుటుంబ సహాయముచేత శ్రీ సర్ అక్బరు

హైదరీగారు రాజ్యకార్యములను సంపూర్ణ సామర్థ్యముతో నిర్వహించుచున్నారని చెప్పవలెను.

**సర్ రిజినాల్డుగ్లాన్సీ ఐ. సి. యస్. గారు:—**

వీరిప్పటికే యార్థికమంత్రిగా పనిచేసియుండిరి. రాష్ట్రముయొక్క యార్థికబలము వీరి కృషిప్రతిభా మూలమే! ఇండియా గవర్నమెంటువారి విదేశాంగ శాఖలో వీరు పనిచేసియున్నారు. వీరి తరువాత తత్ స్థానమునకు శ్రీ హైదరీగారు నియమింపబడిరి. వీరినిగూర్చి వెనుక ముచ్చటించియున్నాను. శ్రీవారి స్వయంపాలన కాలమున శ్రీవారికి చెలియై, చుట్టమై, యాప్తసేవకుడునైన యీయనను, మంత్రిపదవికి నియమించుటలో శ్రీవారు కర్తవ్యమునే నిర్వర్తించిరని చెప్పవలెను. మొదటి మంత్రి సంఘములోనివారగు నవాబు అఖిల్ జంగుగారును వీరును మాత్రమే ప్రస్తుతమువరకు ననువర్తించుచున్నారు. వీరిద్దరికిని భగవంతుడు దీర్ఘాయువునిచ్చి రాజ్యము యొక్క యితోధికాభ్యున్నతికి కారకులను చేయును గాక! శ్రీ హైదరీవారింకను రాజసేవయందున్నతి నొంది, యనేక బిరుదముల నంది, ప్రపంచ మంతటి

చేతను కొనియాడబడుచు, మూర్తీభవించిన హిందూ ముసల్మాను మైత్రియై, యత్యంత బాధ్యతాయుత కార్యములను నిర్వహించుచున్నారు. వీరిని బిరుదము లన్నిటితో పిలుచుటకంటె శ్రీహైదరియనియే సంక్షిప్తముగా పిలచిన గౌరవించినట్లు భావించుచున్నారు. ఎంత నిగర్వము!



# 1919 — 1926

## ౧

రజతోత్సవమువరకు నీ కాలమును రెండు భాగములుగా భాగింపవచ్చును.

**1919—1926** మహారాజా బహద్దూరుగారికి పూర్వకాలము.

**1926—1937** మహారాజా బహద్దూరువారి ప్రధానమంత్రిత్వకాలము.

**సర్ అలీఇమాముగారి ప్రధానమంత్రిత్వము, వలసవిధానము:**

సర్ ఆలీ ఇమాముగారు వచ్చినకాలమున బ్రిటిషిండియాలో గొప్ప రాజకీయ పరివర్తనము జరుగుచుండెను. ఆ గాలి స్వదేశసంస్థానములకుకూడ తగులుచుండెను. శ్రీవారి పలుకులలోనే యీ విషయమును వెనుక మనము గుర్తించియున్నాము. సర్ ఆలీ యిమాముగారు బ్రిటిషిండియానుండి వచ్చినందున, నాయనవలన నీ రాష్ట్రమునకు గొప్ప లాభము కలుగు

నని తలంపబడెను. కాని యాయన పరిపాలన మను కున్నంత ఫలవంతము కాకపోయెను. వారిని నియమిం చిన ప్రభువుగారికిని, ప్రజలకును నిరాశ జనించెను.

వీరు వచ్చినవెంటనే, రాష్ట్రమున నడవులు మిక్కు టముగ నున్నవనియు, వానిని కొట్టించి వ్యవసాయమున కనువగునట్లు చేసిన రాష్ట్రము భాగ్యవంతమగుననియు, నొకవేళ నట్టి భూములను రాష్ట్రవాసులు కొననియెడల పెట్టుబడిపెట్టి వ్యవసాయము చేయగల భూస్వాముల నితరస్థలములనుండి రప్పింపవచ్చుననియు, వారి విచా రణవలన తేలెను. ఆవిధమున రాష్ట్రమున నిర్వ్యవ సాయముగనున్న భాగములను వ్యవసాయము చేయిం చినయెడల రాష్ట్రసంపద యభివృద్ధి యగునని తలంప బడుటచే, వారు తత్కార్యమున కనువగు సూచనలను శ్రీవారికి విన్నపమంపిరి. శ్రీవారు వాని నంగీకరించిరి. దీనిని వలస విధానమందురు (Colonisation Scheme). అందుక్రింద రాష్ట్రమున వ్యవసాయమున కనువైనట్టియు, ప్రజాబాహుళ్యము లేనట్టియు, ప్రాంతములన్నియు సర్వే చేయబడి చిన్నచిన్న భాగములుగా విభజింప బడెను. ఇట్టిభూమి రాష్ట్రము మొత్తమున 40 లక్షల

యెకరము లుండునని మదింపు వేయబడెను. ఈ భూమి యంతయు నొక యభివృద్ధిశాఖాధికారి క్రింద నుంచి, దానిని చిన్న భాగములుగ విభజించి వ్యవసాయ యోగ్యములుగ చేయవలెననియు, నా భాగములను శాశ్వతముగ రైతుల కియ్యవలెననియు, రైతులకా భూములలో సంపూర్ణ జిరాయతి హక్కులుండవలెననియు, పుత్ర పౌత్ర పారంపర్యముగా సన్నదు లియ్యబడుననియు, శ్రీవారు ఫర్మానాను దయచేసిరి. తదనుసారముగా రాష్ట్రమునందలి కొన్ని యడవి ప్రదేశములు నిర్వనములుగా చేయబడెను. ఈవిధముగా జనసంఖ్య యెక్కువగా లేని రాష్ట్రమునందలి యీరవభాగము జనాకీర్ణము చేయబడెను. ఇది తప్పక మంచిపనియైనను నీ భూములు గ్రహించిన రైతులు, తద్భాగము లిదివరలో నడవి ప్రదేశములై మన్యపు జ్వరము మొదలగు వ్యాధుల కాకరము లగుటచే వానివలన బాధపడిరి. తత్కాలమునకు వ్యవసాయము చేయుటకు రైతులు వచ్చినట్లు కనబడినను కొందరు క్రమముగా నసంతృప్తులై వెడలుట తటస్థించెను. ఇందు కొన్ని ప్రాంతము లిప్పటికిని జనబాహుళ్యము లేక వ్యాధి సహితములుగా నున్నవి. కాని కొన్ని భాగములు మాత్రము జనాకీర్ణములయ్యెను.

అప్పుడు వెడలక నిలిచిపోయినవా రిప్పుడు సుఖము గాను, నైశ్వర్యవంతులుగాను, నున్నారని చెప్పవలెను. సర్ ఆలీయిమాముగారి యుద్యోగకాలమున జరిగిన గొప్పపని యిదియే ! వారు బ్రిటిషిండియానుండి వచ్చు టచే నచ్చటి పరిస్థితులను కొన్నింటి నిక్కడ వెంటనే కలుగజేయవలెనని ప్రయత్నించిరి. కాని యీ రాష్ట్ర మున నవి ఫలవంతములగుటకు తగిన వాతావరణము లేకపోవుటచేతను, మార్పులు క్రమముగా గాక హఠా త్తుగా చేయవలెనని ప్రయత్నించుటచేతను, నిచ్చటి వారికిని, సర్ ఆలీయిమాముగారికిని కొంతసంఘర్షణము ప్రారంభమయ్యెను.

**ఇతర ప్రధానమంత్రులు :**

ఆయన వచ్చిన కొలదిదినములకే యిండియా గవర్నమెంటువా రాయనను నానాజాతి సమితికి ప్రతి నిధిగా నేరి వెడలునట్లు నిర్ధారణ జరిగెను. కావున నాయన 1920 సంవత్సరము అక్టోబరు నెలలో యూరోపునకు వెడలెను. ఆయన వచ్చువరకు నసా ధారణ సభ్యులగు సర్ ఫర్దూనుల్ముల్కు-గా రాయన స్థానమున నియమితులయ్యెను. శ్రీవారి స్వయం

ప్రభుత్వకాలమున శ్రీవారికి కుడిభుజమై రాష్ట్రాభి వృద్ధికి ముఖ్యకారకులైన శ్రీ హైదరీగారికిని నాలీ యిమాము గారికిని నభిప్రాయభేదములు జనించినట్లు చెప్పుదురు. ఆలీయిమాముగారు స్వదేశసంస్థాన వాతా వరణమున కపరిచితులగుటచే నిట్లగుట తటస్థించెను. శ్రీ హైదరీగారు బ్రిటిషిండియాలోని తన ఖాయపుద్యోగ మగు నకౌంటెంటుజనరలుద్యోగమున పోయి చేరిరి. ఆలీ యిమాముగారు యూరపునకు వెడలి యాపదవికి సర్ ఫరీదూనుల్ ముల్కుగారు వచ్చినవెంటనే శ్రీహై దరీగారికి మరల కబురు పంపబడెను. అందులకు సమ్మ తించి వారు తామిదివరలో కొలిచిన ప్రభువుమాట తీసివేయలేక యార్థిక మంత్రిపదవి నంగీకరించిరి.

శ్రీ ఆలీయిమాముగారు మరల వచ్చిన కొలది కాలమునకే యిచ్చటి యభిప్రాయభేదములు మరింత ప్రబలెను. అందుచే వారి కాలపరిమితి పూర్తికాక మునుపే వారు రాష్ట్రమును వెడలిపోవుట తటస్థించెను. ఎంతో యాశను పురికొల్పిన శ్రీ ఆలీ యిమాముగారు తమ ప్రతిభను, ననుభవమును, నైజాం రాష్ట్రప్రభుత్వ మునకు సంపూర్ణముగా నియ్యలేకపోయిరి. 3వ నవాబు

సాలార్జంగు బహద్దూరుగారి కాలమువలె వీరి కాల మును నిరుత్సాహకరమయ్యెను.

వీరి తరువాత మరల కొలదిదినములు సర్ ఫర్దూనుజంగుగారు తమ ప్రతిభ నుపయోగించిరి. కాని వీరు మిక్కిలి వృద్ధులగుటచే శ్రీవారియాజ్ఞను వడసి యుపకారవేతనమును గైకొనిరి. వీరి రాజభక్తియు రాష్ట్రసేవయు మిక్కిలి కొనియాడదగినవి. వీరి తరు వాత నవాబు వలీఉద్దౌలా బహద్దూరుగారు ప్రధాను లుగ నియమింపబడిరి. వీరును మొదటి మంత్రి సంఘ స్థాపనకాలమునుండి రాజసేవలో నారితేరినవారే![1] శ్రీ హైదరీగారార్థిక మంత్రిపదవిని సర్ గ్లాంసీ తదనంత రము స్వీకరించి యప్పటినుంచి 1937 సంవత్సరమువరకు నాపదవిని మిక్కిలి సమర్థతతో నిర్వహించిరి. ఇప్పుడు ప్రధానమంత్రిగా నున్నారు.

1 మధ్యమధ్య నప్పుడప్పుడును నవాబ్ మోయినుద్దౌలా బహద్దూరుగారు కూడ కార్యనిర్వాహక సభలో సభ్యులై దేశరాష్ట్రసేవయందు పాల్గొనిరి.

౨

ఈ పదునెనిమిది వత్సరములును రాష్ట్రము యొక్క ఆర్థికస్థితికంతకును, వేయేల సర్వతోముఖాభివృద్ధికిని శ్రీ హైదరీగారి యార్థికవిధానమే ముఖ్యకారణమన జెల్లును. ఈ మధ్యకాలమునందు వీరికి బిరుదావళి యందును నత్యంతగౌరవము వచ్చెను. నవాబైరి. సర్ బిరుదమును వడసిరి. డాక్టరు బిరుదమును మద్రాసు విశ్వవిద్యాలయమువారిచ్చి గౌరవమును పొందిరి. ఎన్ని బిరుదము లున్నను వారికి హైదరీయనుపేరు మిక్కిలి ప్రీతికరమైయున్నది. రాష్ట్రమంతయు నీయన పేరుతో మారు మ్రోగుచున్నది. ఆలీ యిమాముగారి తర్వాత నైదు వత్సరములలో ప్రధానమంత్రిపదవి యనేక వ్యక్తుల నాశ్రయించినట్లు తెలియుచున్నది.[2]

2 సర్ ఆలీయిమాముగారు వెడలిన వెనుక నీ క్రిందివారు ముఖ్యమంత్రి పదవి నలంకరించిరి.

(1) సర్ ఫర్దూనాముల్కుగారు

(2) నేవాబ్ వలీఉద్దౌలాబహద్దూరుగారు.

ఈ కాలమున వెనుకటి యభివృద్ధి యనువర్తించు నట్లు కార్యములు జరుగుచుండెను. కొన్ని యీ కాలమునకు సంబంధించిన ముఖ్య విషయములను స్థాలీ పులాకన్యాయముగా బేర్కొందును.

i. ఉచిత ప్రారంభవిద్య.
ii. న్యాయ కార్యనిర్వాహక శాఖావిభజనము.
iii. నిజాంసాగరు ప్రాజెక్టు.
iv. బీరారు సమస్యా పరిష్కారయత్నము.

వీనిలో కొన్నిటినిగూర్చి రెండేసి మాటలను చెప్పెదను.

**i. ఉచిత ప్రారంభవిద్య :**

శ్రీవారు మిక్కిలి విద్యాప్రియులనియు, రాష్ట్ర విద్యాభివృద్ధి వారి పవిత్రాశయములలో నొకటియనియు, మనకు తెలియును. వెనుక కాలమున విద్యావృద్ధిని మనము చూచియున్నాము. అంతటితో శ్రీవారు తృప్తినొందలేదు. 1920-21 సంవత్సరమున శ్రీవారు తమ సహజౌదార్యముతో ప్రారంభవిద్యను రాష్ట్రమునందంతట

నుచితము గావించుచు ఫర్మానాను ప్రసాదించిరి. విద్యార్థులనుండి వేతనములు తీసుకొనకూడదని నిషేధింపబడెను. రాష్ట్రముయొక్క విద్యాభాగ్యము! దీనితో ప్రారంభవిద్య యెంత యభివృద్ధియయ్యెనో యీక్రింది యంకెలవలన తెలియగలదు.

| సంవత్సరము | స్కూళ్ళు | విద్యార్థులు |
|---|---|---|
| 1919 | 3739 | 157097 |
| 1921—22 | 4280 | 218161 |

[1] విద్యార్థుల సంఖ్య నూటికి 50 వంతున హెచ్చెను. దీనికి తగినట్లు వ్యయముకూడ హెచ్చెను. ప్రాథమిక విద్యావిషయమై యెంత కృషి చేసినను తక్కువే యగును.

1 రాష్ట్రమునందలి రివిన్యూ మొదలగు నున్నతోద్యోగులను వారి యోగ్యతలనుబట్టి నియమించి వారికి రాజకార్యములకు వలయువిద్యనుగరపి తర్ఫీదుచేయుటకై హైద్రాబాదు సివిల్‌సర్వీసు క్లాసొకటి స్థాపింపబడెను. ఇది చాల దూరదర్శిత్వముచే యోచింపబడిన కార్యము. ఏలన, సమర్థులై విజ్ఞానవంతులై, హృదయ వైశాల్యముకలిగి, న్యాయబుద్ధియు, రాష్ట్రప్రీతియుగల యుద్యోగిబృందము రాష్ట్రప్రభుత్వమునకు వెన్నెముకవంటిది.

## ii. న్యాయకార్యనిర్వాహకశాఖా విభజనము:

బ్రిటిషిండియాలో జాతీయ మహాసభ పుట్టిన 1887 సంవత్సరమప్పటినుండి న్యాయప్రభుత్వ శాఖలు రెండును విభజించినగాని ప్రజలకు న్యాయము కలుగదనియు, తత్పరివర్తనమును చేయవలయుననియు, గవర్నమెంటువారిని ప్రార్థించుచు తీర్మానములు గావింపబడుచుండెను. కాంగ్రెసు ప్రభుత్వము వచ్చిన రెండు సంవత్సరములలో గూడ నీ మార్పు జరుగ లేదు. ఇట్టిమార్పు 17 సంవత్సరములకు పూర్వమే యిచ్చట జరిగెను. దీనికిని శ్రీ హైదరీగారే మూలకారణులని ప్రభుత్వ నివేదికవలన తెలియును. సర్ నిజామతుజంగుగారు ప్రధానన్యాయమూర్తిగానున్న కాలమున నీపరివర్తనమును సూచించుచు ప్రభుత్వమునకొక నివేదిక నంపిరి. శ్రీ హైదరీగారప్పుడు న్యాయశాఖా కార్యదర్శిగానుండి యా నివేదికపై తమ యభిప్రాయముతో శ్రీప్రభువు గారికి విన్నప మంపిరి. ఈ పరివర్తనమునకుకూడ శ్రీ హైదరీగారే కారకులగుట వారి పరివర్తనాసక్తిని దూరదర్శిత్వమును వేనోళ్ళ చాటుచున్నది. బ్రిటిషిండియాలో

లేని యనేకకార్యనిర్వహణమునకు శ్రీ హైదరీగారు కర్తలై యీ రాష్ట్రమును ముందంజవేయునట్లు చేసిరి. ఈ మార్పుకూడ శ్రీ ప్రభువుగారి స్వయంప్రభుత్వ కాలముననే చేయబడినను నమలునకు మాత్రము తరువాత వచ్చెను. ప్రభుత్వ నివేదికలోని యీ క్రిందివాక్యమీ విషయమెంత ప్రాముఖ్యము గలదియో తెలియజేయును.

"కార్యనిర్వాహక న్యాయశాఖా విభజనముతో పోల్చిన మిగిలిన సంస్కరణములన్నియు నెందులకును పనికిరావు. బ్రిటిషిండియాలోని 35 కోట్ల ప్రజలిరువదియైదు సంవత్సరములనుండియు నీ సంస్కరణమును కోరుచున్నారనిన, దాని ప్రాశస్త్యము తెల్లమగును. శ్రీ వారి ఫర్మానాను మిక్కిలి కొనియాడవలయును. అది రాష్ట్రచరిత్రమున చిరస్థాయిగా నుండదగినది. ఈ విభజనోద్యమముకూడ శ్రీ హైదరీగారిచేతనే ప్రారంభింపబడినది. వారికి సర్ నిజామతుజంగు బహద్దూరు వారు తోడ్పడిరి."

ఈ సంస్కరణమువలన లాభమేమియని యడుగవచ్చును. ఇంతకు పూర్వము నేరము చేసినవారిని తన

కర్తవ్యము ననుసరించి కేసుపెట్టిన యధికారియే విచారించుట తటస్థించుచుండెను. నిందలారోపించువారే విచారించి శిక్షవేయుటచే ప్రజల కెట్లు న్యాయముకలుగును? నాగరకతగల ప్రతిదేశమునందు నీ సంస్కరణము కలదు! బ్రిటిషిండియాలో మాత్ర మీసంస్కరణ మిప్పుడు వచ్చునట్లు గన్పట్టలేదు. గాంధీగారికి కుడిభుజముగా నెంచబడుచు, రాష్ట్రమంత్రులలో కార్యదక్షులను కీర్తిగడించి, మిగిలిన రాష్ట్రములకు మార్గదర్శిగా వ్యవహరించిన మద్రాసు ప్రధాని శ్రీరాజగోపాలాచారిగా రీ సంస్కరణమునకు వ్యతిరేకులుగ నుండుట మిక్కిలి యాశ్చర్యకరమని చెప్పకతప్పదు. ఈ విషయము మన చరిత్రమున కప్రస్తుతము. కాని యిట్టి సంస్కరణము నిజాంరాష్ట్రమున బ్రిటిషిండియాకంటె ముందు లభించినదన్న నిచ్చటి ప్రభుత్వమునకది తప్పక యొక యోగ్యతాపత్రమన జెల్లును.

iii. నిజాంసాగరుప్రాజెక్టు, iv. టీరారుసమస్యాపరిష్కరయత్నము :

iii. ఈ రాష్ట్రముగుండ లెక్కలేనన్ని నదులును నుపనదులును ప్రవహించుచున్నవిగాని రాష్ట్రమున

కాటకము! ఈరాష్ట్రమున చాలభాగ మీనదుల కాన కట్టలను కట్టిన మాగాణమై రాష్ట్రము నాగరికమై కాటకము లరికట్టబడునని తెలిసినవారనుకొనిరి. మూసీ యీసాల నరికట్టి యీవిషయమున కొంత శ్రద్ధ వహించిన శ్రీ ఆలీనవాజ్ జంగుగారీ విషయమునగూడ తగు ప్రయత్నములుచేయ ప్రారంభించిరి. ఇంతలో మైసూరు రాష్ట్రమున శ్రీసర్ యమ్. విశ్వేశ్వరయ్యగారి నాయకత్వమున కావేరీ నది యరికట్టబడి, కృష్ణరాయ సాగరమను నొక గొప్ప చెరువు త్రవ్వబడి, యారాష్ట్రము సస్యసమృద్ధ మొనర్పబడెను. ఇది యిచ్చటి యింజనీర్ల యొక్కయు, రాష్ట్రాభ్యుదయ వాంఛగలవారి యొక్కయు, దృష్టిని త్రిప్పెను. శ్రీ విశ్వేశ్వరయ్యగారి సలహాకూడ గ్రహింపబడెను. "మంజీర" (మాంజ్రా) యను గోదావర్యుపనదీప్రవాహము నరికట్టి యొకగొప్ప చెరువు త్రవ్వినయెడల, కొన్ని లక్షల యెకరములు మాగాణమై దేశము సస్యసమృద్ధమగుననియు, నట్లు చేయబడిన నీ రాష్ట్రమునందలి కొన్ని యితరచెరువులు కూడ నుపయుక్తములగుననియు నంచనాలు వేయబడెను. తుదకు పోచారం నిజాంసాగరు ప్రణాళికలు తయారు గావింపబడి శ్రీ ప్రభువువారి యంగీకార

మును వడసెను. పనికూడ వెంటనే ప్రారంభింపబడెను. కాని యది యొక్క సంవత్సరమున నగునదికాదు. పూర్తి యగునప్పటికి కొన్ని వత్సరములు పట్టెను. ఇంత గొప్పపనిని ప్రారంభించునట్టి యుత్సాహము, నిర్వహించునట్టి శక్తియు గల శ్రీయాలీనవాజుజంగు వంటి యింజనీరుండుటయు, నట్టివారు చేయుపనిని మెచ్చుగల ప్రభువులుండుటయు నీరాష్ట్రి భాగ్యము! ఒక్కమారీప్రాజెక్టుకు సంబంధించిన లెక్కలను పరి కించినయెడల దానిమహత్వము తెల్లముకాగలదు. ఇది హిందూదేశమునందలి నీటి పారుదల ప్రాజెక్టులలో ముఖ్యమైనది. 8,376 చతురపుమైళ్ళ విస్తీర్ణములోపడు జలమును గ్రహించు నది యీ స్థలముగుండా ప్రవ హించును. ఈ రిజర్వాయరులోని నీటి విస్తీర్ణము 58 చతురపుమైళ్ళు. ఈచెరువునుండి ప్రవహించు కాలువల పొడుగు 1000 మైళ్లు. ఈప్రాజెక్టు పూర్తియగుట కెనిమిది వత్సరములు పట్టెను. 19,000 మంది పనివాండ్రీపనిని నిర్వర్తించుటలో నుపయుక్తులైరి. అడ్డముగాకట్టిన గోడ ఎత్తు115 అడుగులు, పొడుగు 3 మైళ్ళు. 20 లక్షలటన్నుల సున్నము, రాయివగైరా పట్టెను. ఇందుక్రింద 275000 ఎకరములు మాగాణి సాగగుట కవకాశమున్నది.

354 గ్రామములకు ప్రయోజనము కలుగును. దీనికి 427 లక్షల రూప్యములు వ్యయమయినవి. సాలునకు 46 లక్షల రూప్యములాదాయము తేగల శక్తికలదు. ఇంత ఘనకార్యము చేసి, రాష్ట్రముయొక్క యార్థికాభి వృద్ధికి తోడ్పడిన శ్రీప్రభువువారికి రాష్ట్రమంతయు కృతజ్ఞము. ఈపనితో వెనుకనున్నట్టి యీక్రింది వాక్యములు దాదాపు నిరర్థకములైనవి.

"Throughout the Dominions flow large rivers in uncontrolled flood, while the population suffers from draught and famine"

ఇదిగాక శ్రీవారి రాజ్యకాలమున జరిగినవానిలో ముఖ్యమైన యీక్రింది నీటి పారుదల వసతులను కూడ ప్రశంసించుట యప్రస్తుతముకాదు.

| పేరు. | వ్యయము. |
|---|---|
| పాలేరు చెరువు | 24 లక్షలు |
| వైరాప్రాజెక్టు | 25 ,, |
| పోచారం చెరువు | 32 ,, |

మొత్తముమీద నీనీటిపారుదల సౌకర్యము కొరకు శ్రీవారి కాలమున 7 కోట్ల రూపాయలు

వ్యయమొనర్పబడినవి. "సర్వేజనాస్సుఖినోభవంతు" అను సామెతను శ్రీ వారాచరణలో చూపినారు. వీరారు సమస్యనుగూర్చి ప్రత్యేకాధ్యాయము వ్రాయబడును. వాక్స్వాతంత్ర్యమునుగూర్చి ముందు వ్రాతును.



జాగీర్దార్ల కళాశాల

3

i. జాగీర్దార్ల కాలేజి :

వెనుకటి ప్రత్యేక విషయములుగాక మరికొన్ని టిని పేర్కొనవలసి యున్నది. శ్రీవారు ప్రభుత్వము నకు వచ్చినతరువాత తమ రాజ్యమునందలి జాగీర్లను గూర్చియు, జాగీర్దార్లను గూర్చియు, శ్రద్ధవహించిరని వెనుక ముచ్చటించితిమి. జాగీర్ల సత్పరిపాలనకొరకు కోర్టుఆఫ్‌వార్డ్సును నియమించిన వెనుక జాగీర్దార్ల విద్యావిషయమున దృష్టి మరల్చిరి. తమవలెనే జాగీర్దార్లు కూడ నొక్కొక్కరు కొంత రాజ్యభాగముపై, కొందరు ప్రజలపై, ప్రభుత్వము చేయవలసియున్నందున వారువిద్యావంతులగుట యవసరము. కావున, వారి విద్యాసౌకర్యముల కొఱకును, వారిని విద్యావంతులనుచేసి తన్మూలమున సత్పరిపాలనా సమర్థులుగ చేయుటకును నొక కళాశాలను స్థాపించి, వారికి విద్య గరపుట యవసరమయ్యెను. అందుచే 1923-24 సంవత్సరమున జాగీర్దార్ల కళాశాలను స్థాపించిరి. దాని వ్యయము జాగీర్దార్ల యాదాయమునుండి వచ్చున

ర్లేర్పాట్లు గావించిరి. వారి క్రైరోపీయులచే తర్ఫీతిప్పించుట సమంజసమని తలంపబడెను. అందుచేత విద్యాశాఖలో పేరుపొందిన షాక్రాసనుదొరగారి కళాశాలకు మొదటిప్రిన్సిపాలుగా చేయబడిరి. ఇప్పటికిని నీ కళాశాల మిక్కిలి ప్రశంసాపాత్రముగా పనిచేయుచున్నది. ప్రస్తుత ప్రిన్సిపాలుగా రగు టర్నరు దొరగారు కాలేజీ సంప్రదాయములను జాగ్రత్తగా కాపాడుచు శ్రద్ధ వహించుచున్నారు.

**ii. సాంకేతిక పారిశ్రామికవిద్య :**

సాంకేతిక పారిశ్రామికవిద్యయొక్క యవసరమును, నట్టి విద్య నొసగుట కొందరికి వృత్తులను కల్పించుటయేగాక రాష్ట్ర పారిశ్రామికాభివృద్ధికి తోడ్పడుననియు శ్రీవారు గ్రహించిరి. అట్టి విద్యాలయమున పరిశోధనలు చేయుటకును, వివిధపరిశ్రమలలో తర్ఫీతు పొందుటకును నవకాశముండవలెను. బ్రిటిషిండియాలో లభించని యవకాశము నీరాష్ట్రమునందలి టంకసాల కర్మాగార మొసంగుచున్నది. కావున నా కర్మాగారమున కనుబంధముగా నొక టెక్నికలు పాఠశాల నేర్పరచుట సులభసాధ్యమయ్యెను. అందుచే

నీ కాలమున "నూస్మానియా టెక్నికలు పాఠశాల" యను పేర నట్టి విద్యను తత్సంబంధమగు తర్బీతును నిచ్చుటకై యొక పాఠశాలను స్థాపించునట్లాజ్ఞాపించిరి. విద్యుచ్ఛాఖ మొదలగు ననేక శాఖలందు విద్యార్థులను తయారు చేయుచు నీ విద్యాలయము ప్రశస్తమైన పని చేయుచున్నది. ఇందు తయారైన విద్యార్థులు నిరుద్యోగులుగ తిరుగకుండ వృత్తులు లభించి రాష్ట్ర పరిశ్రమోన్నతికి పాటుపడుచున్నారు. ఈ సంస్థ యిప్పుడు కళాశాలగా చేయబడి సమర్థుడైన ప్రిన్సిపా లధ్యక్షతక్రింద మిక్కిలి ప్రశంసను పొందుచున్నది. ఇట్టివి బ్రిటిషిండియాలో కూడ మిక్కిలి స్వల్ప సంఖ్యాకములుగా నున్నవి.

iii. పరిశ్రమాభివృద్ధి :

రాష్ట్రమునందలి చాలా భాగము నదీ మాతృక గాక దేవమాతృకగా నున్నది. నదీ మాతృకగానున్న భాగముల యభివృద్ధికొరకు జరిగిన పని వెనుక విన్నవించితిని. దేవమాతృకగానున్న భాగములందు పంటల నటుంచి జనులు త్రాగుటకు నీరుకూడ కరువుగా నుండెను. శ్రీవారి ప్రభుత్వ మీవిషయమును గ్రహించి,

దానిని దిద్దుటకై యత్నములను గావించి, గ్రామము లందు బావులను త్రవ్వించుట ప్రారంభించిరి. ఇట్లు ప్రతి సంవత్సరమును నిప్పటికిని బావులు త్రవ్వబడుచునే యున్నవి. వీనివలన నీగ్రామముల కొకవరదానమిచ్చి నట్లయ్యెను. కొన్ని స్థలముల నీ బావులను పంటల కుపయోగపడునట్లుకూడ చేసిరి. ఇప్పటికి కొన్ని వేల బావు లిట్లు త్రవ్వబడినవి. ఇదియొక యెన్నదగిన విషయము.

హైదరాబాదు రాష్ట్రమున ప్రత్తిపండు భాగములు చాలగలవనియు, నీప్రత్తిపంట కొరకై ప్రభుత్వమువారు తమ పారిశ్రామికశాఖద్వారా చాలా శ్రమపడుచున్నారనియు, మనకు తెలియును. ఇంతప్రత్తి పండుచున్నను రాష్ట్రము విదేశవస్త్రములను వాడుట మిక్కిలి శోచనీయము. ఈవిషయమును శ్రీహైదరీగారు కనుగొని, యింతప్రత్తిపండు రాష్ట్రమున గుడ్డలనేత యంత్రములు లేకపోవుట తప్పని యెంచి, యట్టివానిని రాష్ట్రమునందలి నాల్గుస్థలములయందు స్థాపించునట్లు తీర్మానించిరి. నాందేడు, హింగోలీ, వరంగలు, లాతూరను ప్రత్తిపండు భూములమధ్యనుండు నాల్గు స్థలము

లేరబడెను. ఇదివరకే యీ పట్టణములకు దగ్గర చాల సంఖ్యగల దూదిమరలు కలవు. 1923 సంవత్సరమున నాందేడు పట్టణమున "ఉస్మాన్‌శాహీమిల్ల"ను పేర నొక నేతయంత్రశాల స్థాపింపబడెను. ప్రభుత్వము సాక్షాత్తుగా వ్యాపారముచేయుట మంచిదిగాదనియెంచి కర్రింభాయి ఇబ్రాహింసన్సు వారి యాజమాన్యమున నుంచబడెను. కాని యందు నిజాంప్రభుత్వమునకే యెక్కువ భాగములుకలవు. ఇట్లు వి త్తనము నాటబడిన యుద్యమము సఫలమై, మరియొక స్థలములోకూడ నట్టి నేతయంత్రశాల స్థాపింపబడి పనిచేయుచున్నది. వరంగల్లునందలి "ఆజంజాహీమిల్లు" మిక్కిలి ప్రశంసాపాత్రమైయున్నది. ఇవియేగాక ప్రైవేటు మ్యానేజు మెంటుననున్న యితర నేతయంత్రశాలలును కలవు వీనిలో గుల్బర్గాలోనిదిని, సికింద్రాబాదునందలి రాంగోపాలు ముస్త్యాల వెంకటక్రిష్ణయ్యగారి యంత్రశాలలు ప్రశంసింపదగియున్నవి.

ఈరాష్ట్రమున షహాబాదను నొక నగరము కలదు. కడపయందు లభించురాతితో నీ షహాబాదున దొరకురాయి పోటీచేయుచున్నది. ఈ షహాబాదు

రాయి సిమెంటుగా చేయుట కుపయుక్తమగునని పరి శోధనములవలన తెలిసి, యచ్చట సిమెంటును తయారు చేయు యంత్రమొకటి స్థాపించిన లాభకరముగనుండు నని యంచనా వేయబడెను. అట్టి సిమెంటువ్యాపారము లాభకరమగుటయే గాక, నగరవీధుల నిర్మాణమునకుగూడ నుపయుక్తముకూడ నగును. కావున నట్టి యంత్రస్థాపన మునకై సాయముచేయుటకు నిశ్చయింపబడెను. ఈ సిమెంటు కర్మాగార మిప్పుడు మిక్కిలి ప్రసిద్ధినొంది నగరరథ్యా నిర్మాణమునకు సహాకారియై లాభము గడించుచున్నది. ఇప్పుడు గృహనిర్మాణమునందుప యోగింపబడుచున్న సిమెంటు కాంక్రీటుపద్ధతివలన నీ పరిశ్రమయొక్క ప్రాముఖ్యము హెచ్చినది. ఈ ఫ్యాక్టరీ యింకాధికాభివృద్ధియగునట్టి సూచనలు కన్పట్టుచున్నవి. ఇచ్చట షహాబాదురాయి యొక్క యవిచ్ఛిన్నలబ్ధి యీ పరిశ్రమ కూత యొసగినది.

రైలు మార్గముకూడ నీకాలమందు విస్తీర్ణమం దభివృద్ధినొందెను. ఖాజీపేట బలార్షా మార్గము, హైద్రాబాదు మన్మాడు మార్గము, హైద్రాబాదు కర్నూలు మార్గములో కొంతభాగము, పూర్ణా హింగో

లీమార్గము, మొదలగు భాగములు పనిచేయుచు, రైలు కంపెనీ యాదాయమును, తన్మూలమున రాష్ట్రాదాయమును హెచ్చించెను.

**iv. వాక్స్వాతంత్ర్యము :**

ఈ విషయము వెనుక నుల్లేఖించితిని. ఈ కాలమున బ్రిటిషిండియాలో పరిస్థితులు సరిగ లేకుండెను. ప్రజానాయకులు కొంతకాలము క్రిందటనుండి స్వపరిపాలనమును కోరుచుండిరి. బ్రిటిషు ప్రభుత్వమువారును ప్రజల యభీష్టమునుతీర్ప నుద్యుక్తులైయే యున్నట్లు కన్పట్టెను. కాని ప్రజలకు తగిన యనుభవము లేకపోవుటచే సక్రమాభివృద్ధిని పొందగల్గినట్టియు, ప్రజల కనుభవము కల్గునట్లు చేయునట్టియు, కొన్ని యధికారములు మాత్రమే వశముచేయునట్టియు, నొకరాజ్యాంగ ప్రణాళికను తయారుచేసి దానిని ప్రసాదించిరి. దానిని "మాంటాగూ చెంస్‌ఫర్డు ప్రణాళిక" యని పిలచుచుండిరి. నాయకులకిది తృప్తికరముగ లేకపోయెను. ప్రజానాయకత్వమునగూడ మార్పు కల్గెను. మహాత్మా గాంధీగారు నాయకత్వమువహించి, శాసనోల్లంఘనమను నొక నూతనతత్వ మమలునందుంచిరి.

దానినే సత్యాగ్రహమనికూడ పిలుచుచున్నారు. చుట్టు పట్ల నిట్టివాతావరణము రాజకీయముగ నాందోళన మున నుండుటచే, నా గాలి సంస్థానములకుగూడ కొట్టు నట్లుండెను. ఈరాష్ట్రముచుట్టును నీసత్యాగ్రహము ప్రబలియుండెను. అప్పటికి 10 సంవత్సరముల క్రిందటనే శ్రీవారి పాలనముక్రింద రాష్ట్ర మభివృద్ధిపొందుచుండెను. ఇట్టి తరుణమున ప్రజలలో నలజడి కలిగినయెడల జరుగుచున్న మంచికార్యముల కాటంకము కలుగుటయే గాక పరిస్థితులు విషమించును. కావున నీ రాష్ట్రము నీ యాందోళనమునుండి రక్షింపవలసియుండెను. శ్రీవారును వారి సలహాదారులును సంప్రతించి 1921 సంవత్సరమున వాక్స్వాతంత్ర్యమునకు సంబంధించిన నియమావళిని ప్రకటించిరి. దానివలన ప్రజలు చిత్తమునకు వచ్చినట్లు మాట్లాడుటగాని, సంఘములను స్థాపించుటగాని, చేయకుండ కట్టుదిట్టముల నేర్పరచిరి. ఈ నియమావళిని ప్రకటించుచు శ్రీవారొక ఫర్మానాను ప్రసాదించిరి. ఎట్టి సంఘమును స్థాపించుటకుగాని, సభను జరుపుటకుగాని, ప్రభుత్వమువారి యనుమతి యవసరమని తెలుపబడెను. ఈ నియమము మూలమున నీ రాష్ట్రమునకు బయటిగాలి తగులకుండ

చేయబడెను. ఇది ప్రజల సక్రమకార్యముల కడ్డు వచ్చుటకు కాదని స్పష్టము చేయబడెను. ఎట్టి హక్కున కైనను సరిహద్దులుండవలదా? బ్రిటిషిండియాలో ననుసరింపబడిన సత్యాగ్రహతత్త్వము దేశమున కెంత యుపకృతి యొనర్చెనో దేశచరిత్రమును చదివిన తెలియనగును. ఈ సూత్రమునకు కర్తయగు శ్రీ గాంధీగారే యది దుష్టద్వారముల ప్రసరించుచున్నదని ప్రకాశముగా నొకప్పుడు చెప్పినారు. ఇంతకంటె వేరు సాక్ష్యము వలయునా? ఏదియైనను పురికొల్పుట సులభముకాని యాపుట కష్టసాధ్యము. ఈ తత్త్వము భార్యా భర్తలకు, తండ్రికుమాళ్ళకు, పాలితపాలకులకు, స్వామిభృత్యులకు, మధ్య మనస్తాపము కల్గించుటలో నుపయోగపడుచున్నది. ఇట్టి పరిస్థితులనుండి రక్షింపబడుట యీ రాష్ట్రభాగ్యము.

**V. మతకలహములు :**

ఈ రాష్ట్రమున ననాదినుండియు నన్ని మతముల వారును సోదరభావముతో నుండుట యాచారమైయుం

డెను. [1]ఆ యాచార మీరాష్ట్రమున కొక గర్వకారణ మగుచున్నది. రాజులు ముసల్మానులైనను ప్రజలకు సంపూర్ణ స్వాతంత్ర్యము మతావలంబమున కలదు. కాని యీ మతావలంబకులలో మూఢావేశమువలన కొందరు హద్దుమీరుట యప్పుడప్పుడు తటస్థించును. ఈవిషయమునను బ్రిటిషిండియాకంటె నీరాష్ట్రము గర్వింపవలసి యున్నది. రాజదేశభక్తులను ప్రజలలో కలుగజేయుట ముఖ్యము. ఈ రాష్ట్రమునందలి ప్రజలు మొదటినుండియు నీ రాష్ట్రముపైనను, పాలకులగు నసఫ్జాహీ కుటుంబముపైనను, సంపూర్ణభక్తి కలిగియుండిరి. కాని 1923_24 సంవత్సరమున గుల్బర్గాలో లింగాయతులకును ముసల్మానులకును వైరముద్భవిల్లి మతకలహములు జరిగెను. అది కారణముగ కొన్ని మత సంస్థలకు హానికల్గెను. కాని ప్రభుత్వమువారు పోలీసువారి యొక్కయు, సైన్యముయొక్కయు, సహాయముతో వాని

1 " It was a wonderful fact that the Hindus and Mussulmans live side by side like sugar mixed in milk "

—" *My life* " *P. 110.*

నణచి శాంతిని నెలకొల్పిరి. ఇకముందు జనసంఖ్య యెక్కువగానున్న పట్టణములయందు శాంతి స్థాపనమునకై కొంత సైన్యమును సిద్ధముగ నుంచునట్లు శ్రీవారు ఫర్మానాచే నాజ్ఞాపించిరి. ఇప్పు డట్లుంచబడి యున్నది. అప్పటినుండి యిటీవలివరకు నిట్టి యలజడి లేకుండెను. 1937 సంవత్సరము తరువాత మరలకొందరి మతావేశపూరితోపన్యాసములవలన పరిస్థితులు విషమించినను, ప్రభుత్వమువారు తగు శ్రద్ధ వహించి, సాధ్యమైనంతవర కట్టివి మరల సంభవించకుండ శాసనముల చేతను, రాజకీయ సంస్కరణ ప్రదానము చేతను, సమకూర్చియున్నారు. ఇకముందిట్టివి తటస్థింపవని నమ్మవచ్చును.

### vi. రాజ్యాభివృద్ధి :

రాజ్యాభివృద్ధి కార్యములన్నియు కొనసాగుచునే యుండెను. విద్యావ్యాప్తి జరుగుచునే యుండెను. ఉస్మానియా విశ్వవిద్యాలయమున నూతన తరగతులు స్థాపింపబడి యితర విశ్వవిద్యాలయములతో సమానము చేయబడెను. చెరువులు మరమ్మతు చేయబడుచునే యుండెను. క్రొత్త ప్రాజెక్ట్లు కంచనాలు వేయబడుచునే

యుండెను. ఉద్యోగులలో లంచగొండితనము నిర్మూలింపబడుచునే యుండెను. పారిశ్రామికముగ చేయవలసిన పనులన్నియు చేయబడుచునే యుండెను. నగరాభివృద్ధికార్యములును నారోగ్య పారిశుధ్య శాఖా కార్యములును సక్రమముగా నెరవేర్పబడుచునే యుండెను. ఉద్యోగులద్వారా ప్రజలవాంఛితములు కనుగొనబడుచు దానిని తీర్చుటకు ప్రయత్నములు సల్పబడుచునే యుండెను. ప్రాచీనవస్తురక్షణశాఖ చారిత్రక విషయములయం దవలోకనము చేయుచు, ప్రాచీన శాసనములను త్రవ్వియెత్తుచు, ప్రాచీన చారిత్రక వస్తువులను సంరక్షించుచు తన కర్తవ్యమును నిర్వర్తించుచునే యుండెను[1]. భవననిర్మాణమునందు ద్రవ్యము వ్యయమగుచునే యుండెను. ముఖ్యమైన కట్టడములన్నియు నిర్మాణము పూర్తియై పట్టణమును సుందరమొనర్చెను.

1 ఇటీవల కొండాపురప్రాంతమున ప్రాచీననగర మొకటి వెల్వడెను.

(ఆంధ్ర. 31-5-41)

### vii. శ్రీవారికి "విద్యాచక్రవర్తి" యను బిరుదు :

శ్రీప్రభువువారు మిక్కిలి వాఙ్మయప్రియులును స్వయముగ కవులునై యున్నారు. వారి ఫర్మానాలను మాతృకలలో చదువుట యొక విందువంటిదని తెలిసిన వారు భావింతురు. వారు తమ మహోన్నత భావములను తోచినప్పుడు కవితారూపమున ప్రచురించు చుందురు. వారి మతసహనమునకు "యేసుక్రీస్తు"పై వారు వ్రాసిన గీతములే యుదాహరణములు. విద్య వారియభిమాన విషయములలో నొకటి. ఇట్టి సందర్భములో నూస్మానియా విశ్వవిద్యాలయమని శ్రీవారి పవిత్రనామముతో బరగు సంస్థ, 1923 సంవత్సరమున శ్రీవారికి "వాఙ్మయచక్రవర్తి" యను బిరుదము నొసంగి తనను తాను గౌరవించుకొనుట మిక్కిలి ప్రశంసనీయము. ఈవిషయము విశ్వవిద్యాలయ జీవనమున నొక గొప్పదియై తన పనిని సార్థకపరచుకొనుట యైయున్నది. ఈ కాలము పూర్తియగుసరికి విద్యావ్యాప్తి యెంత యభివృద్ధియయ్యెనో యీ క్రింది యంకెలు తెలుపగలవు.

| | పాఠశాలల సంఖ్య | విద్యార్థి సంఖ్య |
|---|---|---|
| ప్రాథమిక | 4063 | 2,36,684 |
| మధ్యమ | 49 (కొ్రత్తవి) | 32,906 |
| ఉన్నత | 20 | 8,048 |

విశ్వవిద్యాలయముతో కలిపి ధనవ్యయము 21,55,868 రూప్యములు. సంస్థానములలో నేదియు నింత విద్యా వ్యయము చేసియుండలేదు. శ్రీవారి విద్యాప్రియత్వమున కింకేమి తారాౙణము కావలయును ?

---

# 1926 — 1937

## ౧

**రీడింగు ప్రభువు, హైద్రాబాదు :**

**1923** సంవత్సరమున నప్పటికి వైస్రాయియగు లార్డురీడింగుగారు హైద్రాబాదు సంస్థానమునకు దయ చేసిరి. రీడింగు ప్రభువుగారు గొప్ప న్యాయవేత్త యని ప్రతీతి. ఈయన వైస్రాయిగా వచ్చినప్పటినుండి సంస్థానములకును, నిండియా గవర్నమెంటువారికిని, నుండు పరస్పర సంబంధమును గూర్చియు, నితర విష యముల గూర్చియు, కొంత చర్చ ప్రారంభమయ్యెను. ఈ చర్చ జరుగుచుండగనే యీయన యిచ్చటికి వచ్చుట తటస్థించెను. వచ్చినప్పుడాయనకు వలసిన సౌకర్యము లన్నియు సమగ్రముగా గావింపబడెను. ఆయనయు సంతృప్తుడే యయ్యెను. శ్రీ సర్ అక్బరు హైదరీగారు వారి స్వాగత సందర్భమున వలసిన యత్నములన్నియు నెట్టిలోటుపాట్లును లేకుండ చూచుటకు నియమింపబడి, తమ కర్తవ్యమును చక్కగా నిర్వర్తించి, ప్రభువుగారి మన్ననల నందిరి.

వీరు మరల నిటీవల "ఎల్లోరా యజాంతా" చిత్రములను దర్శించుటకై దయచేసిరి. శ్రీవారప్పుడు వారి సౌకర్యముల కొరకై శ్రీహైదరీగారిని నియుక్తుల గావించిరి. వారును రీడింగుప్రభువుగారికి వలయునట్లు తృప్తికరముగా నన్నివిషయములను నిర్ణయించిరి. ఇట్లీ సంస్థానముయొక్క యాతిథ్యమును రెండుమారులు గ్రహించిరి. సంస్థాన మెట్టిలోపములు చేసియుండలేదు.

వీరు న్యాయశాస్త్రవేత్తలని వెనుక మనవి చేసియుంటిని. ఆ కారణముచేత సామ్రాజ్యమునకును, సంస్థానములకును నుండు సంబంధములను శాశ్వతము లగు సూత్రములపై నిర్ణయించుట యర్హమని తలంచెను. అందుచేత సంస్థానములలో కొంత యలజడి కలిగెను. హైదాబాదు విషయమున రెండు విశేషములు కలవు.

(1) బ్రిటిషు ప్రభుత్వము మన ప్రభువుగారిని మిత్రముగా గ్రహించి "మహాఘనతవహించిన" యను బిరుదము నొసంగుట.

(2) అంతః ప్రభుత్వవిషయముల నితర సంస్థానములకువలెగాక దీనికి సిక్కా, పోస్టు మొదలగు కొన్ని ప్రత్యేక హక్కులుండుట.

పై రెండుకారణములచే మిగిలిన సంస్థానములకంటె నీ సంస్థానమునకు సార్థక్యము కలదని యిచ్చటివారు తలంచుచుండిరి. దీనికి మరియొక విషయము సహకారియయ్యెను. శ్రీ ప్రభువువారు మిక్కిలి దేశభక్తి కలవారు. అందుచే నిచ్చటి స్థానికులను సమస్తశాఖా కార్యములయందును నియమించవలెనని తలంచి తచ్ఛాఖలలో తర్బీతును పొందుటకు నియమించిరి. ఆ కార్యములను నిర్వర్తించుచున్న విదేశీయుల యుద్యోగపరిమితకాలము ముగిసినతరువాత వానికి స్థానికోద్యోగులను నియమించుచుండిరి. ఇందుచే ముఖ్య శాఖలన్నియు దేశీయుల హస్తగతము లయ్యెను. విదేశీయుల హక్కు లనుకొనబడుచున్న యుద్యోగములు దేశీయ హస్తగతమగుట యిండియా ప్రభుత్వము నాకర్షించెను. వెనుకటివానికిది సాయమొనర్చెను. ఈ పరిస్థితు లన్నియు శ్రీవారికిని రీడింగు ప్రభువుగారికిని యుత్తరప్రత్యుత్తరములకు కారణములయ్యెను. 1925

(20-9-1925) సంవత్సరమున శ్రీవారీ విషయములను, మరియు బీరారు పునర్గ్రహణమును గురించియు, నుగ్గడించుచు వైస్రాయిగారి కొక యుత్తరమును వ్రాసిరి. (ఈ విషయము తరువాత విపులముగా చర్చింతును.) దానికి దాదా పారు మాసములకు తరువాత 1926 (27-3-1926) సంవత్సరమున రీడింగు ప్రభువుగారు జవాబును దయచేసిరి. ఈ ప్రత్యుత్తరము శ్రీవారికిని వారి ప్రజలకును మిక్కిలి నిరుత్సాహము నిచ్చెను. ఇండియా గవర్నమెంటును, హైద్రాబాదు రాజ్యమును సమాన కక్షలోనివనియు, నందుచే నీ రాజ్యమునకు సార్వభౌమ ప్రభుత్వముతో నుత్తరప్రత్యుత్తరములు జరుపుట కధికారము కలదనియు, నీ రాజ్య మిండియా గవర్నమెంటుకు లోబడినదికాదనియు శ్రీవారి వాదము. రీడింగు ప్రభువు వ్రాసిన యుత్తరమందలి యీ క్రింది భాగము ననువదించుట యప్రస్తుతముకాదు.

"The sovereingnty of the British crown is supreme in India, and therefore no ruler of an Indian state can justifiably claim to negotiate with the British Government on an equal footing. Its Supremacy is not based only upon

treaties and engagements, but exists independantly of them, and quite apart from its prerogative in matters relating to foreign powers and policies. It is the right and duty of the British Government, while scrupulously respecting all treaties and engagements with the Indian states, to preserve peace and good order throughout India. The Consequences that follow are so well-known and as clearly apply no less to your Exalted-Highness, than to other rulers, that it seems hardly necessary to point out. I will merely add that the title "Faithful Ally" which your Exalted-Highness enjoys has not the effect of putting your Government in a category separate from that of other states under the paramountcy of the British Crown."

ఇట్టి వాక్యములు నిరుత్సాహకరములయ్యెనని వేరుగా చెప్పవలయునా? ఈ యుత్తర ప్రత్యుత్తరముల పరిణామముగా రాజ్యాంగమునను, నుద్యోగ నియామకమునను కొన్ని మార్పులు చేయవలసివచ్చెను. అట్టి మార్పులలో రెండు ముఖ్యముగ గమనింపదగినవి.

(1) మహారాజా కిషెన్ ప్రసాద్ బహద్దూరు వారిని ప్రధానమంత్రిగా నియమించుట. ఇది వ్యక్తిగతమైన నియామకము.

(2) రివిన్యూ పోలీసు శాఖలను బ్రిటిషిండియా నుండి పంపబడు సమర్థులై యనుభవముగల యధికారులక్రింద నుంచుట.[1]

రెండవ సూత్రము ననుసరించి 1926 సంవత్సరమున సర్ రిచార్డు ట్రెంచి కె. సి. ఐ. ఇ. గారు రివిన్యూ పోలీసుశాఖల మంత్రిగా నియమింపబడిరి. వీరు రాష్ట్రమునకు గొప్ప సేవచేసి యుపకారవేతనమును పొంది యిటీవలనే పరమపదించిరి. వీరి స్థానమున నదివరలో రివిన్యూ డైరెక్టరు జనరలుగానున్న సర్ తియోడర్ టాస్కరుగారీ రెండుశాఖలను మిక్కిలి సమర్థతతో నిర్వహించుచున్నారు. వీరి వెనుకటిస్థానమునకు శ్రీ గ్రాఫ్టన్ ఐ. సి. యస్ గారు నియమింపబడి పనిచేయుచున్నారు.

1 ఇప్పుడు కార్యనిర్వాహకవర్గమున కొన్ని మార్పులు జరుగునని వదంతి వ్యాపించియున్నది.

బీరారు రాష్ట్రమునుగూర్చి మంత్రిసంఘ స్థాపన మైనతరువాత నేమేమి జరిగెనో తెల్పుచు నావిషయమై మరియొక యధ్యాయము వ్రాయదలచినాను. రైల్వే రాజ్యహస్తగత మొనర్చుటకు వలయు ప్రయత్నములు జరుగుచునే యుండెను. రాకుమారు లిద్దరును శుక్ల పక్ష చంద్రుల చందమున సర్వజనాహ్లాదకారులై వర లుచు విద్యాబుద్ధులను తగిన యొజ్జలవద్ద గరచు చుండిరి. శ్రీ హైదరీగారి యార్థికమంత్రిత్వము, శ్రీ మహా రాజావారి ముఖ్యమంత్రిత్వమును రెండుచక్రముల వలె రాజ్యశకటమును సమర్థతతోను, హెచ్చుతగ్గులు లేకుండను, నడుపుచుండెను. మరల మతకలహములు రాకుండ హిందూ ముసల్మాను మైత్రి గట్టిపడు చుండెను.

ఈ కాలమున బ్రిటిషిండియాలో రాజ్యాంగ పరి వర్తనములు జరుగుచుండెను. బాధ్యతాయుత ప్రభుత్వ మను విషయము సర్వజన విదితమయ్యెను. సరిహద్దుల నున్న శబ్దము లోనికి వినిపింపకుండునా? ఈ విషయ మున రాష్ట్రములో జరుగుచున్న గుసగుసలను శ్రీ హైదరీగారు వినిరి. ఇచ్చట పనిచేయుచున్న శాసన

సభను విశాలమొనర్చుట మంచిదని వారు గమనించి, ప్రజలకు ప్రభుత్వమువారి యూహాలు తెలియజేసి శాంతచిత్తులజేయుట మంచిదని యెంచి, యట్టిపని జరుగునను ప్రకటనమును గావించిరి. ఇచ్చటి శాసన సభయొక్క సంగ్రహ చరిత్రము నీక్రింద యిచ్చుచున్నాను.

**శాసన నిర్మాణసభ :**

దీనికి పునాది 1870 సంవత్సరమున వేయబడినది. 1 సాలార్జంగుగారు రాష్ట్రమునకు చట్టములను నిర్మించుటకై మహమ్మదీయ న్యాయవాదుల సంఘము నొకదానిని స్థాపించిరి. తరువాత కొంతకాలమునకు సలహాసంఘమే (Cabinet-Council) శాసన నిర్మాణము జేయుచుండెను. సర్వాధికారమును ప్రభువుగారిలోనే యున్నను, నీ సలహా సంఘము ప్రభుత్వమున శ్రీవారికి సలహానిచ్చినట్లే, చట్టనిర్మాణమునగూడ నిచ్చుచుండెను. తరువాత 1890 సంవత్సరమున న్యాయ సంఘ మొకటి స్థాపింపబడెను. ఈసంఘము హైకోర్టువారి సాయముతో చట్టములు నిర్మించుట మార్చుట మొదలగు పనులను జరుపుచుండెను. తరువాత

1893 సంవత్సరమున నిప్పుడున్న చట్ట నిర్మాణసభ యేర్పడెను. అందు ప్రస్తుతము అధ్యక్షోపాధ్యక్షులు గాక 23 రు సభ్యులు గలరు. వీరిలో ముగ్గురధికార రీత్యాసభ్యులు. అనగా ప్రధాన న్యాయమూర్తి, న్యాయశాఖా కార్యదర్శి, న్యాయసలహాదారు. మిగిలినవారిలో తొమ్మిదిమంది యధికారులనుండి నిర్ణయింపబడుదురు. మిగిలిన 11 మంది యనధికారసభ్యులు. వీరిలో నిద్దరు జాగీర్దార్లప్రతినిధులు. ఇద్దరు న్యాయవాదుల ప్రతినిధులు. మిగిలిన యేడ్గురును నీ క్రింది విధముగా సభ్యులగుదురు.

| | | |
|---|---|---|
| (1) హైదరాబాదు మునిసిపాలిటీ | 1 | (ఎన్నిక) |
| (2) జిల్లాస్థానికసంస్థలు | 2 | (ఎన్నిక) |
| (3) అధ్యక్షునిచే నియమితులు ఒకొ్కకరొకొ్కక పాయగాకు | 4 (నియామకము) | |
| | 7 | |
| ప్రజాసామాన్యము పక్షమున స్పెషలు (న్యాయవాది, జాగీర్దార్ల ప్రతినిధులు) | 4 | (ఎన్నిక) |
| | 11 | |

న్యాయసలహాదా రీ సంస్థకు కార్యదర్శిగా నుండును. రివిన్యూ, మతము, సైన్యము, విదేశాంగము, మొదలగు కొన్ని యంశములయందు చట్టములను నిర్మించుట కీ సభ కెట్టియధికారమును లేదు. చట్టములను నిర్మించుటలో నీక్రింది విషయములు మార్గదర్శకములుగా గ్రహింపవలెను.

(1) మహమ్మదీయ న్యాయశాస్త్రములు
(2) హిందూ ధర్మశాస్త్రములు
(3) ఇచ్చటి వివిధశాఖలవారి ధర్మశాస్త్రములు
(4) ఆచార వ్యవహారములు
(5) జూరిన్ ప్రూడెన్సు

ఎట్టి చట్టమును శ్రీవారి యధికారమున కాటంకముగ నుండరాదు. ఈ విధముగా స్థాపింపబడిన శాసనసభ 19—7—1937 తేదీ వరకు పనిచేయుచుండెను.[1]

ఈ సభలో కొన్ని చట్టములు చర్చింపబడి యంగీకరింపబడెను. చట్టముల పేర్లయందును, వాని నిర్మాణ

1 ఈ శాసనసభయే యిప్పటికిని పనిచేయుచున్నది. నూతన రాజ్యాంగవిధానము వచ్చినతరువాత నిది విపులమై మారిపోవును.

మునందును బ్రిటిషిండియాయందలివి యనుకరింప
బడుచు, స్థానికావసరములకు తగినట్లు మార్పు చేయబడు
చుండెను. ఈ ప్రభువుగారి కాలమున నీ సభ యనేక
చట్టములను నిర్మించెను. అవి యన్నియు నిప్పుడమలులో
నున్నవి. ఎప్పుడేయే చట్టమవసరమో యప్పుడవి నిర్మిం
పబడెను. సివిల్ ప్రొసీజరుకోడు, సహకారచట్టము,
సివిలున్యాయస్థానచట్టము, అడవులచట్టము, రిజిస్ట్రేషను
చట్టము, మొదలగునవి కొన్ని యెన్నదగియున్నవి. ఇటీ
వల వరకు నీ సభ ముందర నిర్బంధప్రాథమిక విద్యా
చట్టమును, బాల్యవివాహ నిరోధ చట్టమును నను
రెండు చట్టములు చర్చలో నుండెను.[1] నూతనముగ
నిటీవల 19—7—1939 తేదీన శ్రీవారు ప్రసాదించిన
నూతన రాజ్యాంగ సంస్కరణముల ననుసరించి
రాబోవు శాసన నిర్మాణసభ యేర్పాటుచేయవలసి
యున్నది. ఇందు వెనుకటికంటె సభ్యులసంఖ్య యభి
వృద్ధిచేయబడి, ఎన్నిక సభ్యులును, నియమితసభ్యు
లును కలసి హిందూ ముసల్మాను సంఘములకు చెరి

1 ఇటీవలనే యీశాసన మధికసంఖ్యాకులచే త్రోసివేయబడెను.

సగముగా నుండునట్లు కావింపబడినది. శాసనసభకు వెనుకటికంటె యెక్కువ హక్కు లియ్యబడినవి. ఆదాయ వ్యయపట్టిక చర్చించుటకుకూడ నధికార మియ్యబడినది. సమస్త రాజకార్యములును హిందూ ముసల్మాను సంఘముల కనుకూలముగ నుండునట్లు ప్రతిశాఖలో నొక సలహాసంఘ మేర్పాటుచేయబడినది. ప్రజల కుండు ప్రాథమికస్వత్వము లవసరమైన విధ మున నొసంగబడినవి. అమలులోనికి వచ్చినగాని వాని సంపూర్ణ పరిణామమును మనము కనుగొనజాలము. కాని యిప్పుడున్న హక్కుల కంటె నెక్కువ ప్రసా దించిరని మాత్రము చెప్పవలెను. అన్ని సంస్థలవారును వానిని సౌహార్దముతో నవలంబించిన పురోవృద్ధికి పునాది వేయబడిన ట్లెంచనగును.

౨

## మహారాజావారి ప్రధానమంత్రిత్వము, సర్ అక్బరు హైదరీ గారి యార్థికమంత్రిత్వము :

ఈ దశవర్షకాలము శ్రీవారిరాజ్యమున కుచ్ఛకాలము. స్వయంపాలనకాలమున నాటబడిన యభివృద్ధి బీజములు మధ్యకాలమున వృక్షములై పుష్పించి యీ కాలమున ఫలించినవి. రీడింగుప్రభువు విధాన మితర విషయముల నెట్లైనను, దానియందు శ్రీ మహారాజా బహద్దూరుగారి ప్రధానమంత్రిత్వము మిక్కిలి యెన్నదగినవిషయము. వారికి శ్రీవారొసంగిన బిరుదమే వారి రాష్ట్రసేవను తెలియజేయుచున్నది. "యామీనుస్సల్తనత్" అనగా "రాష్ట్రదక్షిణహస్తము". తప్పక యీ కాలమున శ్రీ మహారాజా హైదరీగారలు శ్రీవారికి కుడి యెడమ భుజములై వర్ధిల్లెననుటలో నెట్టి పొరబాటును లేదు. వీరికితోడు శ్రీ నేవాబు మెహిదియార్జంగు బహద్దూరుగారు వీరితో కలసిరి. ఇదివరలో శ్రీ నిజామత్ జంగుగారు రాజకీయ మంత్రిగానుండిరి. వా రుపకార వేతనము గ్రహించిన వెనుక తత్ స్థానమునకు వీరిని శ్రీవారు నియమించిరి. వీరు వెనుకటి తరమున రాజ్య

మునకు పునాదియైన శ్రీనేవాబు ఇమాదుల్ముల్క-బహద్దూరుగారి పుత్రులును, ప్రథమ కార్యనిర్వాహక వర్గమునుండి యిప్పటికిని కార్యనిర్వాహక సభలోనుండి రాష్ట్రసేవ చేయుచుండిన నేవాబ్ అఖిల్ జంగ్ బహద్దూరుగారి సోదరులని చెప్పుటతోడనే వీరినిగూర్చి ప్రశంసించుట యగును.

వీరిముగ్గురి సమ్మేళనము రాజ్యపురోవృద్ధికి ముఖ్యకారణమయ్యెను. ముఖ్యముగ రాష్ట్రము రెండు మతములమైత్రి కాటపట్టయ్యెను. శ్రీ మహారాజా బహద్దూరువారు హిందువైనను ముసల్మానుల సంపూర్ణ విశ్వాసమునకు పాత్రులైరి. శ్రీ హైదరీ మేహిదియా ర్జంగుగార్లు ముసల్మానులైనను హిందువుల హృదయ పూర్వక విశ్వాసమునకు పాత్రులైరి. మంత్రాంగమన్న నిట్లుండవలదా! వీరివిధానము రాష్ట్రప్రజల సౌఖ్యము నకు సాధనమయ్యెను. శ్రీహైదరీగారి యంతర్జాతీయాను భవము శ్రీ మహారాజావారి రాష్ట్రీయాభిమానాను భవములతో కలిసి రాష్ట్రాభ్యుదయమును చేకూర్చెను. శ్రీవారి రజతోత్సవమువరకు నీసమ్మేళనము వెలసెను. రజతోత్సవమైన తరువాత శ్రీ మహారాజా బహద్దూరు

వారు విరామము గొన్నప్పుడు రాష్ట్రమునందలి ప్రజ లందరును హిందూముసల్మాను భేదములేకుండ దుఃఖిం చిరి. తరువాత యిబ్బందులన్నియు వారి విరామఫలిత మనువారు కూడ గలరు. ఇటీవలి మతకలహముల సంద ర్భమున నా ముసల్మాను మిత్రులొకరు "వృద్ధమంత్రి గారి విరామముతో రాష్ట్రమున కిక్కట్టుకలిగెను." అని తమ యభిప్రాయమును తెలిపిరి. ఇట్లు శ్రీ మహారాజా వారు హిందూ ముసల్మానుల ప్రేమను చూరగొనిరి. తుదివరకును సమయము వచ్చినపుడెల్ల నీరాష్ట్రీయ ప్రజలకు వారి సలహాలభించుచునే యుండెను. శ్రీవా రును శ్రీ మహారాజావారి గౌరవమును వెనుకటివలెనే కాపాడుచుండిరి. వారుతమ మోటారుబండిలో వెడలు నపుడు వారిబండి చుట్టును మూగునట్టియు, వెంబడించు నట్టియు, ప్రజాసమూహమే వారి దయార్ద్రహృదయ మునకును వారి దీనావన బిరుదమునకును తార్కా ణము. ఇటీవలనే వారు పరమపదించి రాష్ట్రమునకు తీరని కష్టము తెచ్చిపెట్టిరి.

ఏతత్కాల ప్రథమవత్సరమున రాష్ట్రపరిస్థితుల నొకింత వివరించుట యప్రస్తుతము కాజాలదు.

1927 సంవత్సరమున భూమి సుభిక్షముగా ఫలించెను. ఎట్టికరువును లేకపోవుటయేగాక వెనుకటి సంవత్సరము లన్నిటికంటె వర్షపాత మెక్కువగ నుండెను. 31.63 అంగుళముల వర్షముకురిసెను. అందును నకాల మునగాక యీవర్షము సకాలమున కురిసెను. వెనుకటి సంవత్సరములకంటె యెక్కువ విస్తీర్ణముగల పంట భూమి సస్యాఢ్యయయ్యెను. లెక్కలవలన వెనుకటికంటె 37 లక్షల యెకరములభూమి యెక్కువ సాగయ్యెను.

ఇప్పటికి కొలది సంవత్సరములనుండి సర్కారు వారి యెక్సైజు విధానమున నొకమార్పు గావింపబడెను. నిర్ధనులకు త్రాగు డందుబాటులో నుండకుండ చేయుటకై మత్తుపదార్థములపై పన్నధికము గావింపబడెను. దీనివలన మూడు ఫలితములు కలిగెను.

(1) మత్తుపదార్థముల ఖర్చు తక్కువగుట
(2) సర్కారున కాదాయము తగ్గకుండుట
(3) వాని నుపయోగించువారి సంఖ్యతగ్గుట

ఈవిధముగ ధనముండి త్రాగుడుమాన లేనివారి భారమెక్కువై బీదలు బాగుపడుట తటస్థించెను. ఈ

సంవత్సరము ప్రారంభించినపుడు సర్కారు బొక్కస మున 485.74 లక్షల రూప్యములు నిలువయుండెను. సర్కారు లోకులకివ్వవలసిన రుణము 284.51 లక్షలు మాత్రమే యుండెను. తీర్చవలెనని సంకల్పించినవెంటనే తీర్చవచ్చును. కాని యది బాధాకరము కాకపోవుటచే నుంచబడెను. మరియు నీతక్కువరుణము రాష్ట్రాభ్యుద యమును సూచించును.

ఇట్టి సత్కాలమున శ్రీ మహారాజావారు రాష్ట్ర పాలనమును చేపట్టిరి.

**ఆదాయ మార్గములు :**

ఈరాష్ట్రమున కాదాయమువచ్చు మార్గములలో నీక్రిందివి ముఖ్యములు.

(1) భూమిపన్ను
(2) కరోడిగిరీ సుంకము
(3) ఎక్సైజు
(4) రైల్వే యాదాయము
(5) వడ్డీలు

**భూమిపన్ను :**

ఈకాలపు లెక్కలను తనిఖీచేసిన నీ పన్ను ప్రతిసంవత్సరమును పరిస్థితులనుబట్టి క్రమముగా వృద్ధి క్షయము లగుచున్నట్లు కానవగును. ఈ క్రింది యంకె లను గమనింపుడు.

| సం. | మొత్తము. | ఆదాయము. | భూమిపన్ను. |
|---|---|---|---|
| 1927-28 | లక్షలు | 841.59 | 322.10 |
| 1928-29 | ,, | 941.88 | 340.46 |
| 1929-30 | ,, | 851.82 | 301.44 |
| 1930-31 | ,, | 762.33 | 300.00 |
| 1931-32 | ,, | 813.82 | 309.46 |
| 1932-33 | ,, | 806.18 | 310.61 |
| 1933-34 | ,, | 795.27 | 307.95 |
| 1934-35 | ,, | 862.21 | 314.03 |
| 1935-36 | ,, | 905.61 | 337.36 |
| 1936-37 | ,, | 943.32 | 323.97 |

**ఆర్థికాభివృద్ధి :**

పై యంకెలవలన నాద్యంతములం దభివృద్ధియు మధ్యకాలమునక్షైణ్యమును కన్పట్టును. దీనినిగురించి

రెండుమాట లవసరము. 1929 సంవత్సరమునుంచి 1933 వరకును నీదేశమం దంతట నేగాక ప్రపంచమం దంతటను నార్థికదుస్థితి ప్రబలియుండెను. 1919 నాటి ప్రపంచయుద్ధమున కీయార్థికదుస్థితి పరిణామమని రాజకీయవేత్తలందురు. ఏదియెట్లున్నను నా సంవత్సరములు హిందూదేశమునకు నార్థికముగ మిక్కిలి క్షీణకాలమని చెప్పనగును. ఈ సంవత్సరములలో బ్రిటిషిండియా యందలి యార్థికదుస్థితితో నీ రాష్ట్రపరిస్థితులను పోల్చినమన కాశ్చర్యము కలుగకమానదు. బ్రిటిషిండియాలో దేశక్షేమకరములగు పనులన్నియు మానబడెను. ఉద్యోగస్తుల జీతములు తగ్గింపబడెను. కూలివారికూలి తగ్గెను. పనివారి సమ్మెలు ప్రబలెను. ఇట్టి పరిస్థితులలో నీ రాష్ట్రమున నెట్టి యార్థిక దుస్థితియన్నది లేకుండ, క్రొద్ది పన్ను వసూలు తక్కువతప్ప యితరవిధములగు దైన్యము కనపడ కుండుట మిక్కిలి కొనియాడదగినదని చెప్పవలెను. నైజాము రాష్ట్రము క్రొత్తపన్నులు లేకుండ, ఖర్చు తగ్గింపులు లేకుండ, నాదాయవ్యయపట్టికను సమకూర్చుకొన గలుగుటచే యావద్భారత దేశముయొక్క మెప్పును చూరగొనెను. కావున నా సంవత్సరములలోని యాదాయము తక్కువను నిజమైన యభివృద్ధిగానే పరిగణింప

వలసియున్నది. తరువాత క్రమముగా వెనుకటి పరిస్థితులు మరలివచ్చుచున్నట్లు కానవగును.

మిగిలినవాని లెక్కలనుకూడ చూడుడు.

| సంవత్సరము. | కరోడిగిరీ. | ఎక్సైజు. | |
|---|---|---|---|
| 1927-28 | 154.77 | 164.32 | లక్షలు |
| 1928-29 | 157.13 | 163.76 | ,, |
| 1929-30 | 157.58 | 159.40 | ,, |
| 1930-31 | 104.47 | 145.72 | ,, |
| 1931-32 | 84.62 | 154.00 | ,, |
| 1932-33 | 102.54 | 158.44 | ,, |
| 1933-34 | 100.24 | 167.77 | ,, |
| 1934-35 | 91.66 | 167.62 | ,, |
| 1935-36 | 104.67 | 181.57 | ,, |
| 1936-37 | 123.48 | 180.01 | ,, |

పైనయున్న యంకెలవలన నీ క్రింది విషయములు తెలియగలవు.

(1) భూమిపన్ను కొద్దిభేదములతో ప్రతి సంవత్సరము వెనుకముందు లాడుచున్నది. అనగా రైతు వెనుకటి పరిస్థితులు పూర్తిగ మారకుండ కాలముగడపు

చుండెననియు బ్రిటిషిండియాయందలి రైతుస్థితికంటె యిచ్చటి రైతుస్థితి తృప్తికరముగా నున్నదనియు తేట తెల్లమగుచున్నది.

(2) వర్తకము కొంచెము హెచ్చుతగ్గు లగుచు 1929-34 సంవత్సరముల మధ్య చాలా హీనస్థితి యందున్నదనియు, కాని యిదియును బ్రిటిషిండియా యందలి పరిస్థితులందుకంటె తృప్తికరముగానే యున్న దనియు, తరువాత క్రమముగా మరల వెనుకటిస్థితికివచ్చు సూచనలు చూపుచున్నదనియు, తెలిసికొననగును.

(3) ఎక్సైజు ఆదాయ మెంతమాత్రమును తగ్గు సూచనలను చూపుటలేదనియు, 1930, 31, 32, సంవత్సరములలోని తగ్గుదల తాత్కాలిక పరిస్థితులవలన కలిగినదేగాని, ప్రజల చిత్తవృత్తులలో కలిగిన మార్పు వలన కాదనియు, తేలుచున్నది.

(4) మొత్తముమీద నీయార్థికస్థితి, యింటను బయటనుకూడ నాశ్చర్యముకల్గించు నంతటి స్తిమితమున నున్నదని గమనింపగలము.

ఈ యార్థికాభ్యున్నతికి కారణము శ్రీ హైదరీ గారి యార్థిక ప్రతిభయేయని గట్టిగాచెప్పవలసియున్నది.

వారు నూతన పద్ధతి నొకదాని నీ రాష్ట్రమునకు వర్తింపజేసినారు. దానిని పారిభాషిక భాషలో "శాఖాప్రయుక్తార్థిక విభజనము" అని పిలువనగును. ఆంగ్లమున దీనిని "Departmentalisation of Finance" అందురు. దానినిగూర్చి ముందు ముచ్చటింతును.

**శాఖాప్రయుక్తార్థిక విభజనము :**

ఈ పద్ధతి నిజాంరాష్ట్రమున ప్రవేశ పెట్టక పూర్వము బడ్జెటు నిర్మాణమున బ్రిటిషిండియాలోని పద్ధతినే యనుసరించుచుండిరి. ఆ యార్థిక విధానమంత తృప్తికరముగ లేకుండెను. దానినిగూర్చి యార్థిక వేత్తయగు స్ట్రాకీగా రిట్లనిరి.

"రాష్ట్రీయ ప్రభుత్వములు కేంద్ర ప్రభుత్వము నెంత ద్రవ్యసహాయమడుగవలెనో తెలియకుండిరి. ఎంత ద్రవ్యమున్నదో, యెంత యడుగవచ్చునో తెలియకుండనే యడుగుచుండిరి. రాష్ట్రప్రభుత్వము లన్నిటికిని నభివృద్ధికి ధనము కావలసియుండుటచే, తమ రాష్ట్రమునకు వీలైనంత యెక్కువ ద్రవ్యము స్వీకరింపవలెనని ప్రతి రాష్ట్రప్రభుత్వము నాశించుచుండిరి. రాష్ట్రము లెంత

యెక్కువ ద్రవ్యవ్యయ మొనర్చిన నంత గట్టిగ ద్రవ్య మడుగవచ్చునని తలంచుచుండిరి. మితవ్యయ మనునది లేక, బిగ్గరగా నరచు రాష్ట్రమున కెక్కుడు ద్రవ్యము లభించుచుండెను.”

పై పద్ధతిలో నొక గొప్ప లోపముండెను. సంవత్సరాంతమునకు వెనుకనిచ్చిన ద్రవ్యమంతయు ఖర్చు చేయవలసియుండెను. లేకపోయిన మిగిలిన ద్రివ్యము మరల కేంద్రమునకు మరలుచుండెను. అందుచే సంవత్సరాంతమునకు పూర్వము, మిగిలిన ద్రివ్యమును తొందరగా నేపనులకో వ్యయము చేయుచుండిరి. సాధారణముగ నీ వ్యయమంతయు నన్యాయముగను ననవసరముగ నుండెను. ఈ విషయమును సూక్ష్మ బుద్ధియగు శ్రీ హైదరీగారు కనిపెట్టిరి. ఆయన తన ప్రతిభచే నాలోచించి యిట్టి యితరలోపములను సవరించుటకై యీ నూతనపద్ధతిని స్థాపించిరి. వారార్థిక మంత్రియైన వెంటనే యనగా 1921—22 సంవత్సరము ననే దీనికి పునాది వేసిరి. అప్పుడు వారి యీ క్రింది వాక్యములు గమనింపదగినవి.

—

"స్ట్రాకీగారి 'రాష్ట్రముల'ను స్థలమున నిచ్చుటి 'వివిధశాఖలను' పెట్టిన పరిస్థితులు సరిపోవును. అనగా బిగ్గరగా నరచిన శాఖల కెక్కువధనము లభించుట తృప్తికరముగాదు. వెనుక నెట్లున్నను నిప్పుడట్లు ద్రవ్య మొసంగుటకు వీలులేకున్నది. వెనుక బడ్జెటున చాల ద్రవ్యము మిగులుచుండెడిది. ఇప్పుడు ఖర్చు లెక్కువగుటచే నట్లు మిగులుటలేదు. * * * కావున నిప్పటి యార్థిక పరిస్థితులను పరీక్షించిన నాకు కొన్ని యూహాలు తట్టి యట్లుచేయ నిర్ణయించినాను."

I. "ఒక్కొక్క శాఖకు కొన్ని సంవత్సరముల కొక పర్యాయ మింత ధన మొసంగి, యా శాఖావసర వ్యయములయందు దానిపై సంపూర్ణ స్వాతంత్ర్యము నొసంగుట. దీనికి రెండు షరతులవసరము.

(1) అవసర కార్యములకే ధనవ్యయ మొనర్చుట.

(2) లెక్కల తనిఖీకి లోబడుట.

ఏ శాఖలోనైనను చాలా ద్రవ్యవ్యయము కావలసిన నేదేని పెట్టుబడిఖర్చు వలయునెడల, నట్టి దానిని ప్రభుత్వమువా రిచ్చిన యెడల, నట్టి మొత్తము

నకు వడ్డీని శాఖావ్యయ ద్రవ్యమునుండి యొసగ వలయును.

II. ఎప్పుడైనను వచ్చు దుర్భిక్షములు మొదలగు వానికిగాని, పారిశ్రామికాభివృద్ధి కార్యములకుగాని, చాలా ద్రవ్యము కావలయును. కాన నట్టివానికై ప్రత్యేకనిధుల నేర్పాటుచేసి ప్రతి సంవత్సరమును కొంత ద్రవ్యము నందు చేర్చుచుండుట.

వివిధ శాఖావ్యయములకును, పై యవసరముల కును, ద్రవ్యవిభజనమైన తరువాత మిగిలిన రాష్ట్రాదా యమును మరల నవసరములుగల శాఖలకు ప్రభుత్వ మువారు సంతోషపూర్వకముగా పంచిపెట్టుదురు. ఏశాఖలో మితవ్యయముచే ద్రవ్యము మిగులునో యా శాఖకును, విద్య, పరిశ్రమ, మొదలగు నభివృద్ధి శాఖ లకును ప్రథమమున పంచిపెట్టబడును.

III. అట్టి మిగుళ్ళు చేకూరువరకును వివిధశాఖ లును తమకు నేర్పరచిన ద్రవ్యమును మించకుండ మిత వ్యయము చేయుచుండవలెను."

పైనియమములు సూచించుచు ఫ.1331 యార్థిక పత్రమును ప్రవేశపెట్టు కాలమున శ్రీ హైదరీగారు

సెలవిచ్చిన యీ క్రింది మాటల ననువదించుటకూడ యప్రస్తుతము కాదు.

“ప్రతి సంవత్సరమును సామాన్యములగు ననగా మామూలగు నాదాయవ్యయములనుండి, యప్పుడప్పుడు వచ్చునట్టియు, తాత్కాలికము లైనట్టియు, నాదాయ వ్యయములను తొలగించుటకు ప్రయత్నింతును. అనగా గవర్నమెంటు ప్రామిసరినోట్ల యమ్మక మాదాయము నందుచేర్చుట, కరువుసంవత్సరపు ఖర్చులో నందులకైన ద్రవ్యమును వ్యయములో చేర్చుట మొదలగునవి. వీనిని చేర్చుటచే నార్థిక పత్రమునం దనవసరములగు పెరుగు తరుగులు తటస్థించును. ఈ సందర్భముల నీ సంవత్సరమునం దార్థికశాఖ యీ క్రింది పనులను చేయుటకు పూనుకొనును.

(1) ఆదాయములను తరగతివారీగా అనగా శీర్షికలక్రింద మార్పుచేసి యా తరగతులను నిష్కృష్టములుగా చేయుట.

(2) వివిధ నిధులను తగిన స్థలములయందు చూపి వానిని తదుద్దేశముల ప్రకారము విభజించుట.

(3) శాఖా ప్రయుక్తార్థిక విభజనసూత్రమును పెట్టుట."

శ్రీ హైదరీగారు ఉత్తమప్రతిభతోను, ననుభవముతోను, నార్థిక విషయములయందు బ్రిటిషిండియాలో నున్న లోపములను సవరించి, రాష్ట్రార్థికస్థితిని బలపరచి ప్రపంచమునందు మెప్పువడసిరి. ఆర్థికదుస్థితియనునది రాష్ట్రమునకు తగులకున్నదన్న, వీరి యార్థికవిధానమే కారణమని చెప్పవలసియున్నది.

ఈ పద్ధతి ననుసరించి యిప్పు డీ క్రింది నియమములు పాటింపబడుచున్నవి.

1. బడ్జెటు మదింపు, డిపార్టుమెంటువారీగా మూడు సంవత్సరముల కొకమారు చేయబడును. సంవత్సరమునవచ్చు నాదాయమునుబట్టి యీ మదింపులు మార్చుటకు గవర్నమెంటు కధికారముండును.

2. పోస్టు, కరోడిగిరీ, పరిశ్రమ, నగరరక్షణ, ముద్రాలయశాఖలు తమకు మదింపబడిన ధనముగాక, తాము గవర్నమెంటు ననుమతిపై వసూలు చేయు యితర చిల్ల రాదాయములను తమ యిష్టప్రకార మవసరములకై వినియోగించుకొనవచ్చును.

3. ఏ శాఖలోనైన ముందెక్కు వాదాయము రాగలదని గవర్నమెంటువా రభిప్రాయ పడు నెడల, నాశాఖకు మామూలు మదింపుపైన ప్రత్యేక ద్రవ్య సహాయము చేయవచ్చును.

4. ఈ క్రింది శాఖలకు మామూలుమదింపు సాధ్యమైనంతవరకు తగ్గింపబడకపోవుటయేగాక, యవి యేవైన చిల్లర రుసుములను వసూలు చేసుకొన వచ్చును. కాని వలసిన సమస్త ఖర్చులకును, యంత్రముల యరుగుదలకును, తగు నేర్పాట్లు తమ యాదాయములో నుండియే చేసుకొని, యా శాఖలకు గవర్నమెంటు పెట్టిన పెట్టుబడిపై 5% వడ్డీనిచ్చు నేర్పాట్లు తమ యాదాయమునుండియే చేయవలయును.

"ముద్రాలయ, విద్యుచ్ఛక్తి, యంత్రాగార, టెలిఫోను, పారిశ్రామిక, జైలు పరిశ్రమ, స్టేషనరీ శాఖలు."

5. సాధ్యమైనంతవరకు శాఖలు పెట్టు ఖర్చులను బడ్జెటులో చూపవలయును. అట్లు చూపని ఖర్చును, పై పేరాలోని సందర్భమునగాని, యా శాఖయొక్క

ఖాతాలో నిలువయున్నగాని చేసుకొనవచ్చును. ఎప్పు డైన శ్రీ ప్రభువుగారు శాఖ యడుగనిదే స్వబుద్ధిన వ్యయము శాంక్షన్ చేసినయెడల నట్టి ఖర్చు శాఖ యొక్క ఖాతాలోని నిలువనుండి ఖర్చు పెట్టవలయును. అట్టి నిలువ లేకపోయిన గవర్నమెంటువారు ప్రత్యేక దానముగా నియ్యగలరు.

6. చిల్ల రాదాయములుగాని చిల్లర ఖర్చులు గాని (రిఫండ్లు మొదలైనవి) బడ్జెటులో చూపబడవు.

7. వివిధ శాఖలలో చేయబడు ఖర్చులు పోగా మిగిలిన ద్రవ్య మా శాఖల పేర నిలవయుండును. మూడు సంవత్సరములైన వెనుక నీ మొత్తములో సగము ప్రభుత్వ బొక్కసములో కలసిపోవును. మిగి లిన సగ మా శాఖపేర నిలవయుండును. ముందెప్పు డైన యవసరమైన పెద్దఖర్చు వచ్చినయెడల దీనిని గవర్నమెంటువారి యనుమతిపై నుపయోగించుకొన వచ్చును.

8. ఏ శాఖలోనైనను నిదివరకు పెట్టుబడిగాక యెక్కువ పెట్టుబడి వలయు నెడల నట్లు కోరు మొత్త

ముపై 5% చొప్పున వడ్డీ శాఖాదాయములోనుండి గవర్నమెంటువారి కొసగవలయును. అట్లుచేసినగాని యీ పెట్టుబడి మొత్తము లభింపదు.

9. జీతములు, భత్యములు మొదలగు వాని రేట్లు ప్రభుత్వము ప్రచురించెడి నియమావళి ననుసరించుచుండవలెను.

10. భత్యములు, చిల్లర ఖర్చులు, మొదలగునవి యొక పనికి వేర్పరచిన ద్రవ్యములోనుండి మరియొక పనికి, మొదలగు విధమున నంతఃపరివర్తనము చేసుకొను నధికారము ప్రతి శాఖకు కలదు.

11. ఉద్యోగముల జీతములలో నిలువయున్న యెడల తాత్కాలికోద్యోగుల జీతములకే యుపయోగింప వచ్చునుగాని ఖాయపుటుద్యోగములను సృష్టించుటకు శాఖ కెట్టియధికారము లేదు.

12. నిర్మాణాదులకు వేర్పరచినద్రవ్య ముద్యోగుల జీతములకై వ్యయపరుపరాదు. అట్లు వ్యయపరుపవలసి వచ్చిన నార్థికశాఖయొక్క యనుమతిని బడయవలయును.

ఈ విధమున నియమములతో శ్రీ హైదరీగా రార్థికాభివృద్ధి నొనర్చి రాష్ట్రము నుచ్చస్థితికి తెచ్చినారు. ఈ పద్ధతివలన నీ క్రింది ప్రయోజనములను శ్రీ హైదరీగారే సెలవిచ్చినారు.

"This system makes for a well-deliberated and far-seeing programme, together with due care and economy in the expenditure. It avoids the rush of hurried and ill-considered expenditure at the end of a budget year, in which the spending departments are apt to indulge, where the system of grants lapsing at the close of the financial year obtains."

1. ఖర్చు మదింపు జాగ్రత్తగాను దూరదృష్టితోను చేయుట తటస్థించును.

2. మదింపునకు తగినట్లు మితవ్యయము చేయుట సమకూరును.

3. ప్రతిసంవత్సరపు బడ్జెటుండు రాష్ట్రములందు వలె సంవత్సరాంతమున ధనము మునిగిపోవునను భయముచే నేదో యనవసరములగు కార్యములకు వినియోగించుట తటస్థింపదు.

ఆర్థికమునకు సంబంధించిన రెండు విషయము లను మనవిచేసి యీ కాలమున జరిగిన విశేష కార్యములకు మరలుదును.

(1) నిధులు

(2) రాష్ట్రభీమా పద్ధతి

పై రెండుసంస్థలను స్థాపించి శ్రీహైదరీగా రెట్లు రాష్ట్రమునకును, నందలి బీదయుద్యోగస్థులకును, సహా యముచేసిరో తెల్పుదును.

నిధులు :

ఎప్పుడో తప్ప ప్రతి సంవత్సరమును వచ్చు నవ సరములు కానట్టి పనులకును (అనగా కరువు మొదలగు నవి), రాష్ట్రపరిశ్రమ లభివృద్ధి పరచుట మొదలగు నవసరములకును, వలయునట్టి ధనమును సమకూర్చు టకై ప్రతి సంవత్సరమును రాష్ట్రాదాయములోనుండి కొంత ద్రవ్యమును ప్రత్యేకించుట సమంజసమని శ్రీ హైదరీగారు తలంచిరి. అందును నీ రాష్ట్రము నదీమా తృకగాక దేవమాతృక యనగా వర్షములపై నాధార పడియున్నది. అందుచే ననావృష్టి కలిగి ప్రజ లనుభ

వించు కష్టనష్టములకు మేర లేదు. అప్పుడు వలయు ద్రవ్య మునకుకూడ మితి లేదు. ఒక్కొక్కప్పుడు సంవత్సర రాష్ట్రా దాయమంత ధనమవసరము కావచ్చును. అంత ధన మొక్కమారు లభించుట యసంభవము. కావున కరువు నిధియొక్క యావశ్యకతను వేరే చెప్పనవసరము లేదు. ఆవిధముననే రాష్ట్రముయొక్క యభివృద్ధికి వలయు ధనముకూడ చాలా యవసరము. ఈ కారణముల చేత నట్టినిధులను శ్రీ హైదరీగారు స్థాపించిరి. అట్టి నిధులలో నీ క్రిందివి ముఖ్యములు.

I కరువునిధి

II పారిశ్రామికనిధి

III అప్పు తీర్పునిధి

IV కరెన్సీనిధి

V హాలీకల్దారు సమీకరణనిధి

పైన చెప్పినవిగాక రైల్వేకు కొంతనిధి కూర్ప బడెను. వీనిలో నొక్కొక్కదానిని గూర్చి రెండు ముక్కలు చెప్పుదును.

(1) కరువునిధి :

పైవానిలో మొదటిదగు కరువునిధి మిక్కిలి



ముఖ్యమైనది. హైదరాబాదు రాష్ట్రమున నేమూల నైనను ప్రతివత్సరమును కరువు తటస్థించుచునేయుండును. ఆకారణమున నీనిధియొక్క యావశ్యకత చెప్ప నలవికాదు. శ్రీహైదరీగారీ పరిస్థితులను కనిపెట్టి, ప్రతి సంవత్సరమును నీనిధికై రాష్ట్రాదాయమునుండి 15 లక్షల రూపాయలు ప్రత్యేకించుచున్నారు. ఈనిధి లేనిది కరువు వత్సరమున ఖర్చుచేయుటకు ద్రవ్యము నా సంవత్సరపు టాదాయమునుండి యిచ్చుట యసంభవమగును. ఈ క్రింది యంకెలవలన నీనిధియొక్క యావశ్యకత తెల్లము కాగలదు. వానివలన నీ నిధి ప్రతిసంవత్సరమును బీద జనుల కెంత సాయ మొనర్చునదికూడ గమనింపనగును.

| ఫసలీ | వ్యయించిన ధనము |
| --- | --- |
| 1335—37 | 6.24 లక్షలు |
| 1338—40 | 15.44 ,, |
| 1341—43 | 10.69 ,, |
| 1344—46 | 33.75 ,, |
| ఇదిగాక గ్రామముల బావులు త్రవ్వించుటకు | 28.21 ,, |
| మొత్తము | 94.33 లక్షలు |

[1] దాదాపు 10 సంవత్సరముల కాలమున 94 లక్షల రూప్యములు ఖర్చైనట్లు తెలియుచున్నది. ఇంత ద్రవ్యము రాష్ట్ర కార్యములను సమకూర్చుచు రాష్ట్రాదాయములోనుంచి యిచ్చుట యెంత కష్టమో గమనింప దగును. 1347 ఫసలీ యంతమున కీ నిధి 285 లక్షలై, యీ ద్రవ్యము చెక్కుచెదరని విధముగా పెట్టుబడి పెట్టి యుంచబడినది.

(2) పారిశ్రామికనిధి :

ఈ రాష్ట్రమున రాక్షసి బొగ్గు గనులు మిక్కుటముగా గలవు. అడవు లెక్కువగా నుండుటచే కాగితపు పరిశ్రమ కనుకూలములున్నవి. నిజాంసాగరు ప్రాజెక్టు వచ్చిన తరువాత చెరుకుపంటకు సంపూర్ణావకాశము లున్నందున, చక్కెరపరిశ్రమకు చక్కని యవకాశమున్నది. వీనితోపాటు రాష్ట్రమున ప్రత్తియొక ముఖ్యపంట యగుటచే బట్టలనేతపరిశ్రమకు పూర్తి యవకాశములున్నవి. ఇంకను సిమెంటు, ఆము

1 1939 సంవత్సరమున కాటకము సంభవించుటచే సర్కారువారీనిధినుండి 90 లక్షల ద్రవ్యము కరవుపనులకొరకు వినియోగింప నిర్ణయించినారు. ఒక్క కరీంనగరుజిల్లాలోమాత్రమే 60 లక్షలు వెచ్చించునట్లేర్పాటు చేయబడినది.

దము, మొదలగునవి యెన్నియో కలవు. వీని నభివృద్ధి పరచి రాష్ట్రాభ్యుదయము చేకూర్పవలెనన్న ద్రవ్య మవసరము. ఇన్ని పరిశ్రమలకు మిక్కిలి ద్రవ్యము కావలసియుండును.

ఈ కారణముచే నీ నిధి యవసరము వేరే చెప్ప బనిలేదు. 1337 ఫసలీనాటికీ నిధినుండి యీ క్రింది విధముగా పరిశ్రమలకు సహాయము గావింపబడెను.

| పరిశ్రమ పేరు | సహాయము |
|---|---|
| బొగ్గు పరిశ్రమ | 5.0లక్షలు |
| సిమెంటు పరిశ్రమ | 6.0 ,, |
| బట్టల నేతపరిశ్రమ (ఉస్మాన్ శాహిమిల్లు నాందేడు, ఆజం జాహి మిల్లు వరంగల్లు) ద్వారా, దఫాలు వారీగా | 65.0 ,, |
| నిజాంసాగరు చక్కెర మిల్లు | 17.25 ,, |
| పొగాకు పరిశ్రమ | 1.66 ,, |
| | [1]94.85 |

1 ఇప్పుడు సిరిపూరున కట్టబడుచున్న కాగితపుయంత్రమునకు దీనినుండియే వెచ్చించుచున్నారు.

ఇంత ద్రవ్య మెక్కడనుండి యొక్కమారు వచ్చును? ఇవిగాక చిన్న పరిశ్రమలకు దాదాపు 2½ లక్షలు సహాయము గావించినారు. 1337 ఫసలీనాటి కీ నిధిలో 96.39 లక్షలు మిగిలి యున్నట్లు బడ్జెటు మదింపులో తెలియజేయబడియున్నది.

(3) మిగిలిన నిధులు

రాష్ట్రాభివృద్ధి కార్యముల కొకప్పు డప్పు చేయవల సియుండును. వీనిని సామాన్యముగ ఫలానా సంవత్సర మున తీర్చు షరతుపై చేయుదురు. అప్పుడప్పుడు చేసిన యీ యప్పులకు ప్రతి సంవవత్సరము వడ్డీ నియ్యవలసి యుండును. తత్పరిమిత్యంతమున మొత్తములను తీర్ప వలసియుండును. అప్పు డొక్క మారెచ్చటినుండి వచ్చును? అందుచే నప్పుతీర్పునిధి యావశ్యకమైనది. 1337 ఫసలీనాటి కీయప్పుతీర్పునిధి మొత్తము 160 లక్షలై యున్నది. 1337 ఫసలీనాటికి గవర్నమెంటు రుణములు దాదాపు 757 లక్షలైయున్నది. దీనిలో కొన్ని రుణ ముల పరిమితికాల మింకను చాల సంవత్సరములున్నది. (4) (5) నిధులు రాష్ట్రార్థికావసరములకు ముఖ్యము లైనవి. కర్రెన్సీ నిధిని పరిశీలించిన నిండియా గవర్న

మెంటుకంటె నీ గవర్నమెంటు ధనవంతముగా నున్నట్లు చెప్పనగును. ఈరాష్ట్రమున చలామణిలో నున్న నోట్లన్నియు నొకమారు రూపాయలకొరకు వచ్చినను గవర్నమెంటువద్ద చాలినంత నిధియున్నది. సమీకరణ నిధి మారకమువలన నావశ్యకమైనది. ఈ విధమున నిధులను స్థాపించి, రాష్ట్రాభివృద్ధి గావించుటయేగాక భీమా పద్ధతిచే నుద్యోగస్థుల కెంత సహాయము గావించి నదియు విశదీకరింతును.

## రాష్ట్రీయ భీమాపద్ధతి:

ఈ విషయమునకూడ నీ రాష్ట్రము ముందంజయే వేసినది. రాష్ట్రోద్యోగుల కీపద్ధతి మిక్కిలియుపకారము. ఈ కాలమున ధనికులు, బీదలు, నుద్యోగస్తులు, యితరులు, యావన్మందియు భీమాపద్ధతియొక్క యావశ్యకత గమనించినారు. అందును నెలజీతములు తెచ్చుకొను నుద్యోగస్తులకు, వారు పెద్ద మొత్తముల నాదాయముచేయుట కష్టమగుటచే, నీభీమాపద్ధతి ననుసరించి తమ జీవితములను భీమాచేయుట యవసరమయ్యెను. ఇప్పు డాపద్ధతి మిక్కిలి యాదరింపబడుచున్నట్లు దేశమున నసంఖ్యాకములుగనున్న భీమాకంపెనీలే

సాహ్యము నిచ్చుచున్నవి. కావున రాష్ట్రోద్యోగులలో నున్న యీ యాదరమును గమనించి, యట్లుద్యోగస్తులు చెల్లించు భీమాద్రవ్యమును తామే గ్రహించి యుద్యోగస్తులకు వలయుసౌకర్యములు తామేసమకూర్చుట సమంజసమనితలంచి ప్రభుత్వమువారే ఈభీమాపద్ధతిని స్థాపించిరి. భీమాకంపెనీలకు వచ్చులాభము ప్రభుత్వమువారికే వచ్చును. ఇట్టి పద్ధతిని యావన్మంది యుద్యోగస్తులకును నిర్భంధము చేసినయెడల నీ ద్రవ్యమింకను వృద్ధియగును. ఇట్లునిలువయుండు ద్రవ్యము రాష్ట్రావసరములకొరకు కుపయోగించుకొనవచ్చును. ఇటీవల లెక్కచూడగా నిట్లు నిలువయున్నద్రవ్యము చాలనుండుటచే నందుకొంత మరల పాలసీహోల్డర్లకు బోనస (Bonus) నిచ్చుటకుపయోగింపబడెను. ఇట్లు ప్రతి 3 సంవత్సరములకుగాని, వీలున్న ప్రతి సంవత్సరముగాని, బోనసిత్తురని తలంపబడుచున్నది. ఈ విధమున 1000 రూపాయలు రావలసినయుద్యోగస్తునికి దాదాపు 1500 రూపాయలు వచ్చును. ఈ పద్ధతి యుద్యోగస్తులకు మిక్కిలి సంతోషావహము. ఇట్టి రాష్ట్రీయోద్యోగస్తుల నిర్బంధ భీమాపద్ధతి బ్రిటిషిండియా యందుగాని మరియే సంస్థానమునగాని లేదనియే చెప్పవచ్చును. ఈ నిధి

1346 ఫసలీయంతమునకు దాదాపాక కోటిరూపాయ లున్నది. ఇప్పుడింకను నభివృద్ధియై యుండును.

ఈ విధముగా రాష్ట్రార్థికస్థితిని సమకూర్చి శ్రీ హైదరీగారు తమకీర్తిని చిరస్థాయి చేసికొనినారు. రాష్ట్రార్థిక గౌరవమును గూర్చిన యొక్క యంశముచాలును. 1344 ఫసలీలో ఆబాన్ 2 వ తేదిన ప్రభుత్వమువారు కోరిన 1 కోటిరూపాయల ఋణము 10 నిమిషముల కాలములో వసూలగుటయేగాక, 144 లక్షలరూపాయలకు దరఖాస్తులు వచ్చెను. ప్రజలకును ద్రవ్యవంతులకును ప్రభుత్వమునం దెంత నమ్మకమో లేకపోయిన నిట్టి పని జరుగుటకు వీలుండునా? శ్రీ హైదరీగారు నెలకొల్పిన యీ "శాఖాప్రయుక్తార్థికవిధానము" నెంత కొనియాడినను తీరదు. శ్రీ హైదరీగారిప్పుడు ప్రధానమంత్రియైనను వారి విధానమే యార్థికవిషయముల ననుసరింపబడుచున్నది. వారి తరువాత యార్థికమంత్రియైన శ్రీ నవాబు ఫకర్ యార్జంగు బహద్దూరుగారును, నిటీవల వారి స్థానము నాక్రమించిన శ్రీ నవాబ్ మొహిదియార్జంగు బహద్దూరుగారును, శ్రీ హైదరీగారు వేసిన పునాదులమీదనే యార్థిక భవననిర్మాణము

గావించుచు రాష్ట్రము నత్యున్నతికి తెచ్చుచున్నారు. అందును శ్రీనవాబ్ మెహిదియార్జంగు బహద్దూరుగారు విద్యా రాజకీ యార్థికశాఖలకు మూడింటికిని ప్రతిభనిచ్చి యభివృద్ధికి తెచ్చుట మిక్కిలి ప్రశంసనీయము !

## 3

ఈ కాలమున జరిగిన కొన్ని విశేష విషయముల నిట విన్నవించి బీరారు సమస్యను తరువాత చర్చింతును. వాని నీక్రింద విశదపరచుచున్నాను.

**గృహపరిశ్రమశాఖ:**

గృహపరిశ్రమల ప్రాముఖ్యమును శ్రీవారు 1914 సంవత్సరము నాటికే కనుగొన గలిగిరనియు, చేనేత, వడ్రంగము, మొదలగు కొన్ని విషయములకు కొంత ద్రవ్యము వెచ్చింప బడినదనియు, వెనుక మనవి చేసియున్నాను. కాని యప్పుడీ కార్యములు సహకార శాఖక్రింద చేయబడుచుండెడివి. తరువాత 1922 సంవత్సరమున నీశాఖ యభివృద్ధి చేయబడి, మరికొన్ని పరిశ్రమలకు సాయము చేయుట ప్రారంభమయ్యెను. తరువాత నీ శాఖాకార్యములు విశాలము లగుటచే పారిశ్రామిక శాఖలో నిదియొకముఖ్యాంగము గావింపబడెను. తరువాత నీ శాఖయందు తయారగు వస్తువుల యమ్మకమున కొక విక్రయశాల 4-7-1932 తేదిన స్థాపింపబడినది. ఇప్పుడు ముషీరాబాదునందీశాఖకు విస్తృతము





గృహపరిశ్రమాలయము. ఒక దృశ్యము

లగు భవనములు నిర్మింపబడినవి. ప్రభుత్వము తరఫున కొన్ని పరిశ్రమ లభివృద్ధి యగుటయేగాక యనేక ప్రత్యేక వ్యక్తుల కీ శాఖ క్రింద ద్రవ్యము సహాయము చేయబడి పరిశ్రమాభివృద్ధియగుచున్నది. 1934—35 సంవత్సరపు ప్రభుత్వ నివేదికయందీ శాఖాకార్యము లీక్రింది విధమున తెల్పబడినవి:—

"అనేక స్థలముల ప్రదర్శనములు జరిగెను చేనేతయందును రంగుపరిశ్రమయందును, "అంచు" లను వేయుటయందు ననేక గుణపాఠముల నిచ్చినది. 3,200 మంది చేనేతను నేర్చుకొనిరి. ఈ సంవత్సరమున విక్రయశాల 25,458 రూపాయల విలువగల వస్తువులను విక్రయించగలిగెను. ఒకప్పుడు సరిగ వస్త్రముల నేతకు ప్రసిద్ధికెక్కిన పైఠనునగరమున నా పరిశ్రమను పునరుద్ధరించుటకు యత్నములు జరిగినవి. అచ్చటి నేతగాండ్రకిది మిక్కిలి సహాయకారి యయ్యెను. వరంగల్లునందలి తివాసీ నేతశాలలో 5,591 రూపాయలు విలువగల తివాసీలును 6,745 కంబళ్లును తయారైనవి. ఈ శాఖక్రింద నౌరంగాబాదు, నిజామాబాదు, నాంపల్లి స్థలములయందు

స్థాపింపబడిన పారిశ్రామిక విద్యాలయములు మిక్కిలి తృప్తికరముగా పనిచేయుచున్నవి. ఈశాఖక్రింద చిన్న పరిశ్రమలనిమిత్తము 2,78,161 రూపాయల ఋణములు వ్యక్తుల కొసంగబడెను." పై నివేదిక వలన నీశాఖాభివృద్ధి తెల్లమగును. ఒక్కమారు విక్రయశాలకుపోయి యచ్చటి వస్తువులను పరీక్షించిన నీ శాఖయం దెట్టి పనులు జరుగుచున్నవో తెలియును. బ్రిటిషిండియా యందింకను ప్రారంభింపబడని పనులన్నియు నీ రాష్ట్రమున దాదాపు 20 సంవత్సరములనుండి జరిగి యిప్పటికి మంచి యభివృద్ధినొందియుండుట మిక్కిలి ముదావహము.

**రాజకుమారుల వివాహములు :**

1931 మార్చిమాసమున శ్రీ యువరాజుగారును తమ్ములును యూరపు యాత్రకు వెడలిరి. శ్రీప్రభువుగారు స్వయముగా విచ్చేసి రాకుమారుల దీవించి సాగ యిపిరి. శ్రీవారి యాశీర్వచన బల మెట్టిదోగాని నంద్దరు సోదరులును కల్యాణముల గావించుకొని సకుటుంబముగా మరలివచ్చిరి. 1931 సంవత్సరము నవంబరు 22 తేది యొక పవిత్ర దినము. ఆదినమున నిస్లాం మత

మున పవిత్రకుటుంబములగు నూస్మానియా అసాఫియా కుటుంబములకు వివాహసంబంధము కలిగెను. రెండు కుటుంబములును పవిత్ర ప్రవక్తయగు మహమ్మదునుండి యవిచ్ఛిన్నముగా వచ్చిన పరంపరలోనివియే! ఇట్టి రెండు కుటుంబములకు వివాహ సంబంధము ప్రపంచ మునందలి మహా ఘనకార్యములలో నొకటి. ప్రపంచ మునం దంతటను నీ మహా ఘనకార్యము ప్రశంసాపాత్ర మయ్యెను. ఊస్మానియా కుటుంబమునకు నాయక మణియు, వెనుకటి టర్కీ చక్రవర్తియు, నిస్లాం మత ప్రపంచ గురువును నగు నబ్దుల్ మజీద్ ఖాను మహాశ యుని యేకైక పుత్రికారత్నమగు శ్రీదుర్రె షేవారు దుర్ధానా బేగం రాకుమారిని శ్రీయువరాజుగారికిని, యామె పినితండ్రి కుమారియగు శ్రీనీలూఫరు రాకు మారిని శ్రీవారి రెండవ కుమారునికిని యిచ్చి పాణిగ్ర హణ మహోత్సవములు ఫ్రాన్సుదేశమున "నీసు" (Nice) పట్టణమున జరిగెను. రాకుమారులు బయలు వెడలునపు డిట్టి మంగళకార్యము జరుగునని యెవ్వ రును తలంచియుండలేదు! భగవత్కార్యము లెంత విచి త్రములు! ఒక కవీశ్వరుడు చెప్పినటుల నీ సంబంధము "నిరస్తసదృశాంతరము". శ్రీ సుల్తానువారే యీ శుభ

కార్యమున బ్రహ్మత్వము వహించుట మిక్కిలి శుభసూచకము! వారిదీవనాబలముచే యువరాజుగా రిద్దరు కుమారులను వడసి, ఆసఫ్జాహీరాజ కుటుంబ మును విస్తృత మొనర్చి, తల్లిదండ్రులకు సాటిలేని సంతోషము కల్గించిరి. ఈ వివాహవిషయమున నీ సం బంధమును కుదుర్చుటలో కీ. శే. మౌలానాషౌకతల్లీ గారు చేసిన సేవ యపారము. అందులకు కృతజ్ఞత చూపుచు నాయన జీవించియున్నంతవరకును శ్రీవారా యన కుపకార వేతన మొసంగి గౌరవించిరి. అంతకు పూర్వమే రౌండుటేబులు సమావేశమునకు వెడలిన హైద్రాబాదు ప్రతినిధివర్గము పెండ్లి పెద్దలైరి. వివాహ శాసనమున సాక్షి వ్రాళ్ళు చేయు నదృష్టము హైదరీ, బ్రెంచి, మెహిది యార్జంగుగార్లకు లభించెను. వివాహ దినము హైద్రాబాదు రాష్ట్రమునం గంతటను పండుగ దినమయ్యెను. ప్రతిసంవత్సరము నా పవిత్రదినము సెలవు దినముగా రాష్ట్రమంతయు ననుభవించుచున్నది. శ్రీరాకుమారులు సకుటుంబముగా హైద్రాబాదు వచ్చిన దినము రాష్ట్రచరిత్రమున స్వర్ణాక్షరముల ముద్రింపబడగి నది. పట్టణము సమస్తమును నలంకరించిరి. పురలక్ష్మి రాకుమారుల కుటుంబములను తన యొడిని జేర్చి



ముకఱ్ఱంజా రాకుమారులు

ముద్దాడెను. శ్రీవారి యొక్కయు, రాజకీయోద్యోగుల యొక్కయు, రాష్ట్రప్రజల యొక్కయు, సంతోషమునకు మేర లేకుండెను. శ్రీయువరాజ్ఞి యేనాడు పురమున కాలిడెనో రాజ కుటుంబము, రాష్ట్రాభ్యుదయము, నేకోత్తరముగా వృద్ధియగుచున్నది. శ్రీయువరాజ్ఞి యు పుట్టినింటికిని మెట్టినింటికిని కీర్తిని సమకూర్చుచు, పుత్రవతియై, స్త్రీలోకమునకు నాయకమణియై సమస్తరాష్ట్రమునకును ప్రీతిపాత్రయై యొప్పారుచున్నది. భావిరాజు కాగల శ్రీముకర్రంజాబహద్దూరువారి ప్రశాంత తేజఃపుంజమగు ముఖము, నిరంతర మందహాస యుతమై, రాష్ట్ర ముదావహమై యొప్పారుచున్నది. భగవానుడు హైద్రాబాదు రాజకుటుంబమును చిరస్థాయి యొనర్చుగాక! ఎన్నటికైన టర్కీరాజ్యమునకు మరల సుల్తాను కావలసిన నీకుటుంబమే తారకమగును! ఎంతభాగ్యము !

రైల్వేక్రయము :

బ్రిటిషిండియాలోని యార్థిక రాజకీయవేత్తలు చాల సంవత్సరములనుండి రైల్వేపరిపాలనమును విమర్శించుచు, వాని నిర్వాహణమును కంపెనీలవద్దనుండి

తీసుకొనుడని ప్రభుత్వమువారిని కోరుచుండిరి. కాని బ్రిటిషుగవర్నమెంటువా రందులకు సంపూర్ణాంగీకార మును కనుపర్చకపోయిరి. ఇటీవలనే కొంత సుముఖత చూపుచున్నారు. ఇదివరలో నైజాం రైలుకూడ నింగ్లాండునందలి యొక కంపెనీ యధీనములోనుండెను. శ్రీహైదరీగారార్థిక మంత్రియైన తరువాత క్రమముగా నాకంపెనీ పాలన సంఘమున కధ్యక్షులైరి. అప్పటినుండి రైల్వే పరిపాలనమున పాల్గొనుచుండుటచే, వారు సంపాదించు లాభములజూచి, యెప్పు డీ రైల్వేను రాష్ట్రస్వము చేయు నవకాశము కల్గునాయని వేచియుండిరి. క్రమముగా సంప్రదింపులు సాగించుచు, తుదకు కొన్ని సంవత్సరముల కవు లింకను మిగిలియున్నను 1930 సంవత్సరము 1 యేప్రిల్ తేదితో నా కవులు రద్దుపరచి, రైల్వే యాస్తినంతను క్రయము చేసుకొనిరి. ఒకమారు దానికి సంబంధించిన లెక్కలను గమనించిన నిది యెంత గొప్పకార్యమో తెలియును.

కంపెనీ కౌలు 1933 సంవత్సరము 31 డిసెంబరు వర కుండెను. 1–4–1930 నుండి 31–12–1933 వరకు కంపెనీ పాలనమే యుండినయెడల వారుగడించు

లాభముయొక్క విలువ 2,118,187 పౌనులుగా మదింపు వేయబడినది. 31_12_1933 వరకు రైల్వేయాదాయమున నైజాం గవర్నమెంటుకు వచ్చు భాగమునకు బ్రిటిషుఖజానాకు చెల్లించవలసిన పన్నులు వగైరాలు 3,80,545 పౌన్లుగా మదింపు వేయబడెను. ఈక్రింది విధమున లెక్క తయారుచేసిరి.

| | పౌన్లు |
|---|---|
| ఇప్పటి రైల్వే ఖరీదు | 5,933,833 |
| కంపెనీవారికి వచ్చు లాభముయొక్క మదింపు | 2,118,187 |
| నైజాం గవర్నమెంటువారియ్యవలసిన పన్నుల మదింపు | 380,515 |
| మొత్తము | 8,432,565 |

అనగా దాదాపు 120,000,000 కోట్ల రూపాయలు. ఎంత ద్రవ్యము !

తుదకు 8,300,000 పౌన్లకు బేరము ఫైసలయ్యెను. ఇందు నైజాం గవర్నమెంటువారికి రైల్వేలోనున్న షేర్లు, ఆస్తి, మొదలగువాని మదింపు పోను రైల్వే కంపెనీవారికి 4,570,000 పౌన్లు రొఖ్ఖపూర్వకముగా

నియ్యవలసివచ్చెను. దీనికి తగు నేర్పాట్లు గావించు టలో రాష్ట్రమునకు నష్టమురానిపద్ధతిని వెదకిరి. శ్రీ హైదరీగారి ప్రతిభకు మేరయెక్కడ? 8-3-30 తేదీన యొడంబడిక వ్రాసుకొనిరి. అప్పటినుండి యొక రైల్వే బోర్డు సమస్త పరిపాలనమును సాగించు చున్నది. దానికి శ్రీహైదరీగా రధ్యక్షులుగా నున్నారు. వెనుకటి డైరక్టర్లు చేయు కార్యములన్నియు నీ బోర్డువారు నిర్వహించు నట్లొప్పుకొనుటచే, రైల్వే యుద్యోగస్థులకు రావలసిన ప్రావిడెంటు ఫండు మొదలగునవి యన్నియు జాగ్రత్త చేయుటకు బోర్డువారు పూచీపడిరి. ఉద్యోగీయుల యుద్యోగములకు కూడ పూచీపడిరి. అప్పటినుండి రైల్వే పరిపాలనము వెనుకటివలె నవిచ్ఛిన్నముగ జరుగుచు, రాష్ట్రమున కార్థికముగ మిక్కిలి సహాయకారిగా నున్నది. లెక్కలను చూపిచెప్పిన నిందలి సత్యము తెల్లముకాగలదు.

| ఫసలి | రైల్వే ఆదాయము |
|---|---|
| 1339 | 45.72 లక్షలు |
| 1340 | 29.96 ,, |
| 1341 | 45.24 ,, |

| ఫసలి | రైల్వే ఆదాయము |
|---|---|
| 1342 | 38.18 లక్షలు |
| 1343 | 46.81 ,, |
| 1344 | 109.52 ,, |
| 1345 | 104.00 ,, |
| 1346 | 132.84 ,, |

పై లెక్కలవలన కంపెనీనుండి విక్రయించుకొనిన సంవత్సరమున నాదాయ మెట్లాకస్మికముగా తగ్గెనో, క్రమముగా నెట్లు మరల వెనుకటి యభివృద్ధిని పొందెనో, 1344 ఫసలీనుండి వెనుకటి యాదాయముకంటె నెన్నిమడుగులు హెచ్చెనో కనుగొననగును. ఇప్పుడు రానురాను రైల్వే ముఖ్యాదాయ శాఖలలో నొకటియైనదని యీ క్రింది యంకెలవలన కనుగొనగలము.

| ఫసలి | మదింపు ఆదాయము |
|---|---|
| 1347 | 122.00 లక్షలు |

ఈ విధముగా నీ విషయమునకూడ నైజాం ప్రభుత్వము బ్రిటిషిండియా ప్రభుత్వమునకుకూడ మార్గదర్శకమయ్యెను. ఇటీవలనే యిండియాగవర్నమెంటు

వారు కొన్ని చిన్న రైల్వేలను స్వాధీనముచేసుకొనిరి. బ్రిటిషిండియాలో 50 వత్సరములుగా జరుగనిపని యొక్క-మారు తన యార్థిక ప్రతిభతో శ్రీ హైదరీగారు నిర్వర్తించి రాష్ట్రాభ్యుదయమునకు తోడ్పడైరి.

---

౪

## రౌండు టేబిలు మహాసభ :

ఇటీవల ననగా 1939 సంవత్సరము సెప్టెంబరు మాసమున, వైస్రాయి లిన్‌లిత్గో ప్రభువు ఫెడరేషను కన్ని వైపులనుండు నిరోధమును కనిపెట్టి, తత్ప్రణాళికను ప్రస్తుతము రద్దుచేసితిమనియు, యుద్ధానంతర మాలోచించవచ్చుననియు, ప్రకటించెను. అందుచే నిచ్చట నీ రౌండుటేబిల్ సభావృత్తాంతము ముఖ్యము గాకపోయినను, నందుక్రింద కొంతపని జరిగినందున దానిని సంగ్రహముగా నిచ్చుట యవసరము. బ్రిటిషిండియాలోని రాజకీయాందోళనమునకును ముఖ్యముగా కాంగ్రెసువారు గావించిన సత్యాగ్రహమునకును ఫలితముగా, బ్రిటిషుగవర్నమెంటువారు హిందూదేశ రాజ్యాంగమున పరివర్తన మవసరమని తలంచి, యందులకు వలయు నాలోచనలు చేయుట కొక సభను గావించిరి. ఈ నిర్ణయ మప్పుడు బ్రిటిషుగవర్నమెంటును నడుపుచున్న లేబరు (కార్మిక) ప్రభుత్వమువారిచే జేయబడెను. ఈ సభలో నాలోచించుటకై హిందూదేశము నందలి వివిధపక్ష ప్రతినిధుల నాహ్వానించిరి. యావ

ద్భారతదేశమును నీరాజ్యాంగ పరివర్తనమున కలప వలెనను నూహతో, సంస్థాన ప్రతినిధులుకూడ రప్పింప బడిరి. హైద్రాబాదు పక్షమున నీక్రింది మహామహులు వెడలిరి.

(1) సర్ అక్బరుహైదరీగారు

(2) సర్ రిచర్డు ట్రెంచిగారు

(3) నవాబు మెహిదియార్జంగు బహద్దూరుగారు

(4) నవాబు సర్ అమీర్జంగు బహద్దూరు గారు

(5) సర్ రిజనాల్డు గ్లాంసీగారు (వెనుకటి యార్థిక సభ్యుడు)

కీ॥ శే॥ మార్మడూక్ పిక్తాలుగారి రాయబార మునకు కార్యదర్శిగా నుండిరి. ఇట్లు రాజకీయార్థిక విషయముల నారితేరినవారిని పంపుట తటస్థించెను. ఒకే సభలో వ్యవహారమంతయు తేలనందునను, పరి ష్కరింపవలసిన విషయములు చాల నున్నందునను, నీ సభలు దఫాలువారిగా ముమ్మారు జరిగెను.

(1) మొదటిసభ 12-11-30 నుండి 19-1-31 వరకు

(2) రెండవది 7—9—31 నుండి 1—12—1931 వరకు

(3) మూడవది 17—11—1932 నుండి 24—12—1932 వరకు

సంస్థానములలో నెల్ల హైదాబాదు పెద్దదిని, ముఖ్యమైనదిని, మిగిలినవానికంటె విశిష్టహక్కులు కలదిని యగుటచే, నీ సంస్థాన రాయబారమునకును, ఇదును సర్ అక్బరు హైదరీగారికిని ప్రాముఖ్యము మగెను. వారి రాజకీయార్థిక పరిజ్ఞానమును చర్చల కెడ్డదును, నివేదికా రచనమునందును, వినియోగించి స్థాన రాయబారముల కన్నిటికి మార్గదర్శకు లయ్యెను.

బ్రిటిషిండియా ప్రతినిధులును, సంస్థాన ప్రతినిధులును, నందరు నైకకంఠ్యముగ, హిందూదేశము యొక్క రాజకీయాదర్శము వివిధ స్వతంత్రభాగములు కలిసిన ఫెడరల్ విధానమని యేకీభవించిరి. ఇందుక్రింద తప్పిన్లు విచారించుటయందు భిన్నాభిప్రాయములు వచ్చెను. తరువాత మైనార్టీ (అల్పసంఖ్యాక) సమస్య ముందునకు తేబడెను. మొత్తముమీద విధానము

తయు రెండు భాగములుగా విభజించుటకు తీర్మానింప బడెను.

(1) రాష్ట్రీయ స్వాతంత్ర్యము
(2) ఫెడరలు విధానము

మొదట సహకార మొనర్చిన కాంగ్రెసు పార్టీ వారు తరువాత నిరాకరించిరి. ఇండియా గవర్నమెంటు వారు తాము పెట్టుకున్న సూటిని వదలక, యీ వంక ప్రయత్నములు సల్పుచునే వచ్చిరి. ఎన్నిక పద్ధ ప్రాతినిధ్యము, మొదలగు రాష్ట్రసమస్యలకొరకు కొ కమిటీలును, రాష్ట్రీయ ఫెడర లార్థికవిధానము మొద లగు వాని విషయమై కొన్ని కమిటీలును నేర్పాటు చేసిరి. సంస్థానములకును బ్రిటిషు గవర్నమెంటుకు నున్న సంబంధమును నిర్ణయించుటకు బట్లరు కమిటీ యేర్పాటయ్యెను. ఈ కమిటీ లిండియాయంతయు పర్య టనముచేసి తమ నివేదికల నంపిరి. ఇంతలో కార్మిక ప్రభుత్వము పోయి కన్సర్వేటివు (Conservative) ప్రభుత్వము వచ్చెను. సర్ సామ్యూయలు హోరుగారు వెడ్జివుడు బెనుగారి స్థానమునకు వచ్చిరి. అయినను నీ నూతన ప్రభుత్వముకూడ నీ సమస్యను వదలక సాగించు

చునే వచ్చిరి. తుట్టతుదకు దీర్ఘ చర్చలు సలిపి, పార్లమెంటులో 1935 సంవత్సరపు టిండియా చట్ట మంగీకరింపబడెను. బర్మా యిండియానుండి విడదీయబడెను. వెనుక ననుకొన్నట్లే యీ చట్టము, రెండు భాగములు చేయబడెను. రాష్ట్రీయభాగము వెంటనే యమలులోనికి వచ్చెను. అందు క్రింద నెన్నికలు జరిగి రాష్ట్రీయ ప్రభుత్వములు స్వతంత్రములయ్యెను. ఎన్నికలలో కాంగ్రెసు జయమునందుటచే వెనుక మౌనమువహించిన కాంగ్రెసు రాష్ట్రములయందు పదవీస్వీకరణము చేసి ప్రభుత్వమును నడపుట కంగీకరించెను. తత్ఫలముగ దేశమునందలి రాష్ట్రములలో నెనిమిది రాష్ట్రములు కాంగ్రెసు హస్తగతములయ్యెను. సింధురాష్ట్రము సగము కాంగ్రెసుగను, బెంగాలు పంజాబులు ముస్లిము మెజారిటీ రాష్ట్రములుగను, 1935 సంవత్సరపు టిండియా చట్టముక్రింది రాష్ట్రస్వాతంత్ర్య ప్రణాళికను కొనసాగించెను. కాంగ్రెసుకు బలము చేకూరినది. ఇది హిందూ ముసల్మానులకు భేద కారణమయ్యెను. ఇక రెండవదియగు ఫెడరల్ విధానమును ముచ్చటింతును.[1]

1 యుద్ధప్రారంభమైన వెనుక కాంగ్రెసునకును, బ్రిటిషుపార్ల
మెంటువారికిని, యుద్ధసహాయ విషయమున భిన్నాభిప్రాయము కలిగి కాంగ్రెసు

దీనిని గూర్చి యంతటను ప్రతిఘటనమే కలిగెను. నిరంకుశ ప్రభుత్వముగల సంస్థానములకును, స్వాతంత్ర్యముగల రాష్ట్రములకును కలయిక కలుగుట దుర్లభమని బ్రిటిషిండియా నాయకులు వాదించిరి. ఈ క్రింది సమస్య లుద్భవిల్లెను.

(1) రాష్ట్రములలోని శాసనసభ్యులు ప్రజా ప్రతినిధులు. సంస్థానములయందు ప్రజాప్రభుత్వములు లేకపోవుటచే ప్రభువులు పంపు ప్రతినిధులు ఫెడరలు సభలోనికి వత్తురు. ఈ రెండు రకముల ప్రతినిధులకును దృక్పథముననే భేదముకలదు. కావున సంస్థానములలో గూడ ప్రజాప్రభుత్వము లేర్పడినగాని ఫెడరల్ విధానము పొసగదని యొకపక్షనాయకులు వాదించిరి. అందుచే వైస్రాయిని, నిండియా సెక్రెటరీని, సంస్థాన ప్రభువులను, తమ సంస్థానములయందు ప్రజాప్రభుత్వములు స్థాపించున ట్లొత్తిడి కలుగజేయవలెనని కాంగ్రెసువారు కోరిరి. కాని తాము బలవంత పెట్టజాలమనియు, నట్లు

రాష్ట్రములలోని మంత్రివర్గములు రాజీనామాల నొసంగెను. ఇప్పుడు కాంగ్రెసు సత్యాగ్రహము సాగించుచున్నది. బెంగాలు, పంజాబు, సింధులు మాత్రము రాష్ట్ర స్వాతంత్ర్యము ననుభవించుచున్నవి.

చేయుట సమంజసమని సలహామాత్ర మిచ్చెదమనియు, పిదప ప్రభువుల యిష్టమనియు, వారనిరి. కొన్ని సంస్థానము లీ సమయమును చూచి బిగువు సడలించిరి. మరి కొన్ని యింకను బిగించెను. వీరి మధ్య చెప్పుడుమాటలు విని, బ్రిటిషిండియాలోని తమసోదరుల కున్న రాజకీయ పరిజ్ఞానము లేని సంస్థానప్రజలు యిక్కట్టుల పాలైరి. సంస్థానములలోని స్వార్థపరులగు నాయకంమన్యులు విద్యా రహితులను మోసపుచ్చ బ్రయత్నించిరి. ఇందుచే సంస్థానప్రజలను రాజకీయపరిజ్ఞాన వంతులుగను, తమ ప్రాథమిక స్వత్వములను తెలిసినవారుగను చేయుట యవసరమని తేలెను.

(2) సంస్థానములన్నియు నొకేవిధమైన హక్కులుగాని, రాజ్యాంగముగాని, కలవికావు. ఫెడరేషనున చేరుట కివియన్నియు సమ్మతింపవలసి యుండెను. 1935 చట్టము ప్రకారము సంస్థాన మొకమారు ఫెడరేషను నంగీకరించినయెడల, మరల విడిపోవుటకు వీలులేదు. కావున ప్రతి సంస్థానమును నొక యొడంబడిక చేసుకొనుట యవసరమయ్యెను. ఈ యొడంబడికలో రెండు భాగములు. అన్ని సంస్థానములకు వర్తించు సామాన్య

భాగము. ఆయా సంస్థానమునకు వర్తించు ప్రత్యేక భాగము. వీనిని రెంటిని సమీకరించి యొక సమాఖ్య తయారుచేసి యిండియాగవర్నమెంటువారు సంస్థానములకు పంపిరి. ఇది ప్రతి సంస్థానము పరీక్షించి తమ కోర్కెలను తెలుపవలసియుండెను. ఇందు సామాన్యభాగమును చర్చించి మార్పులను చేయుటకు సర్ అక్బరు హైదరీగారి యాధిపత్యముక్రింద సంస్థానము లొక కమిటీని నిర్ణయించిరి. ఈ కమిటీ వైస్రాయివద్దనుంచి వచ్చిన సమాఖ్యను స్తనశల్యపరీక్షగావించి తూర్పారబట్టెను. ఇందనేక మార్పులు సూచింపబడెను. రెండవ భాగము పరీక్షించుటలో దాదాపు ప్రతి సంస్థానమునకును కొన్ని ప్రత్యేక సమస్యలుండెను. వానిని శాశ్వతముగ నిర్ణయించుకొనుటకు వారు యత్నింపగడంగిరి. తమ హక్కులు పోవుచున్నవని సంస్థానములు తలచెను. హైదరీ కమిటీ నివేదిక ఫెడరేషనుకు తీవ్ర ప్రతిఘటనము గావించెను.

(3) ఈ విధాన మొక త్రికోణయుద్ధమయ్యెను. ఒకవంక బ్రిటిషు గవర్నమెంటు, రెండవవంక సంస్థానములు, మూడవవంక బ్రిటిషిండియా ప్రజలు. సంస్థా

నములు సాయమున ఫెడరల్ సభయందు, ప్రజాభిప్రాయము నరికట్టవచ్చునని యిండియా గవర్నమెంటు తలచెను. బ్రిటిషుగవర్నమెంటువారి సాయమున బ్రిటిషిండియా ప్రజల నుల్లంఘించి, తమ నిరంకుశత్వమును సాగించుకొనవచ్చునని సంస్థానములు తలంచెను. ఫెడరేషను కారణముగా సంస్థాన ప్రభుత్వములలో తల దూర్చి, యచ్చటి పరిస్థితులను బయటబెట్టవచ్చునని బ్రిటిషిండియా ప్రజానాయకులు తలంచిరి. స్వదేశ సంస్థానములకు, బ్రిటిషిండియా ప్రభుత్వమునందు జోక్యము కలుగజేసికొనుట సమ్మతమేగాని, తమ ప్రభుత్వమునందలి లోపములను బయటపెట్టుట గిట్టక పోయెను. ఇట్లు పరస్పర మపనమ్మకములతో కార్యము నెగ్గునా?

(4) ముసల్మానులు ఫెడరల్ విధానము వచ్చిన తమకు నష్టము కలుగుననియు, హిందువుల యాధిక్య మెక్కువ యగుననియు, రాష్ట్రీయ స్వాతంత్ర్యమే దానికి తార్కాణమనియు, నందుచే ఫెడరల్ విధానము నంగీకరింపజాలమనియు, గట్టిగా వాదించిరి.

(5) కొందరు స్వలాభపరులు తమ పలుకుబడి పోవునోయను భీతిచే విజ్ఞానములేని ప్రజలను మోస గించి, స్వయంకృతనాయకులై, తమ కులముల హక్కుల కేదో భంగము కలుగునని మిథ్యాప్రచారము చేయ మొదలిడిరి. నిమ్నజాతు లీవిధముగా స్వార్థపరులగు నాయకులచే ప్రాముఖ్యమునకు తేబడిరి.

హైద్రాబాదు రాయబారము ఫెడరల్ విధాన మును సూత్రముగా నంగీకరించుచు, రాజకీయములును నార్థికములునగు కొన్ని విషయముల దమ సంస్థానస్వాతం త్ర్యమును, హక్కులను, నధికారములను, కోల్పోవని పద్ధతిపై ఫెడరేషనున చేరుట కంగీరించినట్లు భావింప వచ్చును. రౌండుటేబిల్ సభల కాలమునుండి యీ విధమైన పని యెక్కువగుటచే నిజాంప్రభుత్వమున మరి యొక రాజ్యాంగశాఖ స్థాపింపబడెను. దీనికి ప్రతిభా వంతుడగు నవాబు ఆలీయావర్ జంగు బహద్దూరుగారిని కార్యదర్శిగా నిర్ణయింపబడిరి. ఈ శాఖాకార్యములు దినదినము పెరుగుచున్నవి. ప్రచురణశాఖ దీని కం గము గావింపబడెను. ఇప్పుడీ రాజ్యాంగశాఖ మిక్కిలి శ్రద్ధతో పనిచేయుచు రాజ్యాంగ విషయ

మున గవర్నమెంటుకును, శ్రీవారికిని, చర్చ -ని సల హాల నొసంగుచున్నది. ఈ ఫెడరేషను విషయమున నిచ్చటి నాయకులలో గూడ భిన్నాభిప్రాయములు ప్రబలెను. ఫెడరేషనున ప్రవేశించిన యెడల సంస్థాన ప్రత్యేక హక్కు-లు నశించునని యొక పక్ష మనెను. అట్లు నశింపకుండు పద్ధతినే ప్రవేశించుట తటస్థించునని రెండవ పక్షము వాదించెను. హైదరాబాదు రాయ బారము, ఫెడరల్ విధానమున హైదరాబాదు చేరికను గూర్చి యీ క్రింద కొన్ని నిబంధనలను నిర్ణయించెను.

(1) వర్తక, నల్లమందు శాఖల విషయమై సామాన్య సూత్రనిర్వచనముచేయు చట్టనిర్మాణాధి కారము మాత్రమే ఫెడరల్ సభ కుండవలెను.

(2) పోష్టు, నోట్లు, నాణెములు విషయమై హైదరాబాదు రాజ్యమునకు సంపూర్ణ స్వాతంత్ర్య ముండవలెను. నిజాం ప్రభువులు మొదటినుండియు నీ విషయమున స్వతంత్రాధికారమును చలాయించు చున్నారు.

(3) రైల్వేను గూర్చి యిప్పుడు రైల్వేబోర్డు చలాయించు నధికారముతప్ప మిగిలిన యావదధికారములును రాష్ట్రమునకే యుండవలెను.

(4) ప్రతి సంస్థానము తాను ఫెడరల్ సభకు సభ్యుల నెంతమందిని పంపునదియు, వా రెన్నికవలనగాని, నామినేషను వలనగాని నిర్ణయింప బడవలసినది మొదలగు విషయములన్నియు సంస్థానమునకే వదలవలెను.

(5) సంస్థానముయొక్క యంతఃప్రభుత్వమున ఫెడరల్ సభ కెట్టియధికారము నుండరాదు.

పై విషయములును, యింకనితరములును, సర్ అక్బరు హైదరీగారి సలహా ప్రకారము తుద కన్ని సంస్థానముల ప్రతినిధులు నంగీకరించిరి. ఈవిధముగా నన్ని రాయబారములలోను హైద్రాబాదు రాయబారము మార్గదర్శకమయ్యెను. ఈ రాయబారమింగ్లాండునందలి ప్రభుత్వసభ్యులతోడను, పలుకుబడిగల యితర పత్రికాధిపతులు మొదలగు వారితోడను, సంబంధము కలుగజేసుకొని, హైద్రాబాదు వ్యవహార

ములను గూర్చి యావదాంగ్లదేశసానుభూతిని బడసెను. అనేక విందు లిచ్చి యనేక విందులలో పాల్గొనిరి. అందరితోను స్నేహభావమును పెంపొందించుకొనెను. ఫెడరేషనుకు సంబంధించిన యావదార్థికరాజకీయ విషయములందును తమ సలహా నిచ్చెను. ఈ యవకాశమును పురస్కరించుకొని బీరారు సమస్యాపరిష్కారము మొదలగు నితర విషయముల నిండియా సెక్రటరీ వగైరా యుద్యోగీయులతో సంప్రదింపులు జరిపెను. వెనుక మనవిచేసిన రాకుమారుల వివాహములు నీ యవకాశముననే జరిగెను. మొదటి రాయబారవర్గములో తరువాత కొలది మార్పులు కలిగెను. నవాబు సర్ అమీన్ జంగు బహద్దూరుగారు వార్ధక్యముచే రెండవమారు వెడలలేకపోయిరి. పిక్తాల్‌గారి స్థానమును యం. యస్. ఏ. హైదరీ ఐ. సి. యస్. గారు తీసికొనిరి. మూడవ రౌండుటేబిల్ సభ తరువాత నీ రాయబార సభ్యులతోనే వెనుక చెప్పిన "రాజ్యాంగశాఖ" నేర్పరచునట్లు ప్రభువువారు ఫర్మానా దయచేసిరి. సర్ రిచర్డ్స్ ట్రెంచిగా రుపకారవేతనము గ్రహించినందున కార్య నిర్వాహక సభ్యులైన శ్రీ తిరుమోడగు

టాస్కరు ఐ. సి. యస్. గారు వారి స్థానము నాక్రమించుకొనిరి. నవాబు ఆలీయూవర్జంగు బహద్దూరుగారి కార్యదర్శిత్వమున నీ కమిటీ యితోధికముగా పనిచేయు నవకాశము కల్గజేసుకొనుచు, ప్రభుత్వముయొక్కయు, ప్రజల యొక్కయు మన్ననలకు పాత్రమయ్యెను.

**మెకంజీ కమిటీ నివేదిక:**

వెనుక శ్రీప్రభువువా రెంత విద్యాప్రియులో, యా విద్యాప్రియత్వ మూస్మానియా విశ్వవిద్యాలయ స్థాపనము మొదలగు కార్యములయం దెట్లు పరిణమించెనో, తెలిసికొనియుంటిమి. విద్యావిషయమున నెంత శ్రమచేసినను తృప్తులగుటకు వీలులేదు. ప్రస్తుతవిద్య తనధర్మమును నిర్వర్తించుచున్నదా? విద్యా కార్యములు రెం డనవచ్చును.

(1) విజ్ఞానము నిచ్చి, హృదయవికాసమును, శాంతిని, సమదృష్టిని, కలుగజేసి, జీవితమును నైతిక మొనర్చుట.

(2) ప్రతివ్యక్తికిని తన స్వతంత్రముగ జీవన మొనర్చు శక్తిని కలుగజేయుట.

ప్రస్తుత విద్య విజ్ఞానము నిచ్చుచున్న దన వచ్చును గాని, నిరుద్యోగ సమస్యను మరింత గాఢ మొనర్చు

చున్నది. ఇట్టి కొరతను తీర్చుటకై పారిశ్రామిక సాంకేతిక విద్య యావశ్యకము. అనగా విద్య తత్ఫలితకు స్వతంత్ర జీవనము చేసికొనుటకై యేదోయొక వృత్తిని కల్పింపవలయును. ఇప్పుడున్న పద్ధతినిబట్టి యున్నత విద్యకు తగనివారు కూడ దానిని జదివి విఫల మనోరథులగుట తటస్థించుచున్నది. ప్రతి వాడును క్రమముగా విశ్వవిద్యాలయము త్రోవనే పట్టుచున్నాడు. దాన నిరుద్యోగము మరింత హెచ్చుచున్నది. ఈ విషయముల నన్నిటిని సంపూర్ణముగ కనిపెట్టి, శ్రీ హైదరీగారు విద్యాధికులచే ప్రస్తుత విద్యా విషయములను చర్చింపజేసి, సలహాగొనుట మంచిదని తలచి, శ్రీ కీ॥ శే॥ డాక్టరు మెకంజీగారి యధ్యక్షత్వమున నొక కమిటీ నేర్పాటుచేసిరి. మెకంజీగారు గాక హైద్రాబాదు విద్యాశాఖాధ్యక్షులగు ఖాన్ ఫజల్ మహమ్మదుఖాన్ గారా సంఘమున సభ్యులు. ఈ కమిటీకి, హైద్రాబాదునందలి విద్యాధికుల వద్దనుండి యభిప్రాయములను గ్రహించి తమ సలహాల నొసంగవలయునని సూచింపబడెను. అట్లే వారు విద్యాధికుల సాక్ష్యమును తీసికొని తుద కీ క్రింది సలహాల నొసంగిరి.

(1) క్రిందనుంచి బి, ఏ, వరకు నీ క్రింది విధముగా విద్యావిధానమును విభజింపవలెను.

| | | | | | |
|---|---|---|---|---|---|
| ప్రాథమికవిద్య | 1 | నుండి | 5 | తరగతులు | 5 యేండ్లు |
| మాధ్యమికవిద్య | VI | ,, | IX | ,, | 4 |
| ఉన్నతవిద్య | X | ,, | XII | ,, | 3 |
| విశ్వవిద్యాలయ విద్య | XIII | ,, | XV | ,, | 3 |
| | | | | మొత్తము | 15 యేండ్లు |

ప్రతి తరగతివిద్యకును నిర్దిష్టమైన యొక యుద్దేశ ముండవలెను. ప్రాథమిక తరగతిలో ప్రతి విద్యార్థికిని నవశ్యముగా కావలసిన పునాది జ్ఞానము నియ్యవలెను. మధ్యమ విద్యాకాలమున పట్టణములందలి బాలురకు చేతిపరిశ్రమలయందును, గ్రామ పాఠశాలల యందలి బాలురకు వ్యవసాయమునందును, నభినివేశము కలుగ జేయవలెను. ఉన్నతవిద్యాకాలమున కళలు, శాస్త్రములు, పరిశ్రమలు, మొదలగువానియందు విద్యార్థుల ప్రత్యేక రుచినిబట్టి తరిబీతు నియ్యవలెను.

(2) ఇప్పుడున్నట్లుగాక మాధ్యమికోన్నతవిద్యా విషయక నిర్వహణమునకై యొక ప్రత్యేక బోర్డును స్థాపింపవలయును.

(3) నిజాంకాలేజిని మద్రాసు విశ్వవిద్యాలయమునుండి విడదీసి, యింగ్లీషు బోధనభాషగా గల యూస్మానియ విశ్వ విద్యాలయాంగముగా చేయ వలయును.

(4) మొదటి 12 సంవత్సరములలో 9 సంవత్సరముల తరువాత నొక పరీక్షయు, 12 సంవత్సరముల తరువాత మరియొకపరీక్షయు నుండవలెను.

(5) ఊస్మానియా విశ్వవిద్యాలయమునను, నిజాం కళాశాలయందును, విశ్వవిద్యాలయ విద్య పొందుట కర్హతకలవారినే చేర్చుకొని విద్య గరుపవలెను.

(6) పట్టణ, గ్రామ పాఠశాలలలోని విద్యా ప్రణాళికలలో భేదముండవలెను.

(7) స్త్రీవిద్యావిషయములను నిర్ణయించుటకు స్త్రీసభ్యులను బోర్డునందు చేర్చుకొని వారి సమ్మతిని కూడ పడయు నేర్పాట్లు గావింపవలెను.

ఈ కమిటీ, పై ముఖ్యవిషయములగాక ప్రాథమిక విద్య, స్త్రీవిద్య, బోధనభాష మొదలగు ననేక విషయములను చర్చించి సలహాల నొసంగెను. తన సలహాప్రకారము మార్చిన విద్యా వ్యవహారమును స్వయముగా నమలులోనుంచి వ్యాప్తము చేయుటకు పాపము! డాక్టరు మెకంజీగారికి పరమేశ్వరు డాయుర్భాగ్యము నియ్యలేదు. శ్రీవారి నివేదికను వెంటనే యంగీకరించి యీ క్రింది యాజ్ఞలను గావించిరి.

(1) ప్రస్తుత మింకను కొంతకాలమువరకు నిజాం కళాశాలను మద్రాసు విశ్వవిద్యాలయ సంబంధమునే కలిగియుండున ట్లుంచవలెను.

(2) విద్యాబోర్డునందు డి. పి. డబ్లియు మెంబరుచే నియమింపబడిన యొక సభ్యుడుండవలెను.

(3) మరియు ప్రజాభిప్రాయమును విశదీకరించుటకై బోర్డులో నుద్యోగేతరులగు పెద్దమనుష్యు లుండవలెను.

(4) బోర్డు చేయు పనుల కన్నిటికిని ముందుగ ప్రజాభిప్రాయమును కనుగొనవలెను.

(5) ప్రతి యైదు సంవత్సరముల తుదను నీ ప్రణాళిక యెట్లు పనిచేయుచున్నదో గవర్నమెంటువారికి నివేదికను పంపవలెను.

ఈ ప్రణాళిక నమలున నుంచుటకై శ్రీ ప్రభువుగారి సోదరులగు శ్రీ బసాలత్ జా బహద్దూరువారి యాధిపత్యమును, విద్యావిషయముల నత్యంతానుభవముగల శ్రీ ఆలీఅక్బరుగారి కార్యదర్శిత్వమును గల యొక బోర్డు పనిచేయుచున్నది. ప్రస్తుతము స్త్రీవిద్యను గూర్చిన సలహా లమలులో నుంచునట్లు తీర్మానింపబడినది. మాధ్యమిక విద్యాంతమువరకు విద్యార్థిని యొక్క మాతృభాషలో విద్యను గరపవలెనని యుత్తరువు లియ్యబడినట్లు తెలియుచున్నది. బాలికల కిచ్చిన ప్రయోజనమునే బాలురకును కలుగజేయుటయేగాక, యీ దేశభాషలలో విద్యనుగరపు పద్ధతిని యున్నత విద్యకుకూడ వర్తింపజేసి ఉర్దూయందు చూపించుచున్న యభిమానమునే యితర ముల్కీ భాషలపైనకూడ చూపవలెనని ప్రజలాశించుచున్నారు.[1]

1 ఇటీవల స్థానికనాయకులు కొందరు, ప్రభుత్వము దేశభాషలనుగూర్చి తగినంత

ఇట్టి ప్రణాళిక నమలులోనికి పూర్తిగా తెచ్చి, యిచ్చటి విద్యాసమస్యలను సాధించి, నిరుద్యోగమును తరిమివేసినయెడల, దేశభాషలో కళాశాలావిద్యను గరపి యావద్భారతమునకు మార్గమును చూపించిన నిజాంప్రభుత్వ మీ విషయమునగూడ యావద్భారతమునకును దారిచూపును.

శ్రద్ధవహించుటలేదని విమర్శింపమొదలిడినారు. ఉస్మానియా విశ్వవిద్యాలయమున నిప్పుడు ముస్లిమేతర విద్యార్థుల కియ్యబడుచున్న నైతిక విద్యావిధానమును రద్దుపరచి, యే జాతి (అనగా నాంధ్ర, మహారాష్ట్ర కర్నాట) వారికాజాతి విజ్ఞానమును వారి మాతృభాషలో చెప్పు నేర్పాట్లు గావించునట్లు నాయకులును, ప్రభుత్వము వారును రాజీపడినట్లు తెలియుచున్నది. త్వరలో నిది యమలులోనికి రావలెనని కూడ ప్రజలాశించుచున్నారు.

౬

**వైస్రాయిల రాకలు :**[1]

సామ్రాజ్యప్రభుత్వము తన పలుకుబడిని వృద్ధి చేసికొనుటకును, వచ్చిన ప్రతి క్రొత్త వైస్రాయిల కిచ్చటి పరిస్థితులను స్వీయముగ తెలిసికొనుటకును, చేసెడిపనులలో వైస్రాయిల యొక్కయు గవర్నరుల యొక్కయు సంచారమొకటి. మరియు సామ్రాజ్యాధికారప్రదర్శనముకూడ నీ సంచారముల యుద్దేశము. ఈ దశవర్షకాలములో ముగ్గురు వైస్రాయిలకు హైద్రాబాదాతిథ్య మిచ్చెను.

(1) ఇర్విను ప్రభువు — డిసెంబరు 1929
(2) విల్లింగుడను ప్రభువు — నవంబరు 1933
(3) లిన్‌లిత్గో ప్రభువు — జనవరి 1938

ముగ్గురికినికూడ హైద్రాబాదు ప్రభువుగారును ప్రజలును, హృదయపూర్వకమగు స్వాగతమొనర్చి తమ సంతసమును వెలిబుచ్చిరి. 2, 3 వైస్రాయిలు

[1] వైస్రాయి స్వదేశరాజ్యములకు వచ్చుట రిప్పన్‌ప్రభువుతో నారంభించెను.

ఫెడరేషనును గూర్చిన ప్రచారముకూడ ప్రకటనా ద్యము గావించిరి. శ్రీవారుకూడ తమ కర్తవ్యము తమకు తెలియుననియు, తమ ప్రజల క్షేమలాభముల కొఱకు ప్రయత్నించుటకు తాము వెనుదీయమనియు, సెలవిచ్చిరి. లిన్లిత్గో ప్రభువు వచ్చినప్పుడు బీరారును గూర్చిన తుది యొడంబడికపై సంతకములు చేయుట తటస్థించెను. ఆయన యాగమన "మేకక్రియాద్వ్యర్థకరీ" యన్నట్లు, చాలాకాలమునుండి కలవర పరచుచున్న యొక సమస్య పరిష్కారము చేసెను. ఆ విషయము మరియొకచో చర్చింపబడును. ఈ యాగమనము లును, ద్రవ్యవ్యయములును, తప్పనిసరివి. కాని ప్రభువులును, వైస్రాయిలును ముఖాముఖిన కలసి, యొకరి నొకరు తెలుసుకొనుట యగును. పైయాగమనములు గాక వెనుకటి వైస్రాయియైన రీడింగు ప్రభువుగారు 1930 డిసెంబరు మాసమున కార్యాంతరమునకై యిండియా వచ్చి యా యవకాశమును పురస్కరించుకొని యెల్లోరా యజంతా చిత్రములను దర్శించి హైద్రాబాదుకు వచ్చి తమ వెనుకటి పరిచయమును బలపరచుకొని పోయిరి!

**ఇతర విషయములు :**

ఇచ్చట క్రింది సంగతులు చెప్పవలెను.

1. గ్రామోద్ధరణము.
2. శిశుపోషణము.
3. దేశీయ వైద్యము.
4. మద్యపాన సమస్య.

**గ్రామోద్ధరణము :**

శ్రీవారి కీ పైవిషయములందు మిక్కిలి యభినివే శము. ఒక్క వీనియందే యననేల ? ప్రజాక్షేమకరము లగు సర్వవిషయములందును నిట్టి యభినివేశమన్న సత్యము చెప్పినట్లగును ! గ్రామోద్ధరణ సంఘమొకటి ప్రత్యేకముగా పనిచేయుచున్నది. ఈ సంఘము, రోడ్డు సంఘము, రైల్వేసంఘము, విమాన సంఘము ప్రచురణ బోర్డు, మొదలగు సంఘములయొక్క సహకారముతో పనిచేయుచున్నది. డి. పి. డబ్లియు స్థానిక శాఖలచే రాష్ట్రమంతయు కొన్ని వేలమైళ్ళరోడ్లు వేయబడినవి. రాష్ట్రమునంతట గ్రామజనుల సౌకర్యమునకై రైలు రోడ్డు ప్రయాణసౌకర్యములు సమ్మిళితములు చేయబడి నవి. మంచినీళ్ళకు కష్టముగల గ్రామములందు బావులు

త్రవ్వబడుచున్నవి. ఇందుకొరకొక యుద్యోగిబృందము నియమింపబడినది. సహకార, వ్యవసాయ, పారిశ్రామ శాఖలు గ్రామోద్ధరణమునకై ప్రదర్శనాదుల చేసి మిక్కిలి పాటుపడుచున్నది. ఇటీవలనే ఋణనివారణ శాసనముచేసి గ్రామస్థుల ఋణములను తీర్చువిషయమై యేర్పాట్లు గావింపబడినవి. ఋణదాత రైతుభూమిని గొనకుండుటకై యొకశాసనము గావింపబడినది.[1] పెద్ద పట్టణము లన్నియు, విద్యుచ్ఛాఖవారిచే దీపాలంకార యుతములు గావింపబడుచున్నవి. ఆరోగ్యశాఖోద్యోగులు మొదలగువారు గ్రామములకు వెడలి ప్రచారము చేయుచున్నారు. 1932 సంవత్సరము తరువాత ప్రైవేటు బస్సు సర్వీసులన్నియు రద్దుపరచి బస్సుసర్వీసు సర్కారువారే నడపుచున్నారు. ఇప్పుడట్టి 271 బస్సులు రాష్ట్రరథ్యలపై నడచుచున్నవి. ఇవి 4000 మైళ్ల రోడ్లపై నడచుచున్నవి. ఈవిధముగా నిదివరలో సులభముగా వెడలుటకు వీలులేనిగ్రామములుకూడ ప్రయాణ సౌకర్యములు కలుగజేయ బడుచున్నవి. గ్రామములలో

1 భూస్వామి సాయమునకై భూమితనఖాబ్యాం కొకటి స్థాపింపనున్నట్లు తెలియుచున్నది.

పండు సమస్తపదార్థములు సులభముగ బయటికి వెడలి
రైతుకు ధర లభించుటకు సౌకర్యమేర్పడినది. ధరల
నిర్ణయమునకై యొక మార్కెటింగుబోర్డు నేర్పాటు
చేసినారు. ఈబోర్డు గ్రామములలోను, పట్టణముల
లోను, స్థానికవర్తకులయొక్కయు, రైతులయొక్కయు
సహాకారముతో పనిచేయుచుండును.

**శిశుపోషణము :**

శ్రీవారికి పసిపిల్లలయందు మిక్కిలి ప్రీతి. అందుచే
శిశురక్షణమునకై యనేక సౌకర్యము లొనర్పబడినవి.
ఇటీవల కొన్ని సంవత్సరముల క్రిందట శ్రీవారికొక
పుత్రుడుగలిగి కొలదిదినములే జీవించెను. ఆబాలుడు
శ్రీవారిహృదయమున శాశ్వతమైన మార్పొకటి కలి
గించెను. తాము సార్వభౌములై యుండియు, పిల్లవానిని
రక్షించుకొన లేకపోగా, బీదజనులెట్లు వైద్యసహా
యము లేక యల్లాడుచున్నారో యను భావము శ్రీవారి
హృదయమున నాటెను. అప్పటినుండి శ్రీవారికి శిశు
పోషణమన్న రెండవస్వభావమై పోయెను. అందుచేతనే
తమ రజతోత్సవమున, సంతోషమును వెలిబుచ్చు

నుత్సవములను జరుపుటకై ప్రజానాయకులు వసూలు చేసిన ద్రవ్యమును చాలభాగము శిశుపోషణమునకై వినియోగించుట తమ యిచ్ఛయని శ్రీవారు సెలవిచ్చిరి.

**దేశీయవైద్యము :**

శ్రీవారు దేశభక్తాగ్రేసరులని చెప్పియుంటిని. వారికి దేశీయ వైద్యమునెడల నపారగౌరవముగలదు. చారుమినారువద్ద గొప్పయునానీ ఆయుర్వేద వైద్యాలయమును కట్టించి శ్రీవారు స్వయముగా దానిని తెరచుచు దేశీయవైద్యముపై తమకున్న యభిమానమును మధురవాక్కులతో వెలిబుచ్చిరి. ఇప్పుడు యునానీ ఆయుర్వేదవైద్యాలయములు రాష్ట్రములో ననేకస్థలములయందు పనిచేయుచున్నవి. శ్రీవారి ప్రజలందరును శ్రీవారి దేశభక్తినలవడ జేసికొన్న నెంతబాగుండును ?

**మద్యపాన సమస్య :**

ఇది యీయొక్క రాష్ట్రమునకు మాత్రమే సంబంధించినదికాదు. ఏ మతమును త్రాగుడును క్షమింపదు. అయినను నీ యలవాటు ప్రపంచమునందంతటను వ్యాపించియున్నది. శ్రీవారి కీ విషయమున

మిక్కిలి విచారము కలదు. శ్రీవారి పోషణమున హైదరాబాదు రాష్ట్రమున మితపానోద్యమము ప్రారంభింపబడి పనిచేయుచున్నది. ఈ విషయమున రాష్ట్ర న్యాయశాఖామంత్రులుగానుండి విరమించిన శ్రీ మీర్జా యార్జింగు బహద్దూరుగారు చేయుచున్న కృషి మిక్కిలి ప్రశంసనీయము. శ్రీవారీ విషయమున నొక ఫర్మానాను ప్రసాదించిరి. దాని నీ మితపాన సంఘమువారు రాష్ట్రమునం దంతటను ప్రచురించి ప్రజల నుద్బోధించిరి. ప్రదర్శనములు సల్పియు, కరపత్రములు పంచిపెట్టియు, నుపన్యాసము లిప్పించియు, పత్రికలను ప్రచురించియు, నీశాఖ మద్యపాన నిర్మూలనమునకై మిక్కిలి పాటుపడుచున్నది. బ్రిటిషిండియా యందు కాంగ్రెసు మంత్రివర్గములు వచ్చినతరువాత నీ సమస్య ముందునకు తేబడి, కొంతకాలము మద్రాసు, బొంబాయి రాష్ట్రములలో కొన్నిభాగముల మద్యపాన నిరోధ మమలులోనున్నది. ఇచ్చట రెండు విషయములు కలవు. మొదటిది స్వభావము మార్చి మిక్కిలి బలిష్ఠమైన యలవాటును మాన్పుట యనునది. ఈ సమస్యను సంపూర్ణముగా కొనసాగించుటకు చాల కాలము పట్టకతప్పదు. రెండవది రాష్ట్రమునకు

మద్యము ముఖ్యాదాయమును చేకూర్చు వస్తువులలో నొకటి యగుట. ప్రజాక్షేమమునకై యాదాయము వచ్చు వేరుమార్గములను కనుగొని యీ యలవాటును నిర్మూలించుట యవసరమని చెప్పకతప్పదు. శ్రీవారి కాలమున నీ వరదానము ప్రజలకు లభింపగలదని యాశింపవచ్చును.

---



# బీరారు సమస్య [1]

బీరారు విస్తీర్ణము: 17,767 చతురపు మైళ్లు,
జనసంఖ్య : **3,441,838** (వెనుకటి లెక్క)

బీరారు రాజ్యమును గూర్చి ముచ్చటించక పూర్వము పూర్వ పరిస్థితులనుగూర్చి కొంచెము మనవి చేయవలసియున్నది. హిందూస్థానములోని రాజుల యంతఃకలహముల నూతగా గొని పాశ్చాత్యు లిచ్చట రాజ్యమును స్థాపింప ప్రయత్నించిరి. ఇట్లు స్పర్ధించిన వారిలో ఫ్రెంచి బ్రిటిషువారు ముఖ్యులు. అప్పటి పరిస్థితులు మిక్కిలి విషమముగా నుండెను. మొగలు సామ్రాజ్యము భిన్నమయ్యెను. మహారాష్ట్రులు ప్రబలులైరి. రాజపుత్రస్థానమందలి రాజులందరును బలహీనులైరి. దక్షిణమునుండి హైదరాలీ టిప్పుసుల్తానులు రాజ్యస్థాపనకై గడంగిరి. జాతులన్నియు నొండొరులతో కలహించుచుండిరి. దేశమున శాంతి లేకుండెను.

1 ఈ భాగమును రచించుటలో శ్రీ కృష్ణస్వామి ముదిరాజుగారు రచించిన "పిక్టోరియల్ హైద్రాబాదు" అను పుస్తక ముపకారకమయ్యెను.

ఇట్టి పరిస్థితులను గమనించి వైదేశికులు తమ ప్రతి భచే నిచ్చటి యంతఃకలహములను పురస్కరించుకొని క్రమక్రమముగా రాజ్యమును స్థాపించి బలపరచు కొనుట యయ్యెను. వీరిలో ఫ్రెంచివారు క్రమముగా బలహీనులైరి. బ్రిటిషువారికి నవకాశము చిక్కెను. మొగలులు క్షీణించక దక్షిణమునుండి హైదరల్లీ టిప్పు లును, పశ్చిమమునుండి మహారాష్ట్రులును, మధ్యదేశ మున నిజాంప్రభువును, కలిసి బ్రిటిషు సామ్రాజ్యస్థాప నము నెదిరించినయెడల నీ దేశచరిత్ర యిట్లుండెడిది కాదని చారిత్రికుల యభిప్రాయము. ఇప్పటికిని నీమైక మత్య రాహిత్యమే మన దేశాభ్యుదయమునకు ప్రబల శత్రువు. ఇన్నివందల సంవత్సరములు పరరాజులు మన దేశము నేలినను, దానివలన వచ్చుననర్థముల ననుభ వించుచున్నను, మనవారు కలియకపోవుట కడుంగడు శోచనీయము.

ప్రథమ ఆసఫ్జాప్రభువు ఫ్రెంచివారితో స్నేహ ముగానున్నను, బ్రిటిషువారితో నెన్నడును కలహించ లేదు. అనగా నిద్దరికిని యుద్ధమెన్నడును కలుగలేదు. మరియు దక్షిణమున ప్రబలుచున్న టిప్పు నెదిరించియు,

ప్రబలు లగుచున్న మహారాష్ట్రులపై దండెత్తియు బ్రిటిషు రాజ్యస్థాపనమునకు సాయమొనర్చెను. ఇట్టి స్నేహభావమునే సిపాయికలకల కాలమునగూడ చూపెను. ఇట్టివాని కన్నిటికిని కృతజ్ఞతగా నీ బీరారు సమస్య నిర్ధారణము చేయబడెను! బీరారుపరగణా నెన్న డును బ్రిటిషువారుయుద్ధమున స్వాధీనము చేసికొనియుండ లేదు. అందుచేతనే యొడంబడికకు పాత్రమయ్యెను. బలము చేత జయించని భూభాగమునకు సంబంధించిన విషయమున నింతకాఠిన్యము వహించుట బ్రిటిషువారికి తగనిదని ప్రతి బుద్ధిమంతుడును తప్పక యనును. బ్రిటి షిండియా యందలి యితర స్వదేశ రాజ్యములకును హైదరాబాదునకును భేదము కలదు. అనేకేతరరాజ్య ములవలె హైద్రాబాదు బ్రిటిషువారిచేసృష్టింపబడిగాని, వారి దయపై నాధారపడిగాని యున్న రాజ్యముకాదు. అదిగాక బ్రిటిషువారి స్థైర్యమునకు ముఖ్యాధార భూత మైన దీ రాజ్యము. కావుననే న్యాయబుద్ధిగలవా రందరు నీవిషయమున తమ బలమును చూచుకొని బ్రిటిషువా రవలంబించిన నీతిని చూచి జుగుప్సావంతులగుట !

జయింపబడని రాష్ట్రమునకును, బ్రిటిషు గవర్న మెంటువారికిని, సమానులమధ్యవలె యొడంబడిక జరుగ

వలసి యుండెను. విస్తీర్ణమునను, బలమునను బ్రిటిషు గవర్నమెంటు హైద్రాబాదుకంటె పెద్దదైనను, నైతికముగను, న్యాయానుసారముగను, రెండు సమానములే యనవలసి యున్నది. బ్రిటిషు గవర్నమెంటు సర్వసామ్రాట్టను భావ మొడంబడికయం దుండగూడదు. మూలకథ నుండి ప్రారంభింతును. క్రీ. శ. 1766 సంవత్సరమున నిజాం ప్రభువునకును బ్రిటిషు యీస్టిండియా కంపెనీ వారికిని మొదటి యొడంబడిక జరిగెను. అందీ క్రింది విషయములుండెను.

(1) కంపెనీవారు నిజాం ప్రభువునకు వలసినప్పుడు సాయ మొనర్పవలెను.

(2) అందు క్రింద నుత్తరసర్కారులు శాశ్వతముగ కంపెనీవారికి స్వాధీనము చేయవలెను.

(3) కంపెనీవారి మిత్రులపై నిజాంప్రభువు దండెత్తినపుడు కంపెనీవారి సాయము కోరరాదు.

**1798 ఒడంబడిక :**

ఈ యొడంబడికచే వెనుకటి 1766 సంవత్సరపు టొడంబడిక యాకారము నిర్ణయింపబడెను. ఈ క్రొత్త యొడంబడిక ప్రకారము 6000 సిపాయిలును వలసిన

ఫిరంగులునుగల బలమొకటి హైద్రాబాదున నుంచబడునట్లును, నది హైద్రాబాదు రాజ్యముయొక్క యంతర్బహిశ్శత్రువులను శిక్షించుటలో నుపయోగించునట్లును, ఖర్చులక్రింద సంవత్సరమునకు నిజాంప్రభువు కంపెనీవారికి 24 లక్షలరూపాయి లిచ్చునట్లును ఖరారు జరిగెను.

**1800 మార్పు :**

వెనుకటి యొడంబడిక ప్రకారము కంపెనీవారికి ప్రతివత్సరము నియ్యవలసిన 24 లక్ష లియ్యకుండ శాశ్వతముగ బళ్లారికడపజిల్లాలు కంపెనీవారి కిచ్చునట్లును, నిజాంప్రభువు కోరినప్పుడు కంపెనీవారు సేనను పంపునట్లును మార్పు జరిగెను. ఈ మార్పుప్రకార మది వరలో ఫ్రెంచిసేనానుల తర్ఫీతులోనున్న నిజాంప్రభువు యొక్క స్వంతసైన్యమును తీసివేయవలసి యుండెను. కంపెనీవారు రాజ్యములోపలి కలహముల నణచునట్లొప్పుకొనుటచే నిజాంప్రభువునకు సేనయొక్క యావశ్యకత లేకపోయెను. కంపెనీవారికర్తవ్యము హెచ్చెను. న్యాయబుద్ధితో నాలోచించిన 1800 మార్పువచ్చిన

ప్పుడు వెనుకటి ప్రయోజనముకొరకే యిది పుట్టినందున, సర్కారులను కంపెనీవారు నిజాం ప్రభువునకు తిరిగి యియ్యవలసియుండెను ! అట్లు జరుగలేదు.

అన్యాయము :

పై 1800 యొడంబడిక జరిగిన మరువత్సరము ననే షోరాపూరురాజు నిజాము ప్రభువున కియ్యవలసిన కప్పము నెగబెట్టెను. అప్పుడు కంపెనీవారిని కోరగా మొదట సహాయమునంపుట నిరాకరించి, తుదకు మిక్కిలి యాలస్యముగా నంపిరి. తరువాత 1804 వత్సరమున "హైద్రాబాదుసైన్యము"ను పేరుతో వేరుబలమును సమకూర్చుకొని, దానిని కంపెనీ యధికారమున నుంచి, దాని ఖర్చునకై హైద్రాబాదు రాజ్యముయొక్క యాదాయమునుండి ద్రవ్యము వేరుపరుపవలెనని గవర్నరుజనరలు నిజాం ప్రభువును బలవంతపెట్టగా, గత్యంతరములేక యొప్పుకొనవలసి వచ్చెను. ఏ పనికొరకై బళ్లారి కడపజిల్లాలును, నుత్తరసర్కారులును, కంపెనీవారి కియ్యబడినవో, యాపనికొరకే మరల నీబలవంతమైన కార్యమును చేయవలసివచ్చెను. ఎంతయన్యాయము ! స్వంతసైన్యమును తీసివేసినందువలనను, కంపె

నీవారు బలవంతులగుటచేతను, నిజాంప్రభు వంగీకరింప వలసి వచ్చెను. మొదట నీ "హైద్రాబాదు సైన్యము" నకు 20 లక్షలరూప్యముల వ్యయము మదింపబడెను. క్రమముగా నీ ఖర్చు 40 లక్షలవరకు పెరిగెను. అప్పుడు హైద్రాబాదురాజ్యాదాయములోనుంచి సంపూర్తిగా ప్రతివత్సరమును తీర్చుట కష్టమయ్యెను. 1851 సంవత్స రాంతమునకు 54 లక్షలు బాకీయయ్యెను. ఈమొత్తము నిజాంప్రభువు క్రమముగా తీర్చుటకు శక్తికలవాడైనను, గవర్నరు జనరలు, వెనుకయిచ్చిన భూభాగముగాక యీమొత్తముక్రింద మరలకొంత రాజ్యభాగము నియ్య వలెనని తెలియచేసెను. అన్యాయముపై నన్యాయము! ఈ మొత్తమునకువడ్డీ, విధింపబడెను. పాపము! నిజాం ప్రభువు నగలమ్మితీర్చినను, 1852 సంవత్సరము నాటికి 50 లక్షల ఋణము మిగిలెను. అప్పటి గవర్నరుజనర లగు డెల్‌హౌసీ ప్రభువు బలవంతముచేయగా, తుదకు నిజాంప్రభువు మరియొక యొడంబడిక చేసుకొనవలసి వచ్చెను. ఇచ్చట డల్హౌసీప్రభువుచేసినపనియొకటి చెప్ప వలయును. నిజాంప్రభువు భూభాగమును శాశ్వతముగ గాని, తాత్కాలికముగగాని, యిచ్చుటకు ప్రథమమున చాలాకాలము వరకు నిరాకరింపగా, రెసిడెంటుద్వారా

యొడంబడిక చేసికొనని యెడల హైద్రాబాదుపైకి పంపుటకు సేన సిద్ధముచేయబడినదని నిజాంప్రభువు నకు తెలుపబడెను! మరునాడే నిజాంప్రభువు తప్పని సరిగా నొప్పుకొనవలసివచ్చెను! 1853 సంవత్సరపు టొడంబడికయొక్క యుదంత మిట్టిది!

**1853 ఒడంబడిక :**

ఒక్క ప్రశ్న వేయనగును. న్యాయముగా నిజాం ప్రభువు బాకీపడినాడా? లేదని సమాధాన మియ్య వలెను. సైనికసహాయముకొరకు త్తరసర్కారు లియ్య బడెను. ఆ సహాయమునకే 6000 సైన్య ముంచబడి, దాని ఖర్చు నిజాంప్రభువు భరింపవలసివచ్చెను. అప్పు డు త్తరసర్కారులు వాపసు చేయవలసియుండెను! అట్లు జరుగలేదు. పోనిండు! ఈ నూతన సైన్యమున కగు 24 లక్షల వ్యయమునకై యే బళ్ళారి కడప జిల్లా లియ్య బడెను. అప్పటికీ జిల్లాల సంవత్సరాదాయము 63 లక్షల రూప్యములు. ప్రతిసంవత్సరము కావలసిన 24 లక్షల క్రింద 63 లక్షల సంవత్సరాదాయము వశము చేయ బడెను! తరువాత "హైదరాబాదు సైన్యము" స్థాపింప బడెను. దానిఖర్చు నిజాంప్రభువు భరింపవలసివచ్చెను.

తుదకు తేలినఋణము దీనికొరకైనదే? ఒకేపనికియుత్తర సర్కారులు బళ్లారి కడపజిల్లాలు పోయినను, నా పనికే మరల ఋణము తేలెను. ఇట్టి వర్తక మెచ్చటనైన నుండునా? ఇన్ని సంవత్సరములు ప్రతిసంవత్సరము 24లక్ష లకుగాను 63 లక్షల యాదాయము ననుభవించిరిగావున, న్యాయ ప్రకార మీ ఋణము తీసివేయవలసి యుండెను. సత్య మాలోచించిన గాని, న్యాయమైన లెక్కలను తయారు చేసినగాని, నిజాం ప్రభువు బాకీ లేడనియే చెప్పవలసి యున్నది. ఈ విషయమున నిజాంప్రభు మంత్రులు - మహారాజా చందూలాల్ బహద్దూరు మొదలగువారు-వహించిన యశ్రద్ధ యెంత మాత్రమును క్షంతవ్యము కాదు. లేని ఋణముకొరకై బీరారొడంబడిక యమలు లోనికి వచ్చెను !

ఈ యొడంబడికయం దీ క్రింది షరతు లుండెను.

(1) బీరారు కంపెనీవారి యధికారము క్రింద నుండ వలెను.

(2) బాకీయున్న 50 లక్షల రూపాయల నీ పరగణా యాదాయమునుండి చెల్లుపెట్టుకొనవలెను.

(3) ఇందలి నుండియే 'హైద్రాబాదు సైన్యమున' కగువ్యయమును భరింపవలెను.

(4) ఏటేట నాదాయవ్యయ పట్టికను నిజాం ప్రభువు నకు జూపి మిగిలిన ద్రవ్యమును వాపసివ్వవలెను.

(5) ఈ యొడంబడిక తాత్కాలికముగనే యుండును.

(6) నిజాం ప్రభు వీ సేన తన కక్కర లేదనవచ్చును. అనగా నాయన కవసర మున్నంతకాలమే యీ సైన్య ముండవలెను.

(7) పరగణా స్వత్వము నిజాంప్రభువుదే యగును.

పై షరతులను చూచిన నీ పరగణా స్వాధీనము శాశ్వతము కాదనియు, నిజాంప్రభువు తన కిష్టము వచ్చి నప్పుడుగాని, యనవసరమని తలచినప్పుడుగాని, యీ సైన్యము తన కక్కర లేదనవచ్చుననియు, నప్పుడు బీరారును నిజాంప్రభువున కియ్యవలయు ననియు, తెలుసుకొనగలము. మరల 1860 సంవత్సమున నీయొడంబడిక యర్థము విశదము చేసుకొన బడెను. దాని ప్రకారము పరగణా వశీకరణము తాత్కాలిక మనియు, నంతవరకు కంపెనీవారు ట్రస్టీలుగ నుందురనియు, ముందీ పరగణా

నిజాంప్రభువుకు వశమొనర్చినపు డదివరలో కంపెనీవారందు పెట్టిన ఖర్చులు మరల పుచ్చుకొనమనియు, గట్టి చేయబడెను. వెనుకటిది మరచినను, గ్రుడ్డిలో మెల్లయని సంతసింపవలసియుండెను. కాని ముందు ప్రవర్తనమును చూడుడు ! అప్పటి కొన్ని యుత్తర ప్రత్యుత్తరములను చూచిన, కంపెనీ డైరక్టరులలో కొందరికి వారి ప్రవర్తనము వారికే సరిపడనట్లు తెలియును. సర్ జేమ్సు లూషింగ్టను నాయన యుత్తరమున నిట్లు కలదు.

“గట్టియొత్తిడి మనకే యపకారక మగును. ఈ విషమపరిస్థితులకును మనమే కారకుల మనియు, నే నొడంబడికకు సంబంధము లేనట్టియు, కఠినమైనట్టియు కోరికలను కోరితిమనియు, కొంతకాలమునుండి నామనమున నమ్మకము కలుగుచున్నది.” పైవాక్యములు నిజమనియు, తమ స్వలాభముకొరకై యుంచుకొన్న సైన్యమునకగు వ్యయము నిజాంప్రభువునుండి గ్రహింపబడినదనియు, నిది యన్యాయమనియు నప్పటి రెసిడెంటు వ్రాసియుండెను. ఈ యుద్యోగియే తమకు నిజాం ప్రభువునుండి న్యాయముగ రావలసినదానికంటె 5 కోట్ల రూప్యము లెక్కువగా వచ్చెనని చెప్పుచున్నాడు!

ఇట్టి న్యాయ మెచ్చటనైన నుండునా ! ఇట్టి కారణ ములే శ్రీవారికి తన హక్కు- న్యాయబద్ధమైనదనియు, దానిని పొందుటకు గట్టి ప్రయత్నము చేయవలెననియు, పురికొల్పెను! మరియు నీ సైన్యము రాష్ట్రమున కనవసరమగుటయేగాక, యవసర మగునప్పు డుపయోగింపక పోయెను. డెల్‌హౌసీ ప్రభువుగారి రాజ్యతంత్ర మిట్టిది! ఇట్టి పనులే 1857 సంవత్సరపు కలతలకు కారణము లయ్యెను! అట్టి సమయమున వెనుకటి యన్యాయమును మనమున నుంచుకొనక, తిరుగుబాటులో చేరకుండుట నిజాంప్రభువుయొక్క- యౌదార్యమును, బుద్ధిమత్త్వమును, చాటుచున్నది. అందుకొరకైనను బ్రిటిషు గవర్నమెంటు వహించినంత కాఠిన్యము వహింపకుండ వలసియుండెను. అధికారము న్యాయమును పాటించునా? తరువాతి సంప్రతింపులను చూచిన మొట్టమొదటి నుండియు బీరారుపరగణా కాజేయవలెననియే యనెడి కంపెనీవారి యుద్దేశ్యము తెల్లము కాగలదు. 1878 సంవత్సరమున కీ॥ శే॥ సాలార్‌జంగుగారీ సమస్యను బైటకు దీసినప్పుడప్పటి సెక్రటరీగారగు శాల్స్బరీ ప్రభువుగారు నిజాంప్రభువు మైనరుగాన మేజరైన వెనుక నీ సమస్య నెత్తవచ్చుననియు, నొడంబడికయందు కాల

నియమము లేదనియు, జవాబిచ్చెను! తరువాత కీ॥ శే॥ ఘ॥ వ॥ మీర్ మహబూబల్లీపాషాగారు మేజరైన వెనుక నీసమస్యా విషయమున నేమి జరిగెనో 1902 సంవత్సరపు టొడంబడిక తెల్లము చేయుచున్నది.

**1902 ఒడంబడిక :**

కర్జన్ ప్రభువు వైస్రాయిగా వచ్చెను. అప్పటికి బ్రిటిషిండియా, కంపెనీ ప్రభుత్వమును వదలి బ్రిటిషు ప్రభుత్వము క్రిందికి వెడలెను. డెల్హౌసీ ప్రభువు చేసిన పనిని జ్ఞప్తికి దెచ్చికొనిన, నిట్టిది తటస్థింపగలదని యాయన యూహించియే, హైద్రాబాదు నెడల యింత కాఠిన్యము వహించెనని తెలియగలదు. కంపెనీవారి స్థానమునకు నింగ్లాండు ప్రభుత్వమువారే వచ్చిరి. కంపెనీయే యంత కాఠిన్యము వహింప, నంతకంటె ననేకరెట్లు బలము గలిగినట్టియు, సామ్రాజ్యమును స్థాపించినట్టియు బ్రిటిషు గవర్నమెంటువారు మెత్తబడుదురా ? రాజ్యకాంక్ష యెట్టి పనినైన జేయించును. ఇప్పుడుకూడ వెనుకటి పాటయే పాడబడెను. పరగణాను మరల నిజాం ప్రభువున కిచ్చు నుద్దేశ్య మెన్నటికిని కనబడక పోయెను. ప్రథమమునుండి గట్టి స్నేహభావముతో మెలగుచు

వచ్చి, దాదాపు 150 వత్సరములు (అనగా 1766 నుండి 1902 వరకు) నిరంతర స్నేహమును చూపిన నిజాం ప్రభువు నెడల నింత యపనమ్మకమా ? ఆయన వారిపో వునా? ధిక్కరించునా ? ఇట్టి విషయమున భూమి తాకట్టు నేల కోరవలెను? పరగణాను స్వత్వముచేసుకోవలెనను నుద్దేశమున్న ట్రీయొక్క యంశమే రుజువు చేయగలదు ! 1902 సంవత్సరమున కర్జను ప్రభువు తనంతనే యీసమస్య వైపునకు దృష్టిని మరల్చెను. 1902 జనవరి నెలలో సంప్రదింపులు ప్రారంభమయ్యెను. బీరారు పరగణా బ్రిటిషువారికి శాశ్వత కౌలు కిచ్చునట్లును, నందుక్రింద బ్రిటిషువారు నిజాం ప్రభువునకు నేటేట 25 లక్షల రూప్యము లిచ్చునట్లును, నను షరతులను కర్జను ప్రభు వంపెను. అందులకు మహబూబలీ పాషాగారసమ్మతిని దెలుపగా, రెండు నెలలకు తరువాత వైస్రాయి స్వయముగా హైద్రాబాదునకు వచ్చెను. (29-3-1902) అప్పుడు వైస్రాయి నైజాములకు సంభాషణలు జరిగెను. అందేమి మాటలాడిరో రహస్యముగా నుంచబడినది. ఆ సంభాషణల కాలమున వైస్రాయికి సాయ మొనర్చుటకు రెసిడెంటు వద్ద నుండెనుగాని, నిజాం ప్రభువువారికి సాయ మొనర్చుట కెవ్వరును లేక

పోయిరి! కాని యీ కాలమున జరిగిన సంభాషణ లను కొన్నింటిని ప్రభువుగారు వ్రాసికొని యుండెను. అందు కొంత భాగము, తరువాత రీడింగు ప్రభువు గారికి ప్రస్తుత శ్రీ వారు వ్రాసిన యుత్తరమున ననువ దింపబడినవి.

అది చదివిన రెండు విషయములు తెల్లమగును.

(1) ఇదివరలోనుండు వినిమయమును కొలుగ మార్చవలెనను వైస్రాయి కోరిక.

(2) అట్లు మార్చకపోయినను, వెనుకటి యొడం బడికలలో నవి తాత్కాలికములే యని స్పష్టముగా నున్నను, బ్రిటిషువారు బీరారు పరగణాను దాదాపు 50 సంవత్సరములనుండి యనుభవించుటచే మరల యియ్య నుద్దేశము వారికెంతమాత్రము లేదను విష యము.

రెండువిషయములును రాజనీతి ప్రేరితములే! వినిమయమువలె నున్నచో నుభయపక్షములపట్ల కొన్ని యవశ్యాచరణీయకార్యము లుండును. అట్లుగాక కొలుగా మార్చిన బ్రిటిషువారిచే వెనుకనున్న

యాచరణీయ కార్యము నశించును. అనగా నెట్టి
ప్రత్యుపకారము లేకయే బీరారు పరగణా ననుభవించ
వచ్చును. ఇదివరలో బీరారు శాశ్వతరాజ్యభాగ
ముగా లేనందున దాని యాదాయాభివృద్ధికర కార్య
ముల కాటంకము కలుగుచుండెను. ఇప్పుడు నిర్ణయించు
కొన్న కప్పమునకంటె యెక్కువ యియ్యనక్కర లేక
పోవుటచే పరగణా నభివృద్ధి చేసుకొని యాదాయాధి
క్యమును నిరాటంకముగా ననుభవింపవచ్చును. దీని
కంతకును మూలసూత్రము పై రెండవ యంశము!
ఇన్ని వత్సరములనుండి యనుభవించినదానిని విడువ
మనసెట్లొప్పును? అందును సర్ధశతాబ్దమైనది! కావున
శాశ్వతానుభవము చేకూర్చుకొను ప్రయత్నమున
శాశ్వత కౌలుకంటె మరేమికర్తవ్యముకలదు? వెనుకటి
ప్రభువుగారు వ్రాసికొన్న వ్యాఖ్యా వాక్యములను
చూచిన, కర్జన్‌ప్రభువు తమ యభిప్రాయమును దాచ
లేదనియు, నిక నెప్పటికిని విడుచు నాశ వదులుకొను
టయే శ్రేయమని తెల్పుటచేతనే శ్రీ వెనుకటి ప్రభు
వుగా రంగీకరించినట్లును స్పష్టమగుచున్నది. ఇట్టిది
బ్రిటిషురాజనీతి! ఏదియెట్లున్నను కర్జన్‌ప్రభు వొడంబడి
కను చేసుకొని తీరెను. ఇందునుగూర్చిన సమస్తాంశము

లును మన శ్రీవారు 1925 సంవత్సరమున వ్రాసిన యుత్తరములో చర్చింపబడినవి. కాని ఫలము విపరీత మయ్యెను.

ఈ యొడంబడిక షరతుల నీ క్రింద బొందుపరచు చున్నాను.

(1) 21-5-1853, 26-12-1860, తేదీల యందు చేసికొనబడిన యొడంబడికల ప్రకారము "హైద్రాబాదు సైన్యము" యొక్క ఖర్చులను బీరారురాష్ట్రము యొక్క యాదాయములోనుండి తీసికొని మిగిలిన యాదాయమును నైజాము ప్రభుత్వమువారి కిచ్చు షరతుతో నైజాం ప్రభుత్వమువారు బీరారు పరగణాను బ్రిటిషు ప్రభుత్వమువారి కిచ్చినందుచేతను;

(2) ఈ యొడంబడికలను సరిచూచి గట్టిపరుప వలెనని రెండుప్రభుత్వముల యభిప్రాయ మగుటచేతను;

(3) బీరారు పరగణాను ప్రత్యేక ప్రభుత్వముగా పరిపాలించుటకును, "హైదా్రిబాదు సైన్యమును" ప్రత్యేకముగా భరించుటకును, వ్యయ మధికమగుట చేతను.

(4) ఎప్పటి కప్పుడు మారుచుండు మొత్తమును గాక యొక నిర్ణీతమైన మొత్తమును బడయుట నిజాం ప్రభుత్వమునకు వీలుగానుండుట చేతను; నీ క్రింది షరతులతో నొక యొడంబడిక బ్రిటిషు వైస్రాయిగారికిని నిజాం ప్రభువుగారికిని మధ్యజరిగెను.

(1) ఈ యొడంబడిక వలన బీరారుపరగణాపై నిజాంప్రభువుగారి కుండు స్వత్వము స్థిరపడునట్లును, నిజాం ప్రభువుగారు బీరారు పరగణాను బ్రిటిషు గవర్నమెంటు వారికి శాశ్వతకవులున కిచ్చునట్లును, నందు క్రింద ప్రతిఫలముగా బ్రిటిషు ప్రభుత్వమువారు నిజాం ప్రభువుగారికి శాశ్వతముగా నేటేట 25 లక్షల రూపాయలను కప్పముగా నిచ్చునట్లును, నేర్పరచుకొనడమైనది.

(2) వెనుకటి 1853, 1860 యొడంబడికలు రద్దై, యికముందు బీరారుపరగణాపై బ్రిటిషు గవర్నమెంటువారికి వారి యిష్టప్రకారము సమస్త సంపూర్ణాధికారము లుండును. ఇకముందు వెనుకటి 1853

సంవత్సరపు యొడంబడికయందు పేర్కొనబడిన హైదరా బాదు రాజ్యరక్షణమునకు వలయు సమస్త కార్యములను సమకూర్చుచు, బ్రిటిషు గవర్నమెంటువారు "హైదరా బాదు సైన్యమును" తగ్గించుటకుగాని, పూర్తిగా తీసి వేయుటకు గాని, మరియొక విధముగా మార్చుటకుగాని సంపూర్ణాధికారము గలిగి యుందురు.

ఈ యొడంబడికతో బీరారు పరగణాను గూర్చి చేతులు కడుగుకొని నట్లయ్యెను. శ్రీవారు 1911 సంవత్సరమున రాజ్యమునకు వచ్చిన తరువాత నీ విష యమై యాలోచించి, తమ కన్యాయము కలిగినట్లును, బ్రిటిషు గవర్నమెంటువారు న్యాయైకదృష్టి కలవా రనియు భావించి, తమపక్షమున నున్న న్యాయమును చూపుచు, బ్రిటిషు గవర్నమెంటువారి కియ్యవలసిన పైకము పైసలతో లెక్కచూచి యిచ్చిన యెడల, రాష్ట్రభూభాగమగు బీరారు పరగణా తప్పక వచ్చునను నాశతో నుండిరి. ఇందులకు సంబంధించిన సంగతు లన్నియు గట్టిగాను, న్యాయసమ్మతముగాను చూపి, సమర్థతతో రాయబారము నడపగల వ్యక్తిని వెదకి తుదకు సర్ ఆలీ ఇమాముగారిపై దృష్టినిగిడ్చిరి.

వారును నీ విషయమున తగు ప్రయత్నములను చేయ మొదలిడిరి. కాని వారిచ్చట కొలదికాలమే యుండుటచే మొదలిడిన పనిని పూర్తిచేయలేకపోయిరి. క్రమముగా సమర్థులద్వారమున పని పూర్తిచేయించి, యుదాత్తమైనట్టియు, చారిత్రక ప్రసిద్ధి పడయతగినట్టియు 20-9-1925 తేదిగల యుత్తరము నప్పటిలో వైస్రాయిగా నుండిన రీడింగు ప్రభువుగారికి పంపిరి. దానికి నాయన సదుత్తరము నియ్యలేక విషయమునకసంబద్ధములగు నంశములతో నొక మొండిజవాబంపెను. దానివలన రాష్ట్రమునకంతటికిని విచారము కలిగెను. అందుండి కొన్ని పంక్తుల ననువదించుచున్నాను.

"The Sovereignty of the British Crown over the Native States arises not only from treaty rights but exists independently of them, and no state can hope to negotiate on terms of equality with the paramount power. The internal no less than the external security, which the Ruling Princes enjoy, is ultimately due to the protecting power of the British Government, and where Imperial interests are concerned, or the general welfare of the state is seriously and grievously affected by the action of

**its government, it is with paramount power that the ultimate responsibility of taking remedial action, if necessary, must lie."**

ఈ మాటలను చదివినయెడల బీరారుపరగణా మరల నిచ్చు నుద్దేశము బ్రిటిషు గవర్నమెంటువారికి కలదని భావింప వీలగునా? ఈ ప్రత్యుత్తరమును రీడింగు ప్రభువు చాలకాలముతర్వాత, తాను వైస్రాయిపదవిని వదలిపోవుచు బొంబాయిలో స్టీమ రెక్కునపుడు 17-2-1926 తేదిన పంపెను. ఎంతదుఃఖకరము!

ఇంతటితో శ్రీవారు పూర్తిగా నిరుత్సాహము చెందలేదు. విషయము హృదయమున రగులుచునే యుండెను. ఇంతలో రౌండుటేబిలు మహాసభ యాసన్న మయ్యెను. అప్పుడు వెడలిన రాయబారవర్గముతో బీరారువిషయమైన గట్టిప్రయత్నములు చేయ నాజ్ఞాపించిరి. రాయబారవర్గాధ్యక్షులగు సర్ అక్బరు హైదరీగారు తమ సహజప్రతిభతో మరల రాయబారమును ప్రారంభించి విదేశాంగమంత్రి మొదలగు నందరితో సంప్రదించిరి. తుదకు పరిణామముగా 24-10-36 తేదీ గల యొడంబడిక చేసుకొనబడెను. అందలి ముఖ్యాషర తుల నీ క్రింద బొందుపరచు చున్నాను.

**24—10—1936 తుది యొడంబడిక :**

(1) వెనుకటి వలెనే బీరారు పరగణా, మధ్య రాష్ట్రములతో పాటు బ్రిటిషు గవర్నమెంటువారి చేతనే పాలింపబడు చుండవలెను.

(2) వెనుకటి వలెనే నిజాం ప్రభువులకు ప్రతి వత్సరమును 25 లక్షల రూపాయలు లభించుచుండ వలెను.

(3) పర్వదినములలో బీరారునందలి సర్కారు భవనము లన్నింటిపైనను బ్రిటిషు పతాకముతో పాటు నిజాం పతాకమును నెగురుచుండవలెను.

(4) నిజాం ప్రభువువారి పెద్దకుమారుడు బీరారు రాకుమారుడను బిరుదమును వహింపవలెను. ఆ బిరుదమును బ్రిటిషు గవర్నమెంటువా రంగీకరింపవలెను.

(5) బీరారు విషయమున నొక యేజెంటును నిజాం ప్రభువు నియమించుట కధికారము కలిగియుండ వలెను.

ఈ యేజెంటున కంతఃప్రభుత్వమున నెట్టి జోక్యమును లేదు. కాని బ్రిటిషుప్రభుత్వమువలన నిజాం ప్రభువున కెట్టి నష్టమును కలుగకుండ గమనించు చుండును.

(6) మధ్యపరగణాలకు గవర్నరునియామకము చేయుటలో నిజాం ప్రభువుయొక్క సలహాను పొంద వలెను.

(7) నిజాంప్రభువు కోరినపుడు మధ్యపరగణాల గవర్నరు నిజాందర్బారునకుపోయి హాజరుకావలెను.

ఈ యొడంబడికవలన నుభయపక్షములకు నొక్కొక ముఖ్యలాభము కలిగినది. 1935 సంవత్సరపు టిండియా చట్టము బీరారున కిచ్చిన స్థానము నీ యొడంబడిక గట్టి పరచెను. బ్రిటిషిండియాలో నెట్టి ప్రభుత్వ పరివర్తనమును బీరారునకుకూడ వర్తించు నట్లొనర్పబడెను. ఈ యొడంబడికతో నీ విషయము గట్టిపడెను. బ్రిటిషు వారికి వచ్చిన లాభమిది. ఇక నిజాం ప్రభువునకో! పతాకారోహణము, యువరాజనామ పరివర్తనము, యేజెంటు నియామకము, గవర్నరు నియామకమును గూర్చిన సలహా, గవర్నరుల దర్బారు హాజరు, వను విషయములతో బీరారుపై నిజాం స్వత్వము గట్టిపడుట! ఈ యొడంబడిక 1937 సంవత్సరము ఏప్రియల్ 1 తేది నుండి యమలులోనికి వచ్చినది. ఈయొడంబడిక ప్రకారము మధ్యపరగణాల గవర్నరుపదవి ఖాళీయైనపుడు

గవర్నరగు సర్ గవనుగారు నిజాంప్రభువు సలహాతోనే నియమింపబడిరి. ఈ యొడంబడిక ప్రకార మిటీవలనే శ్రీ సర్ ముత్తా వెంకటసుబ్బారావుగారు బీరారు యేజంటుగా నియమింపబడిరి. ఈ నియామక మందరకును సంతృప్తి నొసంగెను. ఈ యొడంబడికదిన మిప్పుడు విరామదినముగా రాష్ట్రమంతట ననుభవింపబడుచున్నది.

ఇక రెండు విషయములను మనవిచేసి యీ సమస్యనుండి సెలవు గైకొందును.

(1) కారణాంతరములచే నీయొడంబడిక యంతమొందు నెడల నేమిజరుగవలెను? ఈవిషయము చర్చకువచ్చి తుద కీవిషయమున శ్రీ చక్రవర్తిగారి క్రింది విషయములను వైస్రాయిగారి ద్వారా శ్రీవారికి తెలియజేసిరి. "ఈయొడంబడిక యేకారణముచేతనైన నంతమొందు ననుకొనుటయు, నట్లయిన నేమిచేయవలెననుటయు, నాకెంతమాత్రము సమ్మతములుకావు. కాని యొకవేళ యట్టిది జరుగునెడల నీ క్రిందివిధమైన పూచీని గట్టిగా నిచ్చుచున్నాము.

(1) మరియొక శాశ్వతమైన యొడంబడిక జరుగు వరకు మధ్యకాలమున నేర్పాట్లుచేయుటకు చక్రవర్తి గారు సంపూర్ణాధికారము కలిగియే యుందురు.

(2) కాని శ్రీనిజాం ప్రభువులకు బీరారు రాజ్యమునందున్న స్వత్వమునకు గాని, వారికిచ్చు సంవత్సర కప్పమునకుగాని, వారికిచ్చిన సేస పూచీకిగాని, మెట్టి భంగమును కలుగకుండ చూడబడును.

(3) మరియు నిట్టితాతాా్కలికపు ఏర్పాటులో శ్రీవారి సమ్మతిలేకుండా చేయుటకు చక్రవర్తిగారి కధికారమున్నట్లు వారు తలంచుట లేదు.

ఈ యుత్తరము అక్టోబరు 26 వ తేదిన వ్రాయబడి శ్రీవారికి సంతోషదాయక మయ్యెను. తుదకు జరిగిన యొడంబడికకును, నియ్యబడిన పూచీలకును, సంతసించి శ్రీవారీ క్రింది ఫర్మానాను ప్రసాదించిరి.

"నూతన రాజ్యాంగ పరివర్తనమును బ్రిటిషిండియాలో ప్రవేశపెట్టినవెంటనే బీరారు పరగణాలో ప్రభుత్వమెట్లు జరుగవలెనను విషయమున బ్రిటిష్

గవర్నమెంటువారితో జరిగిన సంప్రతింపుల ఫలితముగా, జరిగిన క్రొత్తయేర్పాట్లనుగూర్చి, నాసంతోషమును వెలిబుచ్చుచు వెల్లింగ్డన్ ప్రభువువారు నిజాంరాష్ట్రమునకు వచ్చినపుడొక ఫర్మానాను ప్రకటించియుంటిని. 'మధ్యరాష్ట్రములు బీరార్' అను నొకేపేరుతో రెండు రాష్ట్రములనుకలిపి రాజ్యము కొనసాగించుచు, నా బీరారు పరగణాపై నాస్వత్వము నెట్టి యనుమానము గాని, సంకోచముగాని లేకుండ చూపు నేర్పాట్లేయే విధముగా చేయబడునో తెలియుటకు నాప్రజలు కుతూహలము చూపుచున్నారనికూడ నాఫర్మానులో స్పష్టపరచితిని.

"దైవకృపచే నీరాయభారములన్నియు ఫలవంతములైనందునను, నిదివరలోనే అనగా 24—10—1936 తేదీన శ్రీ చక్రవర్తిగారును నేనును నొడంబడికపై సంతకములు చేసినందునను, నాయొడంబడికయొక్క షరతులను, శ్రీ చక్రవర్తిగారు నాకువ్రాసిన (పైన నుదహరించిన) యుత్తరమునందలి విషయములను, బయల్పెట్టుటకు సమయమువచ్చినది. పై యుత్తరమునందలి విషయములును, 1902 సంవత్సరపు టొడంబడిక రద్దగుట

యును నాకు మిక్కిలి ముదావహము లైనవి. ఈయువసరమున నాసంతోషమున నా ప్రియప్రజలు పాల్గొనుదురని యాశించుచున్నాను.”

పై ఫర్మానావల్ల నీ యొడంబడిక శ్రీవారికి సంపూర్ణమైన సంతసమును గొల్పినట్లు తెలియగలదు. అయినను నిప్పటికిని యసంతృప్తి నొందుచున్నవారలుండకపోలేదు.[1] కొంతకాలము క్రిందటివరకు నైజాం గవర్నమెంటుకు సలహాదారుగానున్న శ్రీ రా॥ బ॥ కృష్ణమాచార్యులుగారు పై యొడంబడికనుగూర్చి యీ క్రిందివిధముగా ననిరి.

“శ్రీవారి స్వత్వమును బాహ్యచిహ్నముగా కనపర్చుటయు, యువరాజును బీరారు రాకుమారుడని పిలుచుటయు, శ్రీవారి హక్కునకు సమ్మతించినట్లే భావింపనగును. 20 సంవత్సరముల క్రిందటనే ఫైసలైనదను బీరారుసమస్య మరల నుద్ధరింపబడుటయు, నొడం

1 ఇటీవల బీరారేగాక యుత్తరసర్కారులును, దత్తమండలములను కూడ నైజామున కియ్యవలె నను వాదము బయలుదేరినది.

బడిక కుదురుటయు, నెన్నదగిన విషయములు. బీరారు లను శ్రీ నిజాం ప్రభువున కియ్యకపోయినను, నేదో విధమున శ్రీవారి యధికారమును గుర్తించుట శ్రీవారి ప్రజలకు సంతోషమును చేకూర్పక మానదు." ఈ యొడంబడికచే నుభయ తారక మయ్యెను.

---

# సింహావలోకనము

## ౧. రజతోత్సవము

ఈ చరిత్రమునకు శ్రీవారి రజతోత్సవము మకుటాయమానమైనది. ఈయుత్సవము వెనుక సంవత్సరముననే జరుగవలసియుండెను. కాని శ్రీ పంచమ జార్జిచక్రవర్తిగారి నిర్యాణము మొదలగు కారణములచే నాగిపోవలసివచ్చెను. తుదకు 1937 సంవత్సరము ఫిబ్రవరి నెలలో జరుగునట్లు పెద్దలు నిశ్చయించిరి. రాష్ట్రమందలి ప్రజలందరును నీశుభసమయమునకై వేచియుండి తుదకు నిశ్చయమైనపుడు, వారి సంతోషమునకు మేరలేకుండెను. ఉత్సవములన్నియు దాదాపొక పక్షము దినములు జరుగునట్లు కార్యక్రమ మేర్పరుపబడెను. రాష్ట్రమునందలి యన్ని భాగములనుండియు, వెలుపలనుండియు, వచ్చిన జనమునకు సంఖ్యయే లేకుండెను.

మిక్కిలి వైభవముతో, గొప్ప పారిశ్రామిక ప్రదర్శనముతో, నుత్సవములు జరుపవలెనని యుత్సవ సంఘమువారు నిర్ణయించిరి. కాని శ్రీవారు తమ

యభిప్రాయమును తెలియపరచుచు, ననవసర ధన వ్యయము చేయవలదని సంఘమువారిని హెచ్చరించిరి. మరియు వసూలుచేసిన ద్రవ్యమునుండి శిశు పోషణోద్యమమున కెక్కుడు ధనసహాయ మొసంగుడని తమ సలహా నొసంగిరి. సంఘమువారును శ్రీవారి యుద్దేశ్యమును శిరసావహించి యట్లే యొనరించిరి. ప్రజలు మిక్కిలి యుత్సాహమును వెలిబుచ్చిరి. ఈ క్రింది సంస్థలు శ్రీవారి కభివందన పత్రములు సమర్పించిరన్న, ప్రజలలో నన్ని మతములవారును, వృత్తులవారును, సంతసించిరన్న నెంతమాత్రము నాశ్చర్యముకాదు.

1. జాగీర్‌దార్ల సంఘము, 2. సాహుకార్ల సంఘము, 3. న్యాయవాది సంఘము, 4. మ్యునిసిపాలిటి, 5. నగరాభివృద్ధి సంఘము, 6. మెకానిక్ సంఘము, 7. జమీాందార్ల సంఘము, 8. కాయస్థ సంఘము 9. పారసీకసంఘము, 10. ఆంగ్లోయిండియను సంఘము, 11. క్రైస్తవసంఘము, 12. సిక్కు సంఘము, 13. వైద్య సంఘము, 14. దేవాలయ ధర్మకర్తల

సంఘము, 15. వర్తక సంఘము, 16. నిమ్నజాతి సంఘము, 17. రోమన్ క్యాథలిక్ సంఘము.

ఆహా! శ్రీవారు తమప్రజల హృదయముల నెట్లు చూరగొనిరి! ఉత్సవమునకు ఘ॥ వ॥ డాటియా మహారాజుగారు, ఘ॥ వ॥ ఆగాఖానుగారి కుమారుడు, కోడలు మొదలగు ననేక ప్రముఖులు బయటనుండి విచ్చేసిరి. అనేక పత్రికా విలేఖరులు వారి పత్రికలపక్షమున వచ్చిరి. అనేకపత్రికలు రజతోత్సవ సంచికలు ప్రచురించెను. అనేకులగు ప్రముఖులు రాష్ట్రముయొక్క సర్వతోముఖాభివృద్ధిని తెలియజేయు వ్యాసములను వ్రాసిరి. హిందూపత్రిక రజతోత్సవ సంచికకు శ్రీ సర్ అక్బరు హైదరీగారు ఘనవ్యాసము నొకదానిని వ్రాసిరి. తమ స్వహస్తములతో నేలికకు రాష్ట్రాభివృద్ధికార్యములలో తోడ్పడిన వీరి సాక్ష్యముకంటె వేరు కావలయునా! కలిగిన యభివృద్ధియంతయు, నావ్యాసములయందు వ్రాసినదియంతయు, దూరదేశాగతులైన యతిథులకు గన్పడినవిగదా!

నగరమునందలి ప్రతిగృహమును, ప్రతివసతిగృహమును, నతిథులతో నిండి యుండెననుట యతిశయోక్తి కాదు. ఉత్సవసందర్భమున రెండు విషయములు చెప్ప

వలసి యున్నవి. అదేసమయమున మోటారులసమ్మె తటస్థించెను. దాని నాపవలయునని ప్రభుత్వాధికారులు చాలా శ్రమపడిరి. లాభము కలుగకపోయెను. ఈ సమ్మెచేత వచ్చిన జనులకు ప్రయాణవిషయముల కొంచెము కష్టము కలిగెను. రెండవ విషయము మాత్రము ప్రజలకు కొంచెము నిరుత్సాహము కలిగించెను. ఉత్సవమునందలి ప్రతి కార్యక్రమమునందును నుద్యోగులకును, ధనికులకునే స్థానముండెనుగాని, రాష్ట్రసామాన్యప్రజలకు తమయేలికతో సమక్షమున తమ రాజభక్తిని తెలియబరచుకొను నవకాశములు కల్పింపబడలేదని ప్రజాసామాన్యమనుకొనినట్లు తెలియుచున్నది. ఏలిక దర్శనమున కువ్విళ్ళూరుచు, గుంపులుగాగూడి యుత్సాహమును వెలిబుచ్చు రాష్ట్రప్రజల కొకొక్కవేళ త్రోపులుకూడ లభించుట తటస్థించినట్లు వదంతి యున్నను నది విశ్వాసపాత్రము గాదు. కాని ప్రజాసామాన్యమునకు కొంత నిరుత్సాహము కలిగెననుట సత్యదూరముకాదు. ఉత్సవదీపావళీదర్శనమునమాత్రము ప్రజలు హృదయతుష్టిగా పాల్గొనిరి. ఉత్సవ కార్యక్రమము తిలకించిన శ్రీవారు తమ కీ శుభోదర్కమును కలిగించుటకు భగవంతునికి తమ భక్తికృతజ్ఞతలను

కార్యక్రమముయొక్క యాదిమధ్యావసానముల యందు ప్రార్థనామూలమున సమర్పించినట్లు తెలియును. ప్రథమ దివసమునను తుదిదివసమునను బాగయామునందలి మసీదునను, 19 ఫిబ్రవరి దినమున జుమ్మాప్రార్థనలను మక్కామసీదునను, జరిపిరి. ఆకాలమున బీదవారు భాగ్యవంతులు నను భేదములేకుండ వారితో నందరకును ప్రార్థనజరుపు నవకాశ మొసంగబడెను. ఇది యొకగొప్ప విషయము. ఇట్లు రజతోత్సవము "మంగళాది, మంగళ మధ్య, మంగళాంత"మై వరలెను.

శ్రీవారికి 140 లక్షల ప్రజల పక్షమున ముఖ్యామాత్యులగు మహారాజా సర్ కిషన్ ప్రసాదు బహద్దూరు వారు సమర్పించిన వినతిపత్రమును, దానికి శ్రీవారిచ్చిన సమాధాన వాక్యములను, ననువదించిన ప్రజా ప్రభువుల యన్యోన్యము మొదలగు విషయములు విశదము కాగలవు. పురోద్యానమున నలంకృత విశాలసభా మంటపమున, సర్వోద్యోగ పరివృతులై, సభార్యాపుత్రులై, సభాసదుల యాననశతంబులచే నిపీయమానులైనను మహర్షివలె నుదాసీనులై, సర్వాభరణ భూషితులయ్యు నిర్లిప్తులై యున్న యా తేజోరాశిని,

యుం రాజర్షిని, చూచు భాగ్యము ప్రజల కొసంగి భగవంతుడు రాష్ట్ర ప్రజాతపమును ఫలింపజేసెను.

అత్తరి, కించిదాకుంచితావయవుౖలై, రాజ్యభారంబుచేనా యన్నట్లు కించిన్నమిత శిరస్కులై, తమ సవ్రమకాయము తమ రాజభక్తిని సూచింప, చేత వినతిపత్రమునుగొని తమ స్థానమునుండి వినతిపత్ర పఠనమునకు శ్రీ మహారాజావారు లేచినపుడు, సభాసదుల సంతోషమునకు మేర లేకుండెను. ఆ పత్రము నుండి కొన్ని విషయముల నిట ననువదించుచున్నాను.

“అత్యంత రాజభక్తియు, సంపూర్ణ నమ్రభావమును, నసమానానురక్తియు, నీరాష్ట్రప్రజల సహజ గుణములు. ఈ పవిత్రభావములే రాజప్రజల నవిచ్ఛిన్నముగా బంధించు సువర్ణ శృంఖలలు. వారి సౌఖ్యమే వీరి సౌఖ్యము. వారి దుఃఖమే వీరి దుఃఖము.”

శ్రీవారి కుటుంబ సాంప్రదాయములను శ్రీవారు జాగ్రత్తగా కాపాడుచున్నారని మనవిచేసి, యీ క్రింది భావమును సూచించెను.



మహారాజా సర్ కిషన్‌ప్రసాదు బహద్దూరుగారు (యామీనుస్సల్తనత్)

"పరమేశ్వర సంకల్పముచే నసఫ్జాహీ కుటుం బము తమ యధికారమునకు దయ, ఔదార్యము, ప్రేమ అను గుణములను పునాదులుగా నొనర్చి స్థాపించిరి. కావున ప్రజలను వారి సౌఖ్యమే ముఖ్యోద్దేశ్యముగా పాలించుటయు, జాతి మత వివక్షయు పక్షపాతమును లేకుండ న్యాయముగ వర్తించుటయు, తటస్థించెను. ఈ సూత్రములే పాలక పాలితులను బంధించిన సువర్ణ శృంఖలలు."

ముల్కీ-మహాకవియగు 'వలీ'కూడ నిట్టి భావములే తెల్పెననియు, శ్రీవారి రజతోత్సవము శ్రీవారి ప్రజ లకు వర్ణనాతీతమగు సంతసమును, ననిర్వాచ్యమగు నానందమును కలుగజేసినదనియు విన్నవించి, తచ్ఛుభ సమయమున శ్రీవారి పంచవింశతి వత్సర రాజ్యకాలము నందు జరిగిన రాష్ట్రాభివృద్ధి నీ వినతిపత్ర ముగ్గడించెను. సింహాసన మధిష్ఠించిన కాలమున ఘ॥ వ॥ శ్రీవారు కాల క్రమమున మ॥ఘ॥ వ॥ వారగుటయు, శ్రీవారి పెద్దకుమా రులును, యువరాజులును బీరారు రాకుమారులని పిలువ బడుటయు, మిక్కిలి సంతోషదాయకములని మనవి చేసి, ప్రాచీనమైన తురుష్క రాజకుటుంబముతో

సంబంధమును, తనస్నేలమునగలిగిన రాజకుటుంబాభి వృద్ధిని కొనియాడి, బాలురగు శ్రీ ముకర్రంజా రా కుమారులు పితృపితామహులకు ముదము గొల్పుటకు సంతసమును వెలిబుచ్చి, బీరారుపై శ్రీవారికి గలిగిన స్వత్వమునకు ముద మొందెను.

రాష్ట్రమంతటను శాంతి నెలకొల్పబడుటయు, ప్రపంచమంతయు మహా సంగ్రామముచే నార్థికముగ తారుమారయినను, నీ రాష్ట్రార్థికస్థితి గట్టి పునాదులపై నుండుటయు, మరియు సంగ్రామ పరిణామముగా గల్గిన ప్రజాపీడ రాష్ట్రమునకు తాకకుండుటయు, శ్రీవారి సురాజ్యచిహ్నములని తెలిపి, యింత యార్థిక శబలత యున్న కాలమునగూడ రాష్ట్రాభ్యుదయ కార్యము లాగ కుండుటకు శ్రీవారి పాలనాచాతుర్యము నుగ్గడించెను. బ్రిటిషు ప్రభుత్వమునకును శ్రీవారి ప్రభుత్వమునకును మైత్రి యథాపూర్వముగనే యుండెను. నిజాంరాష్ట్రము యుద్ధమున బ్రిటిషు సామ్రాజ్యమునకు చేసిన సహాయము నిరుపమానము. శ్రీ చక్రవర్తిగారు తమ స్వహస్తము లతో వ్రాసిన లేఖలే యందులకు తార్కాణములు.

ఈ కాలమున కల్గిన కొన్ని విశిష్ట పరివర్తనము లందు పేర్కొనబడెను.

కార్యనిర్వాహకసభ స్థాపింపబడి ప్రభుత్వము తత్సభాయత్తము చేయబడెను. యువరాజుగారిని సేనానాయకులుగ నొనర్చుటచే సైనికశాఖ రాష్ట్రమునకు కుడిభుజమయ్యెను. ఆశాఖయం దనేకమార్పులు చేయబడుచున్నవి. సైనికవ్యయము 29 లక్షలనుండి 55లక్షలకు పెరిగెను. శ్రీ యువరాజుగారు సైనికశాఖయందనేకాభివృద్ధికరములగు మార్పులుగావించుచు, నతి సమర్థతతో తమకార్యమును నిర్వహించుచున్నారు. రిగ్యులరు, యిర్రిగ్యులరు స్కంధావారములు మిక్కిలి రాజభక్తిపూరితములై యున్నవి. శ్రీవారి ద్వితీయ పుత్రులు నగరాభివృద్ధిశాఖాధ్యక్షులుగానుండి ప్రశంసాపాత్రమగు కృషిని సల్పుచున్నారు. పట్టణముయొక్క యిరుకును తగ్గించుటయు, జనులను వివిధపట్టణ ప్రాంతములకు వెదజల్లుటయు, వీధులను విశాల మొనర్చుటయు, పేదవారికి గృహ సౌకర్యములను కలుగజేయుటయు, పట్టణము సుందర మొనర్చుటయు, పారిశుద్ధ్యాభివృద్ధియు, నీ శాఖా కార్యములు. 1322 ఫసలీనుండి యింతవరకు

నీ శాఖవ్యయము 20 కోట్లరూప్యములు. ఇప్పటి నగర రామణీయకమే యీశాఖాకార్యములకు తార్కాణము. ఇప్పు డీ నగరమును "హైందవనగరరాజ్ఞి" యని పిలువ దగును. 2485 భవనములు నిర్మింపబడెను. లెక్కకు మిక్కిలిగ యుద్యానవనములు వేయబడెను. బంజారా పర్వతమంతయు భవనసమూహామై యొప్పారుచున్నది. దానికి "జూబిలీ" పర్వతమను నామకరణమొసగ్సి శ్రీవారు దానిని గౌరవించిరి. నిర్ధూళులై రథ్యలు వెనుకటిస్థితినుండి మారినవి.

విద్యాశాఖాభివృద్ధి యప్రతిమానము. ఇది శ్రీవారి ప్రియశాఖ. 1320 ఫసలీలో 10 లక్షలు వ్యయ మయ్యెడిది. 1344 ఫసలీలో నీశాఖావ్యయము 170 లక్షల రూప్యములు. వ్యయమును, విద్యార్థి సంఖ్యయు, విద్యాసంస్థాసంఖ్యయు నభివృద్ధియగుటయేగాక, విద్యా విధానమునందును, తత్కార్యములందును, కల్గినమార్పు చెప్పనలవికాదు. ఉన్నత, సర్వకళా, పారిశ్రామిక, సాంకేతిక, విద్యలన్నియు రాష్ట్రముననే తదవసరము లకు తగిన ట్లియ్యబడుచున్నవి. విద్యావిషయముల యందు బాలికల నశ్రద్ధచేయలేదు. ఈ సందర్భమున

నూస్మానియావిశ్వవిద్యాలయ కార్యములు తెల్పబడెను. విద్యా విషయములనేమి, పరిశోధనలయందేమి, భవన విషయమునందేమి, ప్రపంచమునందలి యుత్తమ విద్యాలయములతో నిది డీకొనుచున్నదన్న నాశ్చర్యముకాదు. హిందూముసల్మాను విజ్ఞానసమ్మేళనముచే, నీవిశ్వ విద్యా విద్యాలయము తన పవిత్రాశయమును సఫలము చేయ గలదని యాశింపబడుచున్నది. దీనితోపాటు సాంకేతిక విద్యాలయము, జాగీర్దార్ల కళాశాల, యసాఫియా పుస్తక భాండాగారము, దయూరతుల్ మారీఫు, మొదలగు సంస్థలన్నియు తమ విధులను నిర్వర్తించుచున్నవి. ఇటీవలనే మాధ్యమిక విద్యాసంఘము స్థాపింపబడినది. వీని కన్నిటికిని సంబంధించి బాలబాలికాభటసంఘములు పనిచేయుచున్నవి.

ఇంజనీరింగు శాఖయు మిక్కిలి యభివృద్ధి కరముగా పనిచేయుచున్నది. 50 నుండి 143 లక్షల వరకు ఖర్చు హెచ్చెను. 3025 మైళ్ళ రోడ్డునకు కంకర వేయబడెను. పెద్దవి 24 ను, చిన్నవి 248 ను, వంతెనలు నదీ నదోత్తరణమునకై నిర్మింపబడినవి. నిజాంసాగరు, పాలేరు, వైరా, మొదలగు వ్యవసాయోపకారకములగు

ప్రాజెక్టులు నిర్మింపబడినవి. రామప్ప మొదలగు తటాకములు మరమ్మతు చేయబడినవి. నిజాంసాగరు, ఉస్మాన్ సాగరు, హిమాయత్ సాగరు, యావద్భారత కీర్తిని పొందినవి.

అంబరచుంబి శిఖర పంక్తిగల యూనాని యూ వైద్యాలయము, యూనానీ వైద్యాలయము, ఉన్నత న్యాయస్థానము, సిటీకాలేజి, మొదలగు మందిర రాజ ములేగాక రాష్ట్రమందంతటను, వేలకొలది విద్యాలయ ములు, కార్యాలయములు, వైద్యాలయములు, నిర్మింప బడినవి. బాటసారుల విశ్రమమునకై యనేక విశ్రమ స్థానములు కట్టబడినవి. ఉస్మాన్ సాగరు నిర్మాణా నంతరము, హైదరాబాదు నగర పానీయ సమస్య తొలగింప బడినది. ఇట్లే యనేక పట్టణములకు మంచినీటి వసతి కల్పింపబడినది. అట్టి వసతి కల్పించుటకు వీలు లేని చోటులలో బావులు త్రవ్వింపబడినవి. ఇందుల కొక ప్రత్యేక శాఖ పనిచేయుచున్నది. డ్రైనేజిశాఖ మిక్కిలి ముఖ్యమై తనపనిని తాను నిర్వర్తించుకొనుచు ప్రజలయారోగ్యమును, పుర పారిశుద్ధ్యమును, కర్తవ్య ములుగా పనిచేయు చున్నది. 117 మైళ్ళ పొడవు

మురికినీటి కాల్వలు నిర్మింప బడినవి. 28 మైళ్ళ సిమెంటు రోడ్లు తయారు చేయబడినవి. ఇంకను చేయబడుచున్నవి. నగర నిర్మాణ, డ్రైనేజిశాఖ లితరపట్టణము లందును స్థాపింపబడి పని జరుగుచున్నది. విద్యుచ్ఛక్తి శాఖ నగరమును పూర్తి జేసి యితర పట్టణములయందు పని చేయుచున్నది.

శ్రీవారి రాజ్యకాలమున 729 మైళ్ళ రైలు మార్గము పొడవు పెరిగినది. ఇప్పుడు రాష్ట్రమున 1355 మైళ్ళపొడవు రైలుమార్గము కలదు. ఇది రాష్ట్రీ స్వము. రైల్వేశాఖ పక్షమున 4000 మైళ్ళ పొడవైన బస్సుశాఖపనిచేయుచున్నది. వైమానికాశ్రయము నిర్మింపబడినది. కరాచీనుండి మద్రాసువచ్చు విమానటపాతో హైదరాబాదు కలుపబడినది. వైమానిక సంఘమొకటి యేర్పడి, వైమానిక శిక్షణ మియ్యబడుచున్నది. నగరమునను, నితర పట్టణములందును, టెలిఫోనుశాఖ బాగుగా పనిచేయుచున్నది. పోష్టుశాఖకూడ చాల యభివృద్ధికరముగనున్నది. 819 పోష్టాఫీసులుకలవు. ఉస్మానియా వైద్యాలయము మూలమునను, రాష్ట్రమునందలి యితర వైద్యాలయముల మూలమునను, ప్రజారోగ్యముపట్ల

నెక్కువ శ్రద్ధ వహింపబడు చున్నవి. యూనానీ వైద్య మునకు మిక్కిలి యాదరణము కలదు. క్షయరోగ చికి త్సాలయమున కంచనాలు తయారగుచున్నవి. త్వర లోనే కార్యరూపమును దాల్చగలవు. స్థానిక స్వపరి పాలనాశాఖ మిక్కిలి జయప్రదముగా ప్రవర్తించుచు ప్రజల యభివృద్ధికై పాటుపడుచున్నది.

వాణిజ్య, వర్తక, పారిశ్రామిక, శాఖలు సమంజసముగా తమ కర్తవ్యమును నిర్వర్తించు చున్నవి. వీనితోబాటు సహకార శాఖనుగూడ పేర్కొన వల యును. పశువైద్య ఖనిజశాఖలుకూడ ప్రశంసనీయ ములే! ఈ యభివృద్ధి శాఖల పక్షమున నేఁటేట గొప్ప ప్రదర్శనములు జరిగి, ప్రజలకు మార్గదర్శకము లగు చున్నవి. బోధన్‌లో పంచదార మిల్లు మిక్కిలి జయ ప్రదముగా పనిచేయుచున్నది. కాగితములమిల్లు కొరకై యంచనాలు తరయారగుచున్నవి.[1] 3000 సహా

1 సిర్పూరులో పేపరుమిల్లు తయారగుచున్నది. దీనికి వలయు ద్రవ్యముతో పారిశ్రామికనిధినుండి కొంత సహాయము చేయబడినది, శ్రీ లాయకల్లీగారి యాజ మాన్యమున పారిశ్రామికాభివృద్ధి జరుగుచున్నది.

కార సంఘములుకలవు 2½ కోట్లు వీని మూలధనము. ప్రాచీనవస్తు రక్షణశాఖ యథాపూర్వముగా తన విధిని నిర్వర్తించుచున్నది. ఈశాఖాకార్యములు ప్రపంచమంతయును కొనియాడబడుచున్నవి. రేడియోద్వారా వార్తాప్రచారము ప్రారంభింపబడినది. అచ్చుశాఖ యొక్క యభివృద్ధి యది ప్రచురించిన గ్రంథముల సౌందర్యమువలననే తెలియును.

భూమిపన్నునుండి మదింపుఆదాయము 3 కోట్ల రూప్యములకు పెరిగినది. దేశకాల పరిస్థితుల ననుసరించి ఇది వసూలు చేయబడుచున్నది. కరువునిధి యుపయోగము ప్రజలు బాగుగా పొందుచున్నారు. నిర్బంధ సేవ తీసివేయబడినది. వ్యవసాయదారులు కాపాడబడుచున్నారు. పన్నులన్నియు భారముగాని పద్ధతిపై వేయబడినవి. మత్తుపదార్థముల ఖర్చు క్రమముగా తగ్గుచున్నది. మితపానమునకై పాటుబడుచున్నారు. న్యాయశాఖ ప్రజాదరణమునకు పాత్రమై పనిచేయుచున్నది. జాగీరు కోర్టులన్నియు హైకోర్టు నధికారముక్రిందికి తేబడినవి. పోలీసుశాఖ శాంతిస్థాపనాది కార్యములం దత్యంత శ్రద్ధవహించుచున్నది. శ్రీ

వారి ఫర్మానానుసారముగ శాసననిర్మాణ సభావిస్త రణకార్యము జరుగుచున్నది. సివిల్ సర్వీసుద్యోగులను పరీక్షించి యోగ్యతయే ప్రధానముగా గ్రహించు చున్నారు. రాష్ట్రార్థికస్థితి సరిగా లేనియెడల పైన చెప్పిన కార్యములలో శతాంశము సాగియుండవు. కాన శ్రీవారి పరిపాలనమునందలి యార్థికశాఖాబలము మిక్కిలి కొనియాడదగినది. శాఖాప్రయుక్తార్థికవిభజన మీ కార్యమునకు మిక్కిలి తోడ్పడినది. అనేక నిధులు స్థాపింపబడి యవసరములు గడుపుచున్నవి.

ఈ విధమున చెప్ప శక్యముకాని యభివృద్ధి పొంది, తమకు జరుగుచున్న మేలును శ్రీవారి ప్రజ లెన్నటికిని మరువజాలరు. రాష్ట్రమంతటను జ్ఞానభానూ దయమైనసూచనలు కన్పట్టుచున్నవి. అనేక సంఘములు రాష్ట్రసేవ చేయుటకు స్థాపింపబడుచున్నవి. బక్రీదు పండుగలో గోవధను నిషేధించి, శ్రీవారు తమ హిందూ ప్రజల ప్రేమకు పాత్రులైరి.

"ఇట్టి తరుణమున తమ ప్రియప్రజలు తమహృద యపూర్వకానందమును వెలిబుచ్చుచు, నిట్లే పరమేశ్వ రుడు తమపై నిరుపమాన కటాక్షమును చూపుచు,

తమ యేలుబడిని చిరస్థాయిగావించి, తమకుటుంబమును శాశ్వతముగావించి, తమపై సమస్తాశీర్వాదములను వెద జల్లుగాక యని మిక్కిలి భక్తి నమ్రతలతో పరమేశ్వ రుని వేడుకొనుచున్నారు. తమ రాజ్యము నిరుపమాన ముగా నభివృద్ధిపొందుగాక! ఆసఫ్జాహి కుటుంబమును రాజ్యమును శాశ్వతముగా వర్ధిల్లుగాక!"

శ్రీ మహారాజావారు పై సంగతులన్నియు గల వినతిపత్రము ముగించునప్పటికి సభాసదులు "చదువుట మైపోయెనే" యన్నట్లు నిర్విణ్ణులయిరి. ఏమి యభివృద్ధి! ఎంత యభివృద్ధి! నిజముగా జరిగినదానిలో చెప్పినది శతాంశమే యనక తప్పదు. హృదయము భావపూర్ణ మయినతరి వాక్కు పూర్తిగా పలుకజాలదు. పైన చెప్పిన యభివృద్ధి యంతయు శ్రీ మహారాజావారి ముఖ్యసాచివ్యము, సర్ అక్బరు హైదరీగారి యార్థిక విన్యాసము, శ్రీవారికి తోడ్పడి జరిగినది! పై వినతి పత్రమునకు శ్రీవా రిచ్చిన పత్యుత్తరమునందలి కొన్ని భాగములనుకూడ ననువదించిన, శ్రీవారి పవిత్రాశయ ములు తెల్లముకాగలవు.

శ్రీ ప్రభువుగారి సమాధానము :

శ్రీవారి సమాధానమున రెండు ముఖ్యవిషయములు స్పృశింపబడినవి. మొదట తమ ప్రియప్రజలు తమ ప్రభుత్వమున కియ్యవలసిన షుమారు 40 లక్షల రూప్యముల బాకీలను రద్దుచేయుట. దీనివలన ప్రజ లెంత తుష్టినందిరో చెప్పనలవికాదు. శ్రీవారికి ప్రజలన్న నెంతప్రీతియో, ప్రజాక్షేమమన్న నెంతప్రియమో, యీ యొకవిషయము సాక్ష్యము నియ్యజాలును. రెండవది శ్రీ హైదరీగారి యార్థికవిధానప్రశంస. దీని వలన రెండు ప్రయోజనములు. విధానముచే రాష్ట్రాభివృద్ధి కలిగినదని శ్రీవారు తలంచుట మొదటిది. అట్లు శ్రీవారు తలంచినట్లు తెలియుటచే శ్రీ హైదరీగారికి కల్గు నుత్సాహము రెండవది. ఈ రెండుభావములును భావ్యభివృద్ధికి కారణము లయ్యెను.

ఈ రెండు విషయములను స్పృశించుచు శ్రీవారానతిచ్చిన యితరవాక్యములనుకొన్నిటిని మనవిచేయుదును. (ఈ వాక్యములను శ్రీవారి ప్రత్యుత్తరములో నచ్చటచ్చటనుండి సంగ్రహించినాను. గ్రంథకర్త)

"నా ప్రియప్రజల సేవకై నాజీవితమును సమర్పించుచున్నాను. వారికి నేను సేవకుడ నని చెప్పుటకంటె నాకు గర్వకారణము గానరాదు. ప్రథమము నుండి మా కుటుంబరాజులకు జాతి, మతభేదమును పాటింపక ప్రజలను ప్రేమించుటయు, వారి క్షేమమే తమ యాశయ మనుకొనుటయు, నొక ముఖ్యసంప్రదాయమైపోయెను. ఈయనూచానాచారమును నేనును ననుసరించుచునేయున్నాను.

నేనుచేసిన స్వల్పసేవచే నాప్రజలకు సౌఖ్యమును, సంతృప్తియు కలిగినయెడల నేను ధన్యుడ నని తలంచుచున్నాను. ఈదినమున జాతిమతభేదములు లేక నా ప్రజలందరును నైకకంఠ్యముగా నా కీ యభినందన పత్రమును సమర్పించిరను విషయముకంటె, నాకు సంతోషదాయకమగు నంశముగానరాదు. ఇట్లు సంతసించుట యందరు రాజులకును సులభముగాదు."

శ్రీవారు ప్రభుత్వముయొక్క యన్నిశాఖలయందును కలిగిన సర్వతోముఖాభివృద్ధిని యుల్లేఖించిరి. విద్యాశాఖనుగూర్చి యిట్లు సెలవిచ్చిరి.

"విద్య ప్రతిదేశమున కాత్మవంటిది. విద్యలేని దేశము నిర్జీవశరీరమువంటిది. ఇంతవరకు నారాజ్యకాలమున కొంతవిద్యాభివృద్ధి జరిగినను, నింకను నభివృద్ధికి తావుకలదు. ప్రాథమిక పాఠశాలల సంఖ్య హెచ్చించి, ప్రజలకు దానియొక్క ప్రయోజనము నిచ్చి, ప్రారంభవిద్యను సార్వజనీనముగా నొనర్చుట నాగట్టి యాశయము. ఉస్మానియా విశ్వవిద్యాలయము నాకు మిక్కిలి ప్రియమైనసంస్థ. ఇంతవరకు దాని యభివృద్ధి సంతోషదాయకమేయైనను, వ్యాయామక్రీడల యందెక్కు డభివృద్ధి చూపవలెననియు నా యాశయము."

వ్యవసాయదార్లయొక్కయు, రైతులయొక్కయు కష్టసుఖములను చర్చించుచు, తమ ప్రభుత్వము వారి కష్టసుఖములనుగూర్చియు, నార్థికాభివృద్ధిని గూర్చియు, సాంఘిక సమస్యను గూర్చియు శ్రద్ధవహించుచున్నదని సెలవిచ్చిరి.

"రైతులయెడల నాకుమిక్కిలి ప్రీతికలదు." అను పవిత్రవాక్యములు రైతులకందరకును తప్పక సంతోష దాయకములై నరలినది.

శ్రీవారు శ్రీహైదరిగారిని గూర్చి యీ క్రింది ప్రియవాక్యములను సెలవిచ్చిరి.

"నా రాష్ట్రముయొక్క యార్థికాభివృద్ధి కంతకును శ్రీ సర్ అక్బరు హైదరిగారి నిరంతరకృషి ముఖ్యకారణము. ఆయనయొక్క జీవితములోని చాలభాగము నాకును, నా రాజ్యమునకును ప్రీతిపూర్వకమగు సేవచేయుటలో వినియోగించిరి. ఈ విషయమును తెల్పుట నాకు మిక్కిలి ముదావహమైయున్నది." ఈ వాక్యము లెంత యుత్సాహజనకములు!

తుదకు తమ రజతోత్సవ సందర్భమున, జాతిమత వివక్షతలేకుండ ప్రజలందరును నుత్సవములయందు పాల్గొని, తమ యుత్సాహమును వెల్లడిచేసినందులకు తమ సంతసమును తెల్పుచు, వారి రాజభక్తియు, ప్రేమయు, రాష్ట్రాభివృద్ధికై తమ నింకను ప్రయత్నములు సల్పుటకు పురికొల్పుచున్నవని సెలవిచ్చిరి.

పై వినతిపత్రిప్రత్యుత్తరమేగాక రజతోత్సవ సందర్భమున తమ ప్రజలకు శ్రీవారీ క్రింది సందేశమును ప్రసాదించిరి.

'ఈ దినముతో నా వయస్సున 50 సంవత్స రములును, నారాజ్యకాలమున 25 సంవత్సరములును, సంపూర్తియగుటచే నీదినము నాజీవితమున గర్వకారణ మగు దినము. నా యథాశక్తిగా నీకాలమున రాజ్య భారమును నిర్వర్తించినాను. ఇప్పుడు రాష్ట్రమున నంత టను గన్పట్టుచున్న సంతోషమంతయు, నాసుపాలనా ప్రయత్నఫలమే! ఈ కాలమున నా ప్రియ ప్రజలంద రును నాయెడల సాటిలేనియు, నచంచలమగు నట్టియు, రాజభక్తితో మెలగియున్నారు. ఆ విషయము నాకు సంతోషకరమనుటయేగాక, వారి రాజభక్తిని నా జీవి తాంతము వరకును మరువజాలను. దయామయుడగు భగవానుడు ప్రజాపాలనా భారమును నాభుజముల నెంతకాల ముంచదలచునో, యంతకాలమును, నీ రాజ భక్తినిట్లే యుంచుగాక యని ప్రార్థించుచున్నాను! ఆ పరమేశ్వరకటాక్షము నాదేశమునకును, నాకుటుంబము నకును, సాటిలేని పేరుప్రతిష్ఠలనిచ్చి, భావి ప్రపంచము కొనియాడి యాచరించునట్టి కొన్ని పవిత్రకార్యముల నొనర్ప నన్ను పురికొల్పుగాకయని మనఃపూర్వకముగా కోరుచున్నాను!'

పై వాక్యములు శ్రీవారి పవిత్రసంకల్పములను సూచించుచు నేవో మహాకార్యములను చేయుటకు వారు సంకల్పించి యున్నారని స్పష్టముచేయుచున్నవి. వారు సంకల్పించు మహాకార్యములు దేశక్షేమముచేసి, తప్పక వారి కుటుంబమునకు చిరస్థాయిగా నుండుకీర్తిని సమకూర్చుననుటలో నెట్టి సందేహమును లేదు! శ్రీవారు సిద్ధకల్పులనియు, దేశక్షేమకార్యముల నాచరించుటలో సిద్ధహస్తులనియు, పై చరిత్రవలననే స్పష్టమైయున్నది!

ఈ రజతోత్సవము తరువాతకల్గిన రెండుమార్పులను మనవిచేయవలెను. బహుకాలము రాజ్యభారమును వహించి, వయోవృద్ధులై, సమస్త రాజగౌరవములను పొంది, "రాజ్యదక్షిణహస్తము" (యామీనుస్సల్తనత్) నను బిరుదమును వహించి, మూర్తీభవించిన హిందూ ముసల్మాను సఖ్యతాయన్నట్లు రెండుమతములవారిచే తను సమానగౌరవమునందుచున్న శ్రీమహారాజా సర్ కిషన్ ప్రసాదు బహద్దూరువారు తమకు విశ్రాంతిని దయచేయవలసినదిగా తమ యేలికకు సవినయముగా విన్నవించుకొనిరి. శ్రీవారికిష్టములేక పోయినను, మహా రాజావారి నమ్రశరీరమునుచూచి యియ్యకొనవలసి

వచ్చెను. ఈ విషయము రాష్ట్రమున కంతకును విషాద కారణమయ్యెను. శ్రీవారు మహారాజా వారి గృహాము నకుదయచేసి, తమ విచారమును వెలిబుచ్చి, విరామమున కనుజ్ఞను దయచేసిరి. మహారాజావారి రాజ్యతంత్ర ఘట్టము ముగిసినది. రాజ్యాభివృద్ధితో నవినాభావ సంబంధముగల్గి, మరువదగని గొప్పదనమును గల్గి, యా ఘట్టమాయనకు, చిరకీర్తినొసంగె ననుట కెట్టియభ్యం తరము లేదు! మొన్న మొన్నటివరకును వారు తమ వయోబుద్ధి పరిపాకములను తమ యేలికకును, రాష్ట్ర ప్రజలకును, సమర్పించుటకు సంసిద్ధులైయే యుండి 1939 సంవత్సరమున జరిగిన హిందూముసల్మాను కలహ సందర్భంబున, వారు తమ లేఖమూలమున రాష్ట్రము నకుచేసిన సేవ నిరంతర స్మరణీయము. రాష్ట్రమునకు తీరని లోటును కలుగజేయుచు వీరు 13-5-40 తేదీన పరమ పదించినారు.

వారిస్థానమునకు, దాదాపు ముప్పది సంవత్సర ములు, ననగా తమ యౌవనకాలమంతయు రాష్ట్రాభ్యు దయమునకు వినియోగించి, రాష్ట్రముయొక్క యార్థి కాభివృద్ధిని శాశ్వతములైన పునాదులపై నెలకొల్పి,



సర్ అక్బరు హైదరీ, నేవాబు హైదర్ నవాజుజంగు బహద్దరువారు,
సి. సీ; కె. టీ; యల్, యల్, డి;

శ్రీవారిని తమ రాజకార్యములచే మెప్పించి, యీయన మన్ననకుకూడ వడిసిన శ్రీ హైదరీగారు ప్రధానమంత్రి పదవిని స్వీకరించుట రాష్ట్రభాగ్యమని చెప్పుట సత్యమే యగును ! భావిచరిత్రమును భావిచరిత్రకారునికి వదలెదను.[1]

ii రాజ్యాంగ పరివర్తనము

వెనుక శ్రీవారు రాజ్యాంగమందు గొన్ని మార్పులనుగావించుచు ఫర్మానానుదయచేసినట్లు చెప్పి యుంటిని. దానివివరములనిచ్చుట మనవిచేయుచున్నాను. ఫెడరల్ విధానమునుగూర్చి బ్రిటిషిండియాలోని స్వతంత్రరాష్ట్రములకును, సంస్థానములకును, కొంతసంఘర్షణము జరిగెను. అప్పటికి కాంగ్రెసువారు బ్రిటిషిండియా యందలి యెనిమిదిరాష్ట్రములలో ప్రభుత్వమును నడపుచుండిరి. అందుచే కాంగ్రెసునకు కొంతబలమలవడి యుండెను. కావున కాంగ్రెసునాయకులు తాము ఫెడ

1. **1941** సంవత్సరము జులై మాసాంతమున నిండియా గవర్నమెంటు వారి యొత్తిడిచే శ్రీ హైదరీగారు తమ ప్రధాన మంత్రిత్వమును వదలి ప్రస్తుతము జరుగుచున్న యుద్ధకార్యములకై విపులము చేయబడిన వైస్రాయి కార్యనిర్వాహక వర్గములో చేరిరి.

రల్ విధానమున కెంతమాత్రము నంగీకరింపమని గొంతె త్తిచాటిరి. అట్లు వారంగీకరింపక పోవుట కనేక కారణములను తెల్పిరి. బ్రిటిషిండియానుండి ఫెడరలు సంఘమునకు సభ్యులెన్నుకొనబడుదురు కావునను, సంస్థానములయందు ప్రజలకెన్నిక స్వాతంత్ర్యము లేనందున ప్రతినిధులు ప్రభువులచే నియమింపబడుదురు కావునను, నీయసమానతకు తామంగీకరింప జాలకుండుట యొకకారణము. అందుచే సంస్థానములలోకూడ, బాధ్యతాయుత ప్రభుత్వమును నెలకొల్పునట్లుగా, సంస్థాన ప్రభువులను బలవంతపెట్టవలయునని, గవర్నమెంటు వారిని కాంగ్రెసునాయకులు హెచ్చరించిరి. బ్రిటిషు గవర్నమెంటువారు తాము సలహానియ్యగలమేగాని బలవంత పెట్టజాలమనిరి. కాని లోలోనను, బయటను, సంస్థానాధిపతులను మాత్రము హెచ్చరించిరి. అప్పట్లో ఫెడరల్ విధానము తప్పకవచ్చునట్లే యుండెను. గాన కొన్ని సంస్థానములలో రాజ్యాంగమందు కొన్నిమార్పులు జరిగెను.

హైదరాబాదునను చాలకాలమునుండి శాసన సభను విస్తరించి కొన్నియెన్నిక హక్కులను ప్రజల

కియ్యవలెనని ప్రభుత్వమువారు తలంచుచుండిరి. శ్రీ హైదరీగారీ సమయమును చూచి, శ్రీవారికీవిష యమున మనవిచేయగా నుదారహృదయులును, ప్రజా క్షేమైకతత్పరులును నగు శ్రీప్రభువువారంగులకు సమ్మతించి, యొక ఫర్మానాను దయచేసిరి. ఈ ఫర్మానాను 22 – 9 — 37 తేదిన జరిగినశాసనసభలో తద ధ్యక్షులైన శ్రీ హైదరీగారు చదివిరి. చదువుచు నీ క్రింది వాక్యములను సెలవిచ్చిరి.

"మహాఘనత వహించిన ప్రభువుగారు మీకు పంపుచున్న ప్రియసందేశమునకు నేను వార్తాహరుడనై నందులకు గర్వపడుచున్నాను. ఈ సందేశమూలమున నీ సభాచరిత్రమున నీ దినము చిరస్మరణీయము! తత్సం దేశమునకు తగిన గౌరవ మొసంగుటకై దాని నుత్తి ష్ఠులై యాలకింపవలయునని వేడుచున్నాను.

(ఫర్మానా నీ క్రింద బొందుపరచుచున్నాను.)

"నా ప్రజలయొక్క నైతికవిద్యాభివృద్ధుల ననుస రించి, వానికి తగినట్లు శాసనసభావిస్తారమునకు వలయు సామగ్రిని సేకరింపవలెనని, యప్పటి కార్యనిర్వాహక

సభాధిపతిని కోరుచు, వెనుక నొక ఫర్మానా నిచ్చి యుంటిని. నా ప్రజలయొక్క యవసరములను, కోరిక లను, నిరంతరముగాను, సంపూర్ణముగాను, నా ప్రభుత్వ మునకు తెలియజేయగల్గి, రాష్ట్రమునందలి యన్ని ముఖ్యవృత్తులవారికిని (Interests) ప్రాతినిధ్యమును వహింపగల సంస్థనుగాని, సంస్థలనుగాని, నెలకొల్పి, నా ప్రజలకును, ప్రభుత్వమునకును గల సంబంధము నభివృద్ధిపరుపవలెనని, చాలకాలమునుండి దీర్ఘాలోచన సల్పుచుంటిని. ఈ విషయమున నా కార్యనిర్వాహకసభ యొక్క యభిప్రాయము నడుగగా, వా రిచ్చిన సలహా నాకు ప్రోత్సాహకరమయ్యెను. కావున నా జూబిలీ సంవత్సరము ముగియకపూర్వమే, యీ విషయమున కొన్ని ప్రారంభకార్యములు జరుగవలెనని నిశ్చయించి నాను. ఈ విషయమున నాలోచించి, తాత్కాలికమగు ప్రణాళికను తయారుచేయు భారము, నా కార్యనిర్వా హకసభ కనుబంధమగు రాజ్యాంగసభపై (constitution committee) మోపితిని. కాని యధికారసభ్యు లును, ననధికారసభ్యులును గల్గి, స్వాతంత్ర్యమును, నను భవమును గల యొక సంఘముయొక్క యభిప్రాయము

ముందుండినయెడల, ప్రజలకు సంబంధించిన యిట్టి కార్యము, నా రాజ్యాంగసభకు సులభసాధ్యమగునని నేనును నా మంత్రులును తలంచుచున్నాము. ఈ కమిటీలో సభ్యు లెవ రుండవలెను, వా రే విషయములను చర్చించి సలహా నియ్యవలెను, నను సంగతులలో నా యభిప్రాయములను, మీ సభకును నా కార్యనిర్వాహక సభకును నొక(వ్యక్తియే యధ్యక్షుడుగాన, నాయనయే వానిని మీకు తెల్పుచు నా సందేశమును మీకు విశదముచేయుచున్నాడు. ఈ కార్యము సాధ్యమైనంత త్వరలో జరుగవలెననియు, నారు మాసములలోనే కమిటీ తమ నివేదికను సమర్పింపవలెననియు, నాకోరిక. కమిటీవారు తమ బాధ్యతను జాగ్రత్తగా గుర్తెరిగి, తమ విధికి తగినట్లు నిర్వర్తింతురని నమ్ముచున్నాను. ప్రయత్నమే నాదిగాని ఫలదాత దయామయుడగు భగవంతుడే! ”

ఈ ఫర్మానాను పఠించి శ్రీ హైదరీగారు సభ్యులు మొదలైనవిషయములనుగూర్చి యిట్లు తెలిపిరి.

**అయ్యంగారు కమిటీ :**

శ్రీ ది॥ బ॥ ఆరావముదయ్యంగారు (వీరిని

శ్రీ ప్రభువువారు కమిటీ యధ్యక్షులుగా నుండుటకు దయతో నియమించిరి. వీరికి కాస్టింగువోటు హక్కుం డును.)

2. గులాం మహమ్మదు కురేషి, హెచ్. సి. యస్. గారు
3. ప్రొఫెసరు ఖాదరు హుస్సేన్ ఖాన్ గారు.
4. కాశీనాథరావు వైద్యాగారు.
5. మీర్ అక్బరల్లీ ఖాన్ గారు.

ఈ కమిటీకి కార్యదర్శిగా శ్రీసయ్యదు యూసు ఫల్లీ, హెచ్. సి. యస్. గారు ప్రత్యేకముగా నియమింప బడిరి. కమిటీ చేయవలసినపని యిట్లు వివరింప బడినది:-

రాష్ట్రముయొక్క స్థితిగతులను, నావశ్యకతను, పురస్కరించుకొని, రాష్ట్రమునందలి యన్ని వృత్తుల వారికిని, ప్రభుత్వమునకును, పరస్పర సన్నిహిత సంబం ధము కల్గి, వారికోరికలు ప్రభుత్వము కనుగొనుట కే యే మార్గము లవలంబింపవలెనో పరీక్షించి నివేదిం చుట.

ఈ విధమున ప్రజాప్రభుత్వముల మధ్య సలహా నభివృద్ధిపరచుటకు మ॥ ఘ॥ వ॥ ప్రభువుగారు చూపిన

త్రోవకు కృతజ్ఞతనుచూపి, వారి పవిత్రాశయమున కీ పట్టణ ప్రముఖులేగాక యావద్రాష్ట్రమును స్వాగతము నిచ్చునని యాశించుచున్నాను.”

రాజున కనుచూపుడైన మంత్రి! నైజాము రాజ్యమెట్టి యభివృద్ధిలేక, పాత్రబూజుపట్టిన పద్ధతులే యనుసరింపబడుచున్నవనియు, నెట్టి మార్పున కుత్సాహమును, నుద్బోధమును లేదనియు, ప్రభుత్వము నిరంకుశమై యెట్టిప్రజాశయములకు తావిచ్చుటలేదనియు, చెప్పు వైదేశికుల పలుకులన్నియు, నబద్ధములని యిందుతో నిర్ధారణమగుచున్నది.

## ౨. శ్రీ ప్రభువువారి గుణగణము [1]

ఈ కథ దాదాపు సంపూర్తియైనది. ఏతత్కథకు నాయకులైన మ॥ఘ॥వ॥ శ్రీ ప్రభువువా రెట్టి శీలవం తులో తెలుసుకొనుటకు పాఠకు లువ్విళ్ళూరుచుందురు. శీలనమనగా నొక వ్యక్తి యాచరణమునుండి గ్రహింప దగినది కావున, తెలుసుకొనుట మిక్కిలి కష్టము. "తత్రాపి" యత్యంత నిశితప్రవర్తనముగల శ్రీ వారి శీలము గ్రహించుట కష్టతరము. కాని వారు ప్రతి దినము చేయునట్టియు, జనసామాన్యమునకు తెలియు నట్టియు, కొన్ని పనులను తెల్పినవానినుండి శ్రీ వారి శీలమును గ్రహింపనగును.

శ్రీవారి తండ్రిగారు సర్వమతసమత్వమునకు మూర్తియై రాజర్షిగుణములు కల్గియుండిరి. "ఆత్మావై పుత్రనామాసి" యన్నట్లు, శ్రీ వారును నాగుణమున

1 ఈ భాగమును వ్రాయుటలో దక్కను క్రానికలు పత్రికలో శ్రీ బి. ఆర్. బారిగారు వ్రాసినవ్యాస ముపకారకమయ్యెను.

తండ్రిగారి కెంతమాత్రమును దీసిపోవువారు కాకపోవు టయేగాక, తమరొనర్చు ప్రతికార్యమును, తానుపరి పాలించుచున్న కోట్ల హిందూప్రజలకు కష్టమును కల్గించునా యని సర్వదా పరీక్షించి చేయుచుందురు. [2]మత సామరస్యమునకై బ్రిటీషు ప్రభుత్వమువారు చేయలేని పనిని శ్రీవారు చేసిరనుట కెట్టి యభ్యంతరమును లేదు. ఇచ్చట నమలుననున్న గోవధ నిషేధమింక నెచ్చటనైనగలదా ? నిషేధింపుమని వేడిన బ్రిటీషు వారు చేయుదురా ? రాష్ట్రమున నెన్ని హిందూసంస్థలు ప్రభుత్వమువారి సహాయమును పొందుచున్నవి ! ఎన్ని దేవాదాయములు, సత్రములు, మందిరములు, ప్రభుత్వాదరణమును బడయుచున్నవి ? జమీందార్ల యొక్కయు, జాగీర్దార్లయొక్కయు, సంఖ్యలను పరీక్షు చేసిన హిందువులే యధికసంఖ్యాకులని తెలియును. కావున శ్రీవారి సర్వమతసామరస్యము మిక్కిలి కొనియాడదగిన మొదటిగుణము. అధిక సంఖ్యాకులగు

2 శ్రీవారు లక్షరూప్యములు హిందూ విశ్వవిద్యాలయమునకును, మరియొకలక్ష యాంధ్ర విశ్వవిద్యాలయమునకును దానమొసంగిరి.

హిందువుల తృప్తియు, రాజభక్తియు, నీగుణమునకు సాక్ష్యములు.

ప్రతిదినమును సాయంకాలము 5–6 గంటలకు మధ్య పట్టణ మధ్యమున నిలిచిన, పోలీసుభటు లీలలను వేయుచు నటునిటు చూచుటను, బాటసారులను బండ్లను నాపుటయు, మనము చూడగలము. నూతనున కేమిది యని యాశ్చర్యముకల్గును! రాజాగమన సూచకమని దెలిసినవెంటనే రాజదర్శన కుతూహలము గల్గును. ఇంతలో ఖాళీరోడ్డుపై నొక మోటారువచ్చుటయు, నందు శ్రీవారాలోచనా మగ్నమగు ముఖముతో కూర్చుండుటయు చూడగలము. బహిర్దర్శనమే యాయన శీలమునకు కిటికీవంటిది. నిరాడంబరత్వము యొక్క మూర్తి యని వెంటనే తెలిసికొనగలము. ప్రతిదినము నీవేళకుపోవునే! ఎచ్చటికి? నను ప్రశ్నమునకు, తల్లిగారివద్ద కను సమాధానము వినునపుడు, వారియెడల గల గౌరవ మినుమడించును. రాజై, రాజ్యకార్యమగ్నులై, కాలము విలువగల్గి యున్నను, మాతృశ్రీగారి దర్శనమునకు ప్రతిదినమును వెడలుటవలన "మాతృదేవో భవ" యను నుపనిష

ద్వాక్ష్యమును వారు సదా యాచరణమునం దుంచు కొనుచున్న మహనీయులని వెంటనే స్ఫురించును. ఎందరినిగూర్చి మన మిట్లు చెప్పగలము? పరివారము లేక, నేపథ్యాదికము లేక, నిరాడంబరముగ మాతృసందర్శనమునకు ప్రతిదినమును పోయి, వృద్ధమాతృపూజ సల్పుచున్న మహనీయు డాదర్శప్రభువని వేర చెప్పవలయునా? శ్రీవారినుండి ప్రతిమానవుడును గ్రహింపతగిన గుణపాఠమిది! ఇట్టి పవిత్రజీవినిగన్న మాత ధన్య![1]

శ్రీవారు దైవభక్తి, పాపభీతి, కలవారని మున్నె విన్నవించియుంటిని. వారు తమ జుమ్మాప్రార్థనములను జరుపుచున్నపుడు చూచిన, వారి సర్వమానవ సౌభ్రాతృ చిత్తవృత్తి వ్యక్తముకాగలదు. వారితోబాటు ప్రక్కన చినిగిన వస్త్రములతో నుండు దరిద్రులుకూడ ప్రార్థనము జరుపుటను చూడగలము. దైవదృష్టియందు ధనిక దరిద్రభేదము లేదనియు, నందరు నాయనపుత్రులే

1. ఈ రాజమాతగారిటీవలనే, యనగా 14—4—'41 తేదీన పరమ పదించినారు. రాష్ట్రమంతయు రాజభక్తిని వెల్లడించెను. శ్రీ ప్రభువుగారు తమ సంతాపమును, మనస్స్థితిని నొక ఫర్మానామూలమున వెల్లడి చేసినారు.

యనియు, ప్రార్థనకావించుట కెందరను సమాన హక్కులున్నదనియు, శ్రీవారి పవిత్రాశయము నీవిధముగా నాచరణములో నుంచుచున్నారు. విశేషదివసముల నెన్నడైన జుమ్మామసీదుకు పోయినను, నచ్చటగూడ వారి ప్రవర్తన మిట్లేయుండును. మతగురువు శ్రీ ఖురాను షరీఫునుండి వాక్యముల ననువదించి యర్థమును చెప్పు నపుడు, శ్రీవారి ముఖవిలాసము, శిరఃకంపాదికమును, జూచిన వారి యాధ్యాత్మిక హృదయము వెల్లడి కాగలదు. ఉద్యానవనమున తమ ప్రత్యేకప్రార్థనము లకు రాజభవనమునకు దగ్గరగనుండున ట్లొక మసీదును నిర్మింపించిరి. శుక్రవారము మధ్యాహ్న మామసీదు పెద్ద లకును పిన్నలకును ప్రార్థనా కేంద్రమయినది. రజతో త్సవ ప్రథమదివసమున శ్రీవా రిచ్చటనే తమ ప్రార్థన ముల గావించిరి.

శ్రీవారు దర్బారుల నాసీనులైనపుడు వారిని చూచినవారు తప్పక రాజర్షియని కనుగొనగలరు. వారి ప్రవర్తనమువలన నీ సమస్తవైభవమును, పదవియు, నశ్వరములనియు, వానియెడ నిర్లిప్తులై మానవులు సంచ రింపవలెననియు, నను గుణపాఠములను నేర్చుకొందురు.

ఇంత వైభవముతో నున్నను శ్రీవారు తమ దృష్టులతో తమ పరిచితుల క్షేమమారయుచునే యుందురు. ఒక్కొకచో నా పరిచయము సన్నిహితమైనయెడ శ్రీవారు వారితో మాటలాడి వారిని ధన్యులనుచేయుట కూడ కలదు. రాజభక్తిపూరితులగు సేవకులకు రాజాదరణ వాక్యముకంటె నింకేమి కావలయును? అదివారి భావిపరిశ్రమముల కుత్సాహజనకమై దోహదమగును. నజరులను గ్రహించినపుడుగూడ, శ్రీవారు, తాము గ్రహించుచున్నామను నహంప్రత్యయమునగాక, తీసుకొనవలెను గాన తీసుకొనుచున్నట్లగపడుదురు. ఈ నిర్లిప్తత్వమే వారికి నిరాడంబరత్వము నిచ్చినది. వారి యాంతర ప్రవర్తనకు బాహ్యముసాక్షి. వారి జీవితమున వారు పాలించు ప్రజలకును, తమకును, నేమియు భేదము లేనట్లు వారు తలచుచున్నారని స్పష్టపడును. ఇస్లాం, హిందూమతములు రెండును భోగమునకంటె త్యాగమునే యెక్కువగ గౌరవించునట్టివి. అట్టి త్యాగబుద్ధి, నిరాడంబరత్వము, స్వాచరణమునందుంచి యితరులకు మార్గదర్శియగుట మొదలగు గుణములుగల్గు శ్రీవారు రాజగుట యీ రాష్ట్ర భాగ్యము!

లోకములో ప్రతీతివలన శ్రీవారు ప్రపంచము నందలి ధనికతముడని చెప్పుదురు. ఇందెంతసత్యమున్నదో మనకు తెలియదు. సత్యముండియుండును. కాని తా మంత ధనికులమని శ్రీవారి కహంప్రత్యయమున్నదా యనిన, లేదనిమాత్రము గట్టిగా చెప్పవచ్చును. శ్రీవారి సహజనిర్లిప్తత్వమే యిందులకుకూడా కారణము. అహం ప్రత్యయమెయున్న యెడల నింత నిరాడంబరత్వ మెక్కడ యుండును ? వారిలో సహస్రాంశమగు నైశ్వర్యము లేని వారైనను, హైద్రాబాదు నందలి యనేకులు నేపాథ్యాదికమున నాడంబరము వహింతురు. మొదటి నుండియు ననవసరధనవ్యయము గావించుచు, ప్రజా పాలనమున నెక్కుడు శ్రద్ధవహింపక, వినోదములతో కాలము గడపు జాగీర్దార్లకు శ్రీవారు మార్గదర్శకులై వరలిరి.

శ్రీవారి యుద్యోగస్థులలో చాల మంది యెండకాలమున చల్లని ప్రదేశములకు వెడలుట కలదు. కాని శ్రీవారు చల్లదనమునకుగాని, మరి యే యితర కారణములకుగాని, పట్టణమును విడుచుట

యెన్నటికిని మన మెరుగము. తప్పక పోయినపుడుతప్ప శ్రీవారు ప్రయాణముచేయరు. ఎండయైనను, వాన యైనను, చుట్టు నంటురోగము లున్నను, నెట్టి యాప త్కాలముననైనను, శ్రీవారు తమ ప్రజల నడుమనుండి, వారితో సంచరించుచు, వారికి ప్రోత్సాహమును కల్గించి, మార్గదర్శకులై యుందురు. తమ స్వపరిపాలనాకాల మున నెవ్వరును నెండకాలమున చల్లదనమని తమ నిర్ణీతకార్యములను వదలి వెడలరాదని యాజ్ఞాపించినట్లు కూడ వినికిడి.

శ్రీవారికి తమ రాష్ట్రమన్నను, ప్రజలన్నను, మిక్కిలి ప్రేమ యని యీ చరిత్రపఠనమువలన మనకు తెలియును. ఆ ప్రేమయొక్క పరిమితి యింత యని చెప్ప నలవిగాదు. "హైదరాబాదు నివాసి" శ్రీవారి రూపదర్శనము దినమున కొకమారైనను చేయకుండ జాలడు. వారు పోవుచున్న ప్రతిదిన ప్రయాణమును చూచుటకు వందలకొలది జనులు రోడ్డున కిరుప్రక్క లును నిలచియుందురన్న నిక వేరే చెప్పవలయునా? ఇట్టి ప్రతిదిన రాజదర్శనము ప్రజ కుత్సాహమియ్యదా? తమ ప్రజలు తమ దర్శనమునకై కాచికొనియుండుట

రాజునకు గర్వకారణముగదా? కాల మొక్కమాదిరిగ లేనియప్పుడును, పట్టణమున కలహములు జరుగు చున్నప్పుడును కూడ శ్రీవా రెట్టి సంకోచమును లేక, రక్షణము లేక, యథాప్రకారము తమ సంచారమును జరుపుచున్నారన్న, రాజ ప్రజానుబంధమునకు మేర కలదా ? రాజశరీరము పవిత్రమను నార్యోక్తి యిచ్చట యన్వర్థము, మరియు శ్రీవారు రాష్ట్రమునకు పితృ సమానులని ప్రజ లనుకొనినపు డిక వారి పవిత్రశరీర మున కేమి భయము? మరియొక విషయము. శ్రీవారు తమకుటుంబమున ఘోషాపద్ధతిని యవలంబించుట లేదు. ఇది మిక్కిలి గొప్ప విషయము ! తక్కుంగల వారికంద రకు మార్గదర్శకంబు.

శ్రీవారు పూర్తిగా స్వమతానుయాయి. శ్రీ ఖురాన్ షరీఫు ప్రకారము మానవు డెట్లు ప్రవర్తింప వలెనో యట్టి యాదర్శప్రవర్తన కలవారు. మీదు మిక్కిలి యెవరి మతప్రకారము వారు వర్తింపవలెనని వారి యాశయము. ఇంతకంటె "శ్రేయాన్ స్వధర్మః" అను గీతావాక్యానుష్ఠాన మెచ్చట నుండును? తన మత నియమములప్రకార మవలంబించు మతానుయాయి

కన్యమతసహనము సహజగుణము. శ్రీవారి మత సహనమున కిదియే కీలకము. ఇదియే వారి నన్ని మతముల వారికిని ప్రేమాస్పదులను చేసినది! రజతోత్సవసందర్భమున తమ సమ్మానమున నన్నిమతములవారును పాల్గొనుట తమకు మిక్కిలి ముదావహమని విన్నవించినారు !

శ్రీవారి వంశపు రాజులందఱును నిట్టి మతసహనము నన్యమతగౌరవమును కలవారే! అట్లు కాకపోయిన రాజేతర మతమువారగు కోట్ల ప్రజలయొక్క యాదరానురాగముల నెట్లు వడయగలరు? ఆ గుణము శ్రీవారి యందు మూర్తీభవించినది. అదియే యీ రాష్ట్ర శాంతికిని, రాష్ట్రాభ్యుదయమునకును మూలకందము.[1]

1 "సంకుచిత స్వభావుడనై, ఏ మతమువారియొక్కగాని, ఏ కులమువారియొక్కగాని, మతమునుగాని మనస్సునుగాని నొప్పించుట నా అభిమతము గాదు. అట్లని నా మతమునకు ద్రోహందనను అపయశమును ఆర్జించుట అంతకన్న నా అభిమతముగాదు. అన్ని మతములను భేదములేకుండా, ఎవరికి ఎట్టి అడ్డు కల్పించకుండా సమానదృష్టితో పరిపాలించుటయు, నా యొక్కయు, మా తాత తండ్రుల యొక్కయు గూడా నియమముగా నున్నది." అని మ. ఘ. వ. నైజాం ప్రభువు స్థానికపత్రిక ఒకదానికి అనధికార ప్రకటన చేయుచు వ్రాసిపంపెను.

ఆదర్శప్రభువు

శ్రీవారి జీవితమున నొక యాదర్శమును ముందుంచుకున్నారనియు, ధర్మము పవిత్రమని నమ్మి వారనియు, నందువలన వారుచేయు ప్రతికార్యమును నీ రెండు సూత్రములచే పరీక్షించుచుందు రనియు తెలియగలదు. అందువలననే యైశ్వర్యము, నాభి జాత్యము, వైభవము ననునవి నిరాడంబరత్వము, నిగ ర్వము, మాతృభక్తి, దయార్ద్రహృదయము మొద లగు గుణములతో కలసి క్షీరనీరన్యాయము ననుసరించు చున్నవి. ఈ వివిధ గుణగణసమ్మేళనము శ్రీవారి యొక్క యౌన్నత్యమును చాటుచున్నది. హృదయ మును ధర్మముపై కేంద్రీకరించుచు, ప్రవర్తనము నిర్దుష్టమైనగాని యిట్టి సమ్మేళనము నలవడ జేసుకొనుట యసంభవము. ఉచ్ఛృంఖల ప్రవర్తనమనుమాట యెన్న టికిని శ్రీవారి యెడల వర్తింపనేరదు. సత్పురుషుడుగాన "నంతఃకరణప్రవృత్తియే" వారికి ప్రమాణము. అట్టి మహామహుల కసత్ప్రవర్తనము నెడల నెన్నటికిని ప్రవృత్తియే కలుగదు.

శ్రీవారు సహజ కవులు. కవియగుటచే వారి ముఖమున వారి భావనాశక్తి ప్రతిబింబించుచుండును.

ముఖము తీవ్రతను, హాసమును గూడ నొందగలదు. ఒక్కొక్కప్పుడు పసిపిల్లవానివలె నిరంతరానందమున నుందురు. ఒక్కొక్కప్పుడు యోగివలె నాలోచనా మగ్నులై యుందురు. రాజవైభవముతో నున్నను సామాన్యపౌరునితో నభిన్నతను పొందునట్లు పొడగట్టు దురు. రాజకవచాదుల నలంకరింపబడియున్నను నవి విధియని ధరించునేగాని వానియం దభినివేశము లేదు. బహువర్ష రాజ్యభారముచేతనా యన్నట్లు నడుము కించిదాకుంచితము. కన్నద్దములలో నుండి తీక్ష్ణ దృష్టులు నిగుడుచుండును. రాజ్యకార్యములయందు మిక్కిల యప్రమత్తతయు, దానికి వలయు విమర్శజ్ఞాన మును, నుత్తమకవికి వలయు భావనాశక్తియు, శ్రీ వారియందు మిక్కిలి యన్యోన్యముగా మేళవించినవి. వారు తమ బహుముఖ ప్రవర్తనముచే, చిన్న దగ్గిర నుంచి పెద్దవరకు, ధనవంతుని నుంచి దరిద్రుని వరకు, సంకురకును నానందమును కలిగింపగల సమర్థులు.

శ్రీవారు తమ ప్రభుత్వ ప్రారంభ కాలమున స్వయముగా రాజ్యకార్యములన్నియు చూచుకొనిరి. అప్పుడు ప్రతి కచేరీయంమనును దోగ్యగులందరును శ్రీవా

రెప్పుడు వత్తురో యని యప్రమత్తులై స్వస్వకార్యము లను సరిగా నిర్వర్తించుచుండిరి. ఆ సంవత్సరములలో వారికి రాజ్యాంగమునందలి యన్నిశాఖలలోని కార్య క్రమమంతయు కరతలామలకమైపోయెను. వారి కష్టపడుండు నోపికకు పరిమితి లేకుండెను. రాష్ట్రములో నంతను కష్టజీవి యెవరన్న శ్రీవారేనని చెప్పవలసి యుండెను!

ప్రతి యుద్యోగియందును తాను ప్రజలకు సేవ జేయుచున్నానే కాని యధికారిని కానను భావమును కల్పించిరి. ఈ యనుభవ మిప్పటికిని శ్రీవారికి రాజ కార్యనిర్వహణమున సాయమొనర్చుచున్నది. తమ కర్తవ్యమును కొంత కార్యనిర్వాహక వర్గమునకు వదలినను, నిప్పటికిని సర్వవ్యవహారములను కనుగొనుచునే యుందురు. ఒకొక్కప్పుడు "ఇది యేమి" యని ప్రశ్నించుట కూడ కలదు. దైనందినరాజ్యకార్యములలో తమవద్దకు వచ్చు ప్రతి కాగితమును చూచిన వెంటనే యందలి లోపాలోపములు వారికి పొడగట్టును. అందలి నిగ్గును వారు గ్రహింపగలిగి, యెట్లు చేయవలెనో యట్లు చేయు చుందురు. అట్లు గాకపోయిన నింత స్వల్పకాలములో

రాష్ట్రమింత యభివృద్ధికి వచ్చునా? కార్యకరణము నందును, నధికారినిర్ణయము నందును, వారు చూపిన దూరదర్శిత్వమే రాష్ట్రమునింత యుచ్ఛస్థితికి తెచ్చినది. బీరారు సమస్యయెడల శ్రీవారు చూపిన పరాకాష్ఠ వర్ణనాతీతము. వారంత శ్రద్ధవహింపకపోయిన పరిణామ మిట్లు త్వరితముగను, సుఖముగను, జరిగెడిది కాదు. శ్రీవారి కార్యదీక్ష యప్రతిమానము!

శ్రీవారి దేశభక్తి యనిర్వాచ్యము. దేశము నెడలను, దేశీయ వస్తువుల యెడలను, దేశీయ సాంప్రదాయముల యెడలను, శ్రీవారి కత్యంతభక్తి. రాష్ట్రమున తయారైన వస్తువులనే శ్రీవారు సామాన్యముగా వాడుచుందురు. ఫర్మానులను చేతితో తయారుచేసిన కాగితములపై వ్రాయుచుందురు. రాష్ట్రమునందు తయారైన గుడ్డనే వాడుదురనియు, సబ్బునే యుపయోగింతురనియు, ప్రతీతి! ఇచ్చటి యనేకులగు ధనికులవలె విలువగల విదేశవస్త్రములను కొని, హెచ్చులకుపోయి ధనమును విదేశములకు పంపుట శ్రీవారికి బొత్తుగా గిట్టదు. ఈ రాష్ట్రమే వారి బహిఃప్రాణము! రాష్ట్రాభివృద్ధియే వారి యభ్యర్థ్యము!

శ్రీవారు, తమవలెనే తమపుత్రులుకూడ రాజ కార్యములందు దక్షత పొందవలెనను తలంపుతో, వారిని కొన్ని శాఖల కధ్యక్షులుగా నియమించిరి. ఘ॥ వ॥ బీరారు రాజకుమారులు ముఖ్యసేనానిగా నియమింప బడినతరువాత, సైనికశాఖలో ననేకములైన నూతన పరివర్తనములు కలిగెను. ద్వితీయపుత్రులు నగరాభి వృద్ధిశాఖాధ్యక్షులుగ చేయుచున్న పని కిప్పటి నగరాభి వృద్ధియే తార్కాణము. రాజు ప్రజలతో కలసిమెలసి రాజప్రజ లిరువురును రాజ్యాభివృద్ధికై పాటుపడ వలయునని శ్రీవారి యుదారాశయము. ఈ సంప్రదా యమును స్వవిషయమున వారు స్థాపించి, కుమారుల కందిచ్చినారు.

లక్ష్మీ సరస్వతు లిరువురును నొకచో నివసింప రను ప్రతీతి శ్రీవారియెడల వమ్మయినది. శ్రీవా రెంత ధనికులో, మైశ్వర్యవంతులో, యంత విద్యావిజ్ఞాన వంతులు. వారు రచించిన పద్యములను చదివినవారు వానిని మిక్కిలిగా ప్రశంసించుచుందురు. వానియందు కూడ వారి సర్వమతసామ్యము తెల్లమగుచున్నది. క్రిస్మస్ పండుగకు క్రీస్తుపై వారు వ్రాసిన గీతము నుదా

హరణముగా నియ్యనగును. అప్పుడప్పుడు ఫర్మాను లలోఁగూడ పద్యములను రచించుట కలదు. ఈ విషయమున శ్రీవారు వెనుకటి చక్రవర్తులగు విక్రమార్క-భోజులు, అక్బరు, ఔరంగజేబు, కృష్ణరాయలతో సమానులని చెప్పుటలో నెట్టి యాశ్చర్యమును లేదు. వారివలెనే వీరును కవిపండితులు. శ్రీవారికి "విద్యా చక్రవర్తి" యను బిరుద మున్నట్లు మన మిదివరలో తెలుసుకొనియున్నాము. ఫార్సీయందును నుర్దూయందును శ్రీవారు గొప్ప పండితులు! ఈ పాండిత్యము వారి సంభాషణములలోను, వ్రాతలలోను, వ్యక్తమగుచుండును.

ఈ విధమున లక్ష్మీ సరస్వతు లిర్వురును తమ యాశీర్వచనామృతవృష్టిని శ్రీవారిపై కురిపించి, యాదర్శప్రభువు నొనర్చిరి.

## నేటి హైద్రాబాదు :

ఒక్కమారు శ్రీవారు సింహాసన మధిష్ఠించిన కాలమున సెలవిచ్చిన వాక్యములను జ్ఞప్తికి తెచ్చుకొనిన వారు క్రియలో వాగ్దానమునెట్లు మించిరో తెలియగలదు. 30 సంవత్సరముల క్రిందటి రాష్ట్రము నిప్పటి

దానితో పోల్చిన యెడల నీ భేదము విస్పష్టము కాగ లదు. అప్పుడు స్వార్థపరులతో కచ్చేరీలును నుద్యోగ ములును, నిండియుండెను. ఇప్పుడు సేవయే పరమావధి! అప్పుడు బొక్క-సమున ఖాళీసంచులుం డెను. ఇప్పుడన్ననో యెప్పటికిని లోటులేని యార్థిక ప్రణాళిక! అప్పుడు రాష్ట్రమున స్వల్పసంఖ్యాకశాఖ లుండెను. ఇప్పుడు రాజ్యము సర్వరాజ్యాంగ శాఖా సంకలితము! పాఠశాలా సంఖ్యయందును, వ్యవసాయ సాధన సేకరణ నిర్మాణములందును, రాష్ట్రవస్తువులను రాష్ట్రాభ్యుదయకార్యముల వినియోగించుటయందును— నిది యది యననేల—సమస్త కార్యములందును, నితర రాష్ట్రముల కాదర్శ ప్రాయముగానున్నది.

ముప్పది వత్సరముల క్రిందట నిచ్చటికి విచ్చేసిన వారిప్పుడు వచ్చి, యిచ్చటి యాధునికసన్నివేశముల దిలకించి విస్మయమగ్నులగుచున్నారు. "వప్రప్రస్థలీ చుంబితాంబరములగు" భవనరాజములును, "నందన వనమునధఃకరించు" నుద్యానపరంపరయు, రాత్రికాల మును పగలు చేయజాలు విద్యుద్దీపావళీసముదాయము లును, "మణిహాటకా కలితములా" యన్నట్లుండు

రథ్యానివహమును, విద్యావిజ్ఞాన జ్యోతిని బాల బాలికావితతి కందిచ్చు పాఠశాలా సమూహమును, దశ దిశల వ్యాపించు పట్టణవైశాల్యమును, నిరంతర వైద్యసహాయదానమున నప్రతిమానములగు వైద్య శాలలును, రాష్ట్రమును శత్రుదుర్భేద్యము చేయజాలు సేనా నివహమును, నెచ్చట నేవిషయము జరిగినను నతి త్వరితముగ తెలిసికొనుటకు సాధనములగు టెలి గ్రాఫు టెలిఫోనులును, నెచ్చటికి వెడలవలెనన్నను స్వల్ప కాలమున చేర్చగల విమానాదిప్రయాణసౌక ర్యములును, మతములు భిన్నములైనను నేకనాగరికత గల్గి సోదరులవలె మెలగు ప్రజాసమూహములును, వైదేశికులకు స్వాగతమిచ్చి సమస్త సౌకర్యముల నల వరచు నతిథిశాలలును, సమస్తదిగంతరాగతవస్తు సమూహములతో నిండి కన్నులపండువు చేయజాలు విపణిజాలమును, ప్రజలను బిడ్డలవలె నేలుచున్న రాజ కుటుంబమును, కలిగి "మహీకంఠహార తరళ స్ఫూర్తిని" విడంబించుచున్నది.

**భావ్యభివృద్ధి సూచనలు :**

ప్రారంభించిన యభివృద్ధి పూర్తిగా తన గమ్య

స్థానమును చేరుట కింకను కొంచెముదూర మున్నది. అదికూడ తప్పక చేరగలదను సూచనలు గన్పట్టు చున్నవి. శ్రీ హైదరీగారి సూత్రములనే యాయన స్థానమున వచ్చినవారును తప్పక యవలంబింతురని యాశింపవచ్చును. కాని యొక్కమాట చెప్పవలసి యున్నది. రాష్ట్రప్రజలు హిందువులుగాని, మునల్మానులుగాని తమ స్వసంఘలాభములను కొంచెము వెనుకనుంచి, పరమేశ్వరాజ్ఞచే తామేకస్థలమునం దుండవలెనని గమనించుచు, పరస్పర సహానముతో వర్తింపవలెను. వైదేశికుల దుస్సలహాలను విని, వారు చెప్పిన ట్లాచరించుట రాష్ట్రాభ్యుదయకార్యము కాదు. అట్టితరుల సలహాలను వినుటచే నిటీవల కొన్నియిక్కట్టులు తటస్థించినవి. పరమేశ్వరానుగ్రహముచే శాంతిపరిస్థితు లేర్పడినవి. మరల వాతావరణమును చెడగొట్టుకొనుటవలన ముప్పేగాని లాభములేదు. అట్లుచేయుటచే మన యేలికకు మనస్తాపము కల్గించినవార మగుదుము. సాధువులకు కోపము కల్గింపరాదు!

రాజ్యాంగప్రణాళికసమలులో పెట్టవలెనని ప్రభుత్వము ప్రయత్నించుచున్నట్లు వార్తలు వినవచ్చు

చున్నవి. వానిని విశాల హృదయముతో నాదరించి, వానిప్రకార మాచరించి, దేశాభ్యుదయమునకు పాటుపడి, యేలికయెడల మన కర్తవ్యమును నిర్వర్తించుట పరమధర్మము. మన యేలికయే మన యభివృద్ధికి తగినమార్పుల నప్పటప్పటికి చేయగలరు. ఇరువాగులవారి భక్తిని చూరగొనినవారగుటచే, వారు త్రాసున తూచిన ట్లిరువాగులవారికిని న్యాయమును సమానముగా పంచిపెట్టగలరు! శిశువులైనను పారాడిన తరువాతగదా నడచుట! కావున నిట్టివిషయముల యందు తొందరపడక సహనము వహించియుండుట యవసరము.[1]

## నా కర్తవ్యము :

నా కర్తవ్యము పూర్తియైనది. ఆరబ్ధకార్య పరిసమాప్తికంటె ముదావహ మేమున్నది? ఉడుత కుడుత

1 ఇటీవల 1941 సంవత్సరము మే మాసమునుండి ప్రచురణశాఖవశమున, హైదరాబాదు ప్రభుత్వమువారుచేయు సర్వతోముఖ కార్యములను, వానివలన కలుగు నభివృద్ధిని ప్రజలకు తెల్పి ప్రజల సహకారమును బడయుటకై "హైదరాబాదు సమాచార"మను పేర ముల్కీభాషలగు తెనుగు, కన్నడము, మహారాష్ట్రములలో పత్రిక నొకదానిని ప్రకటించుచున్నారు, ఇది యొక గొప్పపని.

భక్తియున్నట్లు నా చరిత్రమును రాష్ట్రీమున కర్పించినాను. నేను భాషాసేవకుడ నగుటచే కొన్నివిషయములలో చారిత్రకదృష్టి కొరవడియుండును. భావిచరిత్రకారు లట్టివానిని సర్దగలరను నమ్మకముకలదు. ఇదే సెలవు!

సమాప్తము.